Others say they will make you beautiful. We know you already are.

Celebrate the real you.

Beyouty. An innerwear designed for the real me - true comfort, soft fabric, perfect fit. So thoughtful, it's as if it's designed by a friend.

Beyouty™

*You deserve it*

NEW YORK • LONDON • PARIS

BRANDIS INDIA

MARKETING TO INDIA

For enquiries call +91 9972399488 / 080 41170656 www.brandisindia.com



THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

సపరివార పత్రిక

స్వాతి

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM


## ఓడినా గెలుపే!

చాలా సందర్భాలలో ఓటమి నిస్పృహను కలిగిస్తుంది. కానీ గొప్ప గొప్పవారికి కూడా ఓటమిని రుచి చూడక తప్పలేదని మనం అర్థంచేసుకోవాలి.

అపజయాలను గురించి మీరు విస్పష్టంగా ఆలోచించగలగాలి. తెలివిగలవారు కూడా ఎందుకని ఓటమి పాలవుతారు?

దానికి చాలా కారణాలు ఉండవచ్చు. కానీ ఓటమి అనేది అసలు విషయంకాదు- ఎందుకంటే అత్యుత్తములైనవారికి కూడా ఓటమి తప్పకపోవచ్చు.

ఆ ఓటమి నుంచి మనం ఏమి నేర్చుకున్నామన్నదే విశిష్టమైన విషయం.

విజయం ఒక మెట్టు దూరంలో చేజారిపోతే దాన్ని అపజయంగా నిర్ణయించవచ్చా? నిర్ణయించకూడదు. ఆ అపజయంవల్ల మనిషి చలించకుండా ఉన్నాడా, లేదా? కష్టాలముంగిట ఎన్నటికీ లొంగిపోని ధైర్యమూ, అనుకున్నది సాధించే శక్తీ (సంకల్పశక్తి) ఆ మనిషికి ఉన్నాయా, లేవా? ఇవే అసలైన విషయాలు.

"మీరొక దీపాన్ని తల్లక్రిందులుగా పట్టుకున్నా దాని మంట ఎప్పుడూ తల్లక్రిందులు కాదు.

అదే విధంగా బలమైన వ్యక్తిత్వమూ, అనుకున్నది సాధించే శక్తి (సంకల్పశక్తి, ఇచ్ఛాశక్తి) ఉన్నవాణ్ణి ఎవ్వరూ బెదిరించి నిరుత్సాహపరచలేరు సరికదా కనీసం అడ్డగించలేరు"

టెలివిజన్, కారు, కంప్యూటర్ మొదలైన అద్భుత మానవ విజయాలను చూసినప్పుడు వాడుకుంటున్నప్పుడు మనం మైమరచిపోతాం.

కానీ ఈ అద్భుతాలు ఎంత కష్టపడితే తయారయ్యాయో మనకు తెలియదు. వాస్తవానికి మొట్టమొదటి ప్రయత్నంలోనే ఏ పని కూడా విజయవంతంగా పూర్తికాదని మనం తెలుసుకోవాలి.

-స్వామి అక్షరాత్మానంద



పాఠక దేవుళ్ళకు నమస్కారం

ఎడిటర్

వేమూరి బలరామ్


ESTABLISHED 1984 | సంపుటి 34 | 27.4.2018 | సంచిక 43

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002


Everything can be sacrificed for truth,
but truth cannot be sacrificed for anything





ముఖచిత్రం
అదితీరావ్ హైదరీ
Courtesy : BAZAAR


చందాను www.swatipublications.com వెబ్‌సైట్ ద్వారా చెల్లించవచ్చు
E-mail: advtswati@gmail.com swativja@eth.net

విడిప్రతి ₹20 12 నెలలకు ₹1076
విదేశాలకు సంవత్సర చందా (ఎయిర్ మెయిల్) ₹6666 (100 డాలర్లు)

Editor : VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM
Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad
Tel.: (0866) 243 1862 243 4017 Advt. 243 1233 Mktg. 243 3938 Fax: 0866-243 0433



అత్యధిక సర్క్యులేషన్‌గల ఏకైక తెలుగు వారపత్రిక

## సాక్షి

**13.4.2018**

ఆంధ్రప్రదేశ్ స్పీకర్ కోడెల శివ ప్రసాదరావుగారి కుటుంబసభ్యులు మన స్వాతి పాఠకులకి రియోనగరంలో కారకోవాడా కొండపై ఉన్న క్రీస్తు ది రిడీమర్ విగ్రహం అతిపెద్ద ఫుట్‌బాల్ స్టేడియం మరకానాలో ఉండే విషయాలను 'ప్రపంచ నవీన వింతల ప్రాంతం దక్షిణ అమెరికా' ఫీచర్‌చక్కగా వివరించారు.

జి.వి.మురళీమోహన్ ముచ్చుమిల్లి

స్పెషల్ ఫీచర్ 'పిచ్చమ్మకి అన్నీ భయాలే' బాగుంది. 'వేట' సీరియల్ చాలా ఇంట్రెస్టింగ్‌గా ఉంటోంది.'జీవన మాధుర్యం' కథ చాలా బాగుంది.

చిన్నా ఖమ్మం

మంచి చెయ్యండి...అందుకు గాను... ఆదా చేయండి... మీ నిస్వార్థ, ధార్మిక జీవనం ఇతరులకు ప్రేరణ కావాలి. ఇతరులకోసం కొంత సమయాన్ని కేటాయించండి... అన్న శ్రీ మాతా అమృతానందమయిదేవి హిత బోధ శిరోధార్యం.

'సత్యాన్వేషణ' శీర్షిక ఈ హిత బోధకు కొనసాగింపు.

శ్రీ సాయిప్రార్థన, సత్యం పలకడం, వాట్సాప్‌లో వచ్చే అర్థంపర్థంలేని ఎస్సెమ్మెస్‌లను ప్రోత్సహించకూడదు... అనేవి మంచి మాటలు.

ఈ మధ్యకాలంలో భార్యలకు భర్తల ఆరోగ్యం విషయంలో శ్రద్ధాసక్తులు మితిమీరుతున్నవి. మిడి మిడి ఆరోగ్య జ్ఞానంతో, భర్తలను పత్యాలు చేయించడం,తిండికి మాడ్చడం... జరుగుతున్నది. తీరా చూస్తే, అతని ఆరోగ్యానికి ఢోకా లేకపోవడం జరుగుతున్నది. 'మధుప్రపంచం' ఈ కథావస్తువు ఆధారంగా రాసిన హాస్యకథ నచ్చింది.

పి.నరసయ్య హైదరాబాద్

'ఈ కార్టూన్ మీదే' చాలా బాగుంది. చిలిపి హాస్యరసాత్మకంగా ఉంటూ ఉల్లాసాన్ని కల్గిస్తోంది.

'Whats App' శీర్షిక సరసరస మాధుర్యంతో సాగుతోంది.

పిల్లలే కాదు పెద్దలు కూడా టెక్నాలజీని సంపూర్ణంగా గ్రహిస్తే జీవితం సౌకర్యతరం అవుతుంది.

'వేట' సీరియల్ బిగి ఉత్కంఠతో సాగుతోంది.'మధుప్రపంచం' కామెడీ కథ బాగా నవ్వించింది.

డా॥ శివభూషణం కర్నూలు

## వచ్చేవారం స్పెషల్

## టీనేజీ స్నేహాలు

'పిచ్చమ్మకి అన్నీ భయాలే' ఫీచర్‌లో అమ్మ స్థానంలోకి వెళ్ళాక ప్రతి మహిళలో ఆలోచనలకు జతకూడే ఆందోళనలగురించిచక్కగా వివరిస్తూ పరిష్కారాలు చెప్పడం బాగుంది.

ఉగ్రవాదులు పట్టుబడకుండా ఎంత పకడ్బందీగా ప్లానింగ్ చేస్తారో 'వేట' సీరియల్‌లో కళ్ళకు కట్టినట్టు వివరించడం చాలా బాగుంది.

'మనిషిలో మనిషి', 'హృదయం ఎక్కడున్నదీ...', 'సామ్రాట్ సముద్ర గుప్త', 'వేట' సీరియల్స్ విభిన్న కాన్సెప్ట్‌లతో వారం వారం ఇంట్రెస్టింగ్‌గా సాగుతున్నాయి.

ఆర్.మరుదకాశి కరప

# ఇది మంచి సమయం



**19.4.2018 నుండి 25.4.2018 వరకు శ్రీ విలంబి నామ సంవత్సరం, ఉత్తరాయణం, గ్రీష్మఋతువు, వైశాఖమాసం, శుక్లపక్షం.**

**19.4.2018 గురువారం**
తిథి: శుద్ధ చవితి రా.11.09 వరకు
నక్షత్రం: రోహిణి రా. 10.51 వరకు
వర్జ్యం:మ. 3.22 నుండి 4.52 వరకు. తె. 4.04-5.14 వరకు
దుర్ముహూర్తం : ప. 10.03-10.52 వరకు. మ. 2.59-3.48 వరకు
రాహుకాలం: మ. 1.38-3.09 వరకు
మంచి సమయం : సా. 5.00 నుండి 5.50 వరకు
సూర్యోదయం: 5.46కి
సూర్యాస్తమయం: 6.17కి

**20.4.2018 శుక్రవారం**
తిథి: పంచమి రా. 8.46 వరకు
నక్షత్రం: మృగశిర రా. 9.15 వరకు
వర్జ్యం: తె. 5.06 లగా...
దుర్ముహూర్తం:ప.8.24 నుండి 9.13 వరకు. మ. 12.30-1.19 వరకు
రాహుకాలం: ప.10.34-12.05 వరకు
మంచి సమయం: మ. 1.40-3.30 వరకు
సూర్యోదయం: 5.46కి
సూర్యాస్తమయం: 6.18కి

**21.4.2018 శనివారం**
తిథి: షష్ఠి సా. 6.28 వరకు
నక్షత్రం: ఆర్ద్ర సా. 7.42 వరకు
వర్జ్యం: ఉ. 6.36 వరకు
దుర్ముహూర్తం: ఉ. 5.55-7.34 వరకు
రాహుకాలం: ప. 9.01-10.33 వరకు
మంచి సమయం: మ. 1.40-2.40 వరకు
సూర్యోదయం: 5.45కి
సూర్యాస్తమయం: 6.18కి

**22.4.2018 ఆదివారం**
తిథి: సప్తమి సా. 4.17 వరకు
నక్షత్రం: పునర్వసు సా. 6.18 వరకు
వర్జ్యం: ఉ. 6.58 నుండి 8.29 వరకు. రా. 1.53-3.24 వరకు
దుర్ముహూర్తం: సా.4.36-5.25 వరకు
రాహుకాలం: సా.4.42-6.14 వరకు
మంచి సమయం: మ.1.50 నుండి 2.30 వరకు
సూర్యోదయం: 5.44కి
సూర్యాస్తమయం: 6.18కి

**23.4.2018 సోమవారం**
తిథి: అష్టమి మ. 2.16 వరకు
నక్షత్రం:పుష్యమి సా. 5.03 వరకు
వర్జ్యం: తె. 5.18 లగా...
దుర్ముహూర్తం : మ. 12.31 నుండి 1.20 వరకు. మ. 2.58-3.47 వరకు
రాహుకాలం: ఉ. 7.32-9.04 వరకు
మంచి సమయం: సా. 4.20 నుండి 5.00 వరకు
సూర్యోదయం: 5.44కి
సూర్యాస్తమయం: 6.18కి

**24.4.2018 మంగళవారం**
తిథి: నవమి మ. 12.26 వరకు
నక్షత్రం: ఆశ్లేష మ. 3.59 వరకు
వర్జ్యం : ఉ. 6.50 వరకు. రా. 3.33 నుండి 5.05 వరకు
దుర్ముహూర్తం: ప. 8.26 - 9.05 వరకు రా.10.57-11.46 వరకు
రాహుకాలం: మ. 3.10-4.41 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 5.43కి
సూర్యాస్తమయం: 6.19కి

**25.4.2018 బుధవారం**
తిథి : దశమి ప. 10.47 వరకు
నక్షత్రం: మఘ మ. 3.06 వరకు
వర్జ్యం: రా. 10.53-12.26 వరకు
దుర్ముహూర్తం : ప. 11.42 నుండి 12.31 వరకు
రాహుకాలం: మ.12.06-1.38 వరకు
మంచి సమయం: మ. 1.45-2.20 వరకు
సూర్యోదయం: 5.43కి
సూర్యాస్తమయం: 6.19కి

✳ మొండిధైర్యం వుండాలి.

# బ్రెస్ట్ ప్యాడ్స్

మహిళ తన జీవితంలో విభిన్న పాత్రలను పోషిస్తుంది. వాటిలో అమ్మ పాత్ర చాలా చాలా ప్రత్యేకమయింది.అమ్మతనం నిరంతర బాధ్యతను పెంచుతుంది. సౌకర్యం, మద్దతు, పోషకాలు తల్లీ బిడ్డలు ఇద్దరికీ అవసరం.

బిడ్డకు స్తన్యమిచ్చే దశనూ ఇద్దరూ సౌకర్యంగా, సంతృప్తిగా అనుభవించగలగాలి.అమ్మ గృహిణిఐనా, ఉద్యోగిని ఐనా తన నర్సింగ్‌ప్రయాణాన్ని సుఖప్రదంగా కొనసాగించాలి.ఈ ప్రయాణంలో భర్త కూడా భాగమై, తానూ శ్రద్ధచూపుతున్న భరోసా ఇవ్వాలి.


Courtesy : GRUHALAKSHMI

**బ్రెస్ట్ ప్యాడ్స్:** అమ్మలకుముఖ్యంగా ర్యాపిడ్‌లెట్-డౌన్ రిఫ్లెక్స్ఉన్నప్పుడు,స్తనాలనుంచి ఎప్పుడూ లీకవుతున్నా ఇవి అవసరం.

**నిపుల్ షీల్డ్ :** పగిలి, నొప్పిపుట్టే, నిపుల్స్‌కు నిపుల్ షీల్డ్ బాగా సహకరిస్తుంది. స్తన్యం ఇచ్చే సమయంలో నొప్పిలేకుండా వుండేందుకు, పగిలినగాయాలు మళ్ళీ రేగకుండావుండేందుకు ఇవి ఎంతో సహకరిస్తాయి.

**ఆయింట్‌మెంట్ :** నిపుల్స్ పగిలి, మంట పెడుతుండడంవల్ల చాలామంది అమ్మలు స్తన్యాన్ని ఇవ్వడంలో ఇబ్బందిపడుతుంటారు.

మంచి, నాణ్యమైన, స్వచ్ఛమైన లెనొలీన్‌గల ఆయింట్‌మెంట్ రాయడంవల్ల ఉపశమనంగా వుంటుంది. ఈ ఆయింట్‌మెంట్ పూర్తిగా ఎడిబుల్ కాబట్టి బిడ్డకు సురక్షితంగా వుంటుంది.

**హైడ్రోజెల్ ప్యాడ్స్ :** ఇవి నొప్పిపుట్టే, సున్నితమైన నిపుల్స్‌కు అవసరం.

**బాటిల్స్:** అమ్మ ఉద్యోగిని అయితే మిల్క్ స్టోరేజ్ సీసాలు బాగా ఉపకరిస్తాయి. స్తన్యాన్ని పంప్‌చేసి, సీసాలో భద్రపరిచి, వేళప్రకారంతాగించగలసౌలభ్యం వీటిలో ఉంటుంది. విధి నిర్వహణలకు వెళ్తూ, ఈ బాటిల్‌ను భద్రపరిచి వెళ్తే, కుటుంబసభ్యులు పాపాయికి పాలు తాగించే సౌలభ్యం వుంటుంది.

**స్టోరేజ్ బ్యాగ్స్ :** పంప్‌చేసిన అమ్మ స్తన్యాన్ని నిల్వ వుంచగల బ్రెస్ట్‌మిల్క్ స్టోరేజిబ్యాగులు అవసరమైతే పాపాయికి తాగించడానికి అనువుగా వుంటాయి.


Courtesy : MOTHER AND BABY

**బ్రెస్ట్ పంప్స్:** ఉద్యోగాలుచేసే అమ్మలకు బ్రెస్ట్‌పంప్స్ తప్పనిసరి. పాలనుపిండి భద్రపరచడానికి ఈ పంప్స్ అవసరంఅవుతాయి.తక్కువపాలు సప్లయ్‌గల మహిళల లాక్టేషన్ స్టిములేషన్‌కుకూడా ఇవి అవసరం.

**సౌకర్యపూరిత దుస్తులు :** గర్భందాల్చాక అమ్మ శరీరంలో అనేక మార్పులు వస్తాయి. పాల ఉత్పత్తి సామర్థ్యానికి అవసరమైన హార్మోనల్‌మార్పులు సంభవిస్తాయి. దీనివల్ల బరువుపెరగడం, ఇతర మార్పులు, కొన్ని జాగ్రత్తల అనివార్యంకోసం సంకేతాలిస్తాయి. తన దైనందిన రొటీన్ పూర్తిగా మారిపోతుంది. ఈ దశలో వస్త్రధారణ మారాలి. భర్త సపోర్ట్ కావాలి.

**షేప్‌వేర్ :** పాపాయి ఒడిలోవున్నా లేకపోయినా అమ్మలు ఎప్పుడూ స్లిమ్మింగ్ షేప్ వేర్‌ను ధరిస్తే, మరింత నాజూకైన ఆకృతి కనపడుతుంది.

తన దుస్తులు సౌకర్యంగా, అందంగా ఉండేందుకు ఆమెకు ఇవి కావాలి. షాపింగ్ లిస్ట్‌లో వీటిని తప్పకుండా చేర్చుకోవాలి.

**నర్సింగ్ బ్రాలు :** పూర్తి మెటర్నిటీ, నర్సింగ్ సమయాల్లో స్తనాల్లో ఎటువంటి,ఎంతటి మార్పు వస్తుందో చెప్పలేం.ఒక్కో మహిళ శరీరం ఒక్కో విధంగా మారవచ్చు. కాబట్టి బాగా ఫిట్టయ్యే నర్సింగ్ బ్రాలు ధరించాల్సిన అవసరం ఎంతయినా ఉంది. ఇవి అత్యుత్తమ సౌకర్యంతో ఉండాలి.

నాలుగునుంచి ఆరు హుక్కులు ఉండే బ్రాను ఎంపికచేసుకోవాలి. అవసరాన్నిబట్టి సర్దుబాటు చేసుకునే విధంగా ఇవి వుండాలి. బిడ్డకు స్తన్యం ఇచ్చే ఏర్పాటుతో వుండాలి.

**నర్సింగ్ పిల్లో:** పాలిచ్చే పొజిషన్ సరిగ్గా వుండేందుకు ఇవి తప్పనిసరి.ముంజేతులు నొప్పి పుట్టకుండా వుండేందుకు సహకరిస్తాయి.

ముఖ్యంగా బిడ్డ బరువుపెరిగేకొద్దీ ముంజేతిపై పడుకోబెట్టుకుని స్తన్యం ఇవ్వడం కష్టం అవుతుంది. నర్సింగ్ పిల్లోల వాడకం వల్ల చేతిపై, వెన్నుపై తక్కువ ఒత్తిడి పడుతుంది.

**నర్సింగ్ ర్యాప్:** నలుగురిలో ఉన్నప్పుడు బిడ్డకు పాలు ఇవ్వాల్సివస్తే ఇవి బాగా అవసరంఅవుతాయి.

**అండర్‌వేర్:** అమ్మలుసాధారణంగా కాటన్‌లోదుస్తులకు ప్రాధాన్యం ఇస్తూ, ఖరీదైనవన్నీ దాచేస్తుంటారు. లేసీ లింగరీలనూ దూరం పెట్టేస్తారు.

ఈ దశలో అవసరం అయినవాటికంటే కొంచెం పెద్ద సైజును ఎంచుకోవాలి.

సి-సెక్షన్‌లో ప్రసవిస్తే ఇంకొంచెం పెద్దవి అయితే, గాయంపైన తగులుకోకుండా వుంటాయి.

**ట్యాంక్ టాప్స్:** ట్యాంక్స్ బాగా పొడవుగా వుండి, దుస్తులతో పొరలుగా వుంటాయి.

మెటర్నిటీ, నర్సింగ్ దశల్లో చురుకైన జీవనశైలికి ఇవిదోహదపడతాయి.

ఆమెకు ఫ్యాషన్‌పోకడ ఎక్కువ వుంటే ట్యాంక్ టాప్స్‌ను, జాకెట్లు, ఇతర యాక్ససరీలతో కలిపి ధరించవచ్చు. సౌకర్యం, ఉపయోగం జతకలిసి ఉదరాన్ని నాజూగ్గా చూపుతాయి.



మృదువైన, గాలి బాగా ఆడే కాటన్ ఫ్యాబ్రిక్‌తో, వైర్‌ఫ్రీ, సీమ్-ఫ్రీ డిజైన్లతో తయారుచేస్తారు.

**నర్సింగ్ బైబ్స్ లేదా కవర్లు:** నలుగురిలో కాని, ఇంట్లో కాని బిడ్డకు స్తన్యం ఇస్తున్నప్పుడు పక్కకు ఒలకకుండా, ఇబ్బందిలేకుండా ఉంచే కవర్లు ఇవి.

వీటన్నింటి విషయంలో ఆమె ఒక్కర్తే అంత ఆసక్తి, చొరవ చూపలేకపోవచ్చు. అందుకు తగిన అవకాశాలు కల్పించాల్సిన బాధ్యత నాన్నదే.

పండంటి బిడ్డను అందించిన భార్యను సకల సౌకర్యాలతో కాపాడుకోవడానికి మించిన తోడు మరొకటి ఏముంటుంది.

*టి.లావణ్య*







# ఒక చిన్నమాట

ఒక వ్యక్తి సంతృప్తి చెందినపుడు ఆనందం కలుగుతుంది. సంతోషానికి, ఆనందానికి తారతమ్యం వుందని మనమనుకోము.

ఆనందం ఊహాత్మకమనుకొన్నా అదిలేని కొరత ఎప్పుడూ ఎందుకు పీడించాలి? దీనిమీద క్లేర్ రేనర్ ఒక వ్యంగ్యబాణం సంధించారు.

అమెరికన్ రాజ్యాంగం గురించి మాట్లాడుతూ- "అమెరికన్లు తమ రాజ్యాంగంలో 'ఆనందాన్ని వెతుక్కొనే' హక్కును గురించి రాశారు.

అంటే మీకు ఆనందంకోసం ప్రయత్నించే హక్కు ఉంది. అంతే" అని అన్నారు.

అభిప్రాయాలు, ఆలోచనలు పక్కకుపెడ్తే నిత్య జీవితంలో మనం వింటున్నది, చూస్తున్నది ఏమిటి? ప్రకటనల ద్వారానో, స్ఫూర్తిప్రదాతలు మాట్లాడే మాటలలోనో, మీ సాఫల్యానికి మార్గాలు చూపే మార్గదర్శకాలలోనో మనకు ఎదురయ్యేది డబ్బే.

'అమీర్ బనీయే', 'హౌ టు గెట్ రిచ్', 'హౌ టు వర్క్ లెస్ అండ్ ఎర్న్‌మోర్', 'లా ఆఫ్ అట్రాక్షన్', 'అట్రాక్ట్ అబండెన్స్'వంటి ప్రబోధాలు.

పుస్తకాలరూపంలో, ఉపన్యాసాల రూపంలో, ఆన్‌లైన్ సెమినార్లలో, మ్యాజిక్ టూల్స్ (అద్భుతమైన పరికరాలు) హామీలలో ఇంత విపులంగా ఎందుకు ఎదురౌతాయి? డబ్బు అందరికీ అత్యవసరమని-

ఎంత ఎక్కువగా డబ్బు ఉంటే అంత సంతోషంగా, సుఖంగా ఉండవచ్చనే అభిప్రాయం ప్రపంచం అంతా వ్యాపించినందునే డబ్బు సంపాదనకు దగ్గరి మార్గాలు చూపేవారు ముందుకు వస్తారు. ఆకర్షణీయంగా మాట్లాడతారు.

సత్యమేమిటంటే డబ్బు ఆకాశంనుండి రాలి పడదు. ఆ మాట ఒకసారి మార్గరెట్ థాచరే అన్నారు-

'మీ డబ్బును మీరు'అదుపులో పెట్టుకొంటే మీ జీవితాన్నే మీరు అదుపులో పెట్టుకొన్నట్టని విజ్ఞులు చెపుతారు. 'అప్పు లేని వాడు అధిక సంపన్నుడు' అని మన పెద్దలు చెప్పిన మాట.

ఒకప్పుడు అప్పు పుట్టేదే చాలా కష్టంగా ఉండేది. అప్పులు. పేదలు, రైతులు, షావుకార్లు, దోపిడీలు, దౌర్జన్యాల సాహిత్యం, సినిమాలు కూడా చాలా వచ్చాయి.

ఉదార ఆర్థికవాదంతో డబ్బు ఎంత సర్క్యులేషన్‌లో ఉంటే అంత గొప్పగా ఆర్థికవ్యవస్థ పటిష్ఠమవుతుందనే భావంతో ఋణాలు తీసుకోమని అనునయించే సంస్థలు, వాయిదాల పద్ధతిమీద వస్తువుల కొనుగోలు, వివిధ అవసరాలకు బ్యాంకుల రుణాలు చలామణిలో ఉన్నాయి.



డాక్టర్ జె.భాగ్యలక్ష్మి
E-mail: jbhagyalakshmi43@yahoo.in

ఈ వసతులవలన డబ్బు లభ్యమౌతున్నందున ప్రజల సంతోషస్థాయి మెరుగైందా అంటే చెప్పటం కష్టంకాని, ఆర్థికవ్యవస్థకు ఇది బలం చేకూర్చిందనవచ్చు.

ఋణాల మాఫీ ఇక్కడ చర్చలో లేదు. ఎగవేతలూ లెక్కలో లేవు. ఎంత మొత్తం డబ్బు వుంటే ఒక వ్యక్తి సంతోషంగా జీవించగలడనేది దేశానికీ, దేశానికి ప్రపంచవ్యాప్తంగా మారుతుందని ఇటీవల వెలువడిన ఒక పరిశోధన తెలియజేస్తుంది.

ఒక పరిమితి దాటినతర్వాత ఎంత డబ్బున్నా అది చేకూర్చే సంతోషం గణనీయంగా ఉండదని తేలింది.అమెరికా విషయానికొస్తే జీవితానికి విలువ కట్టటానికి 95,000 డాలర్లని, మానసికంగా, తృప్తిగా జీవించటానికి 60,000 నుండి 75,000 డాలర్లు అవసరమవుతాయని అధ్యయనంలో తేలింది.



Courtesy : GRUHALAKSHMI

ఇవి వ్యక్తులకు సంబంధించినఅంకెలు కాని, కుటుంబాలవి కాదు.

ప్రపంచవ్యాప్తంగా ఇది భిన్నంగా ఉంటుందనీ చెప్పారు.

ప్రతి ఏడూ ప్రపంచ దేశాల సంతోష సూచిక వెలువడుతుంది.

ఈ సంవత్సరం ఫిన్‌లాండ్ ప్రపంచంలోకెల్లా సంతోష రాజ్యంగా తేలింది. సమస్యలతో సతమతం అవుతున్న బురుండి ఈ సూచికలో చివరి స్థానంలో ఉంది.

156 దేశాలలో ఇండియాది 133వ స్థానమన్నారు. ఈ ఎంపికకు ఆదాయం, ఆరోగ్య జీవన ప్రమాణం, సామాజిక సమర్థింపు, స్వేచ్ఛ, విశ్వాసం, దాతృత్వం ప్రమాణాలుగా స్వీకరించారు.

వలస వచ్చినవారి తృప్తిని కూడా పరిగణించారు. ఈ సంతోష సూచికలో డబ్బు అంత ప్రాముఖ్యం వహించదు. డబ్బు విషయంలో జార్జి లారిమర్ అనే మేధావి మంచి సలహా ఇచ్చారు.

"డబ్బు ఉండటం, డబ్బు కొనగల వస్తువులు వుండటం మంచిదే. అయితే డబ్బు కొనలేనివేవీ ఈ ప్రయత్నంలో మీరు పోగొట్టుకోలేదు కదా అని అప్పుడప్పుడు పరిశీలించుకోవాలి"

డబ్బు ఎలా ఖర్చుపెట్టాలి అనే విషయమై కొన్ని సలహాలున్నాయి. మీ సమయం వృథా కానివ్వకుండా డబ్బు ఖర్చుపెట్టాలి (ట్యాక్సీకోసం, ఇంట్లో సాయం కోసం). ఒక అనుభవంకోసం ఖర్చుపెట్టాలి.

ఒక వస్తువు కొంటే ఆ ఆనందం కొన్నాళ్ళే. ఆ తరువాత దానిపట్ల ధ్యాస ఉండదు.దీన్నే ఆర్థిక శాస్త్రంలో డిమినిషింగ్ మార్జినల్ రిటర్న్స్ (క్షీణించే వినియోగఫలం) అని అంటారు.

అనుభవమయితే జ్ఞాపకాల్లో పదిలపరచుకోవచ్చును. మనం ప్రేమించేవారిమీద, శ్రద్ధ ఉన్నవారి మీద ఖర్చుపెట్టవచ్చు. మనకోసం ఖర్చుపెట్టటం కంటే ఇతరులకోసం ఖర్చుపెట్టేటప్పుడు లభించే ఆనందమే వేరు. ఆదాయాన్నిబట్టి ఖర్చులుండాలి. డబ్బు ఆనందాన్నిచ్చినా ఇవ్వకపోయినా అది దుఃఖాన్ని మాత్రం ఇవ్వకూడదు.

# దేవీ మానుష రూపేణ



ఎక్కడ మహర్షులనే మాట విన్పడినా, వారంతా బ్రాహ్మణజాతికి చెందినవారే అనేది మన సర్వసాధారణ అభిప్రాయం. ఐతే సంస్కృతీ సంప్రదాయాలూ ఆచారవ్యవహారాలూ చక్కగా సాగిన 10వ శతాబ్దం కాలంలో ఎందరో ముఖ్యంగా వైశ్యులు తపస్సులు చేస్తూండేవారు. శాస్త్రవాదాల్లో పాల్గొంటూండేవారు. దానధర్మాలూ ఆలయనిర్మాణాలూ పూజాపురస్కారాలూ చేస్తూండే వారు.

ఇది నిజం కాబట్టే నేటికీ సంపాదనవిషయంలో ఎంత నిక్కచ్చిగా ఆర్యవైశ్యులుంటారో, అంత కచ్చితంగానూ దానధర్మాలూ ఆలయనిర్మాణాలూ నిర్వహణలూ భక్తిశ్రద్ధలతో పూజాపురస్కారాల విషయంలోనూ ఉంటారు. ఇది స్తవం కాదు వాస్తవమని అందరికీ తెలుసు.

దానపరుడూ ధర్మబుద్ధికలవాడూ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పశ్చిమగోదావరి జిల్లాలో గోదావరి నడిఒడ్డున 'పెనుగొండ' అనే ప్రదేశాన్ని పరిపాలిస్తూ ఉండేవాడు కుసుమశ్రేష్ఠి అనే ఆర్యవైశ్యుడు. ఆయన భార్య కుసుమాంబ. ఒకరు సత్యం, మరొకరు అహింస అనే రెంటికీ ప్రతిరూపంగా ఉంటూండేవారు.

ఎంతకాలానికీ సంతానం కలక్కపోతే తమ పురోహితులనడిగి వారి ఆజ్ఞమేరకి పుత్రకామేష్టిని చేయ సంకల్పించారు. ఆ పెనుగొండలో నగరేశ్వరస్వామి - జనార్దనుడు అనే రెండు దేవాలయాలు- ఒకటి శైవానికీ, రెండవది వైష్ణవానికీ గట్టి పట్టుకొమ్మలుగా ఉంటూండేవి. కుసుమశ్రేష్ఠి అలాగే ఆర్యవైశ్యులంతా నగరేశ్వరస్వామి ఆరాధనపరులే అవుతూ శైవులుగానే జీవిస్తూండేవారు. పుత్రకామేష్టి యాగం ముగియగానే ఆయనకి కవలలు జన్మించారు.

పురుషశిశువుకి విరూపాక్షుడు (మూడు కన్నులు కలవాడూ, అందులో రెండు అడ్డంగా పక్కపక్కన ఉంటూ,ఆ రెంటి మధ్యనున్నకన్ను నిలువుగా కన్పిస్తూ వి-రూపంగా ఉండే కళ్ళు కలవాడు) అనే శివుని పేరునీ,

స్త్రీ శిశువుకి 'వాసవి' అనే (బంగారపు రంగుతో మెరిసిపోయే శరీరమున్న పార్వతికుండే పేరు) పేరునీ తన శైవధర్మానికి అనుగుణంగా పెట్టాడు కుసుమశ్రేష్ఠి.

## జీవితమంతా కన్యగానే

ఆ కవలలైన విరూపాక్ష, వాసవి సంతానం పుట్టుకనుండే వినయవిధేయతలతోనూ ప్రజలందరితో ఇరుగుపొరుగులతో కలిసిమెలిసి చిన్నతనంలో పెద్దతనపు మాటా- నడవడికలతో కన్పిస్తూ అందరికీ - వీరిలో ఏదో ఒక గొప్పదనం ఉండి ఉంటుందనే విషయాన్ని చెప్పక చెప్తున్నట్లు అన్పిస్తూండేవారు.

ఈ విషయం ఈ నోట ఆ నోట ఆ దేశానికి రాజైన విష్ణువర్దనమహారాజుకి తెలిసింది. వేంగిదేశమైన తన రాజ్యంలో తాను పర్యటిస్తూ పెనుగొండ క్షేత్రానికీ, నగరేశ్వర స్వామిదర్శనానికీ వచ్చి 'వాసవి'ని చూశాడు. వెంటనే వివాహమాడాలనే నిర్ణయానికొచ్చేశాడు తనకి తానుగా. వైశ్యకులపెద్దలతో సమాచారాన్ని ఆమె తల్లిదండ్రులకి చెప్పించాడు.

కుసుమాంబ కుసుమశ్రేష్ఠి దంపతులు ఏమాత్రపు సంకోచమూ లేకుండా -తమకి అల్లుడు కాబోయేవాడు తమ పుత్రిక ఇష్టానికి అనుగుణంగా ఉండాలి. తాము ఆరాధిస్తున్న నగరేశ్వరునికి భక్తుడైయుండాలి. తమ కులాచారాలని పాటించేవాడే అయ్యుండాలి.

తమ కులంవాడే అయితీరాలని కుండపగలగొట్టినట్టు చెప్పారు. ఐనా కులపెద్దలు ఒక్కసారి వాసవిని అడిగి చూద్దామని సూచన చేస్తే 'సరే' అన్నారు వాసవి తల్లిదండ్రులు. ఆమె మాట్లాడుతూ-తల్లిదండ్రుల ఇష్టాన్ని కాదనడం సరికాదు.

రాజు సంబంధం అసలు సరికాదు. నా గురించి ఏమాత్రమూ తెలియక నన్ను చూసినక్షణంలోనే నన్ను వివాహమాడాలని భావించిన రాజుకు ఉన్న ఆ చాంచల్యం, మరొకామె విషయంలో కూడా ఇదే తొందరపాటుతో ఉంటుంది.

తల్లిదండ్రుల అభిప్రాయాన్ని కాదనడం తల్లిదండ్రులపట్ల చేసే ద్రోహంతో సమానం. అన్నిటికీ మించి వివాహోద్దేశ్యం తనకి లేదనీ, తాను కేవలం భక్తి పూజాపురస్కారాలని లోకంలో అందరికీ నేర్పుతూ జీవితమంతా కన్యగానే గడపాలని నిశ్చయించుకున్నాననీ తెలిపింది.

తన అభిప్రాయాన్ని తిరస్కరిస్తూ కుసుమశ్రేష్ఠి తన కూతురినియ్యనందుకు యుద్ధాన్ని చేశాడు వైశ్యజాతితో. ఆ నగరేశ్వరుని అనుగ్రహంతో విష్ణువర్ధనుణ్ణి ఓడించగలిగారు వైశ్యులు.

తన తల్లిదండ్రులకి ఇంతటి మనఃక్షోభ కల్గించాననే ఉద్దేశ్యంతో వాసవి అగ్నిప్రవేశాన్ని చేయబోతే, ఆమెతోపాటు 102 గోత్రాల వైశ్యులూ కూడా అగ్నిప్రవేశాన్ని చేయదలిచి మొత్తం 103 అగ్నికుండాలని సిద్ధం చేసుకున్నారు.

అందరూ అగ్నిలో దగ్ధులై కైలాసానికి చేరితే వాసవి తన విశ్వరూపాన్ని చూపించి అగ్నికుండంలో ప్రవేశించగానే అగ్నిదేవుడు చల్లబడి, ఆమె ఒక దేవత అని ప్రకటించాడు. ఆమే ఆర్యవైశ్యుల కులదేవత వాసవీ కన్యకాపరమేశ్వరి.

## అగ్నిప్రవేశం

ఆర్యవైశ్యులంతా శివారాధకులే. వాసవి పూర్తి పేరు కన్యకాపరమ 'ఈశ్వరి'. అర్చించినది నగరేశ్వర స్వామిని.ఆమె సోదరుని పేరు విరూపాక్షుడు(శివుడు). కుసుమశ్రేష్ఠి దంపతులు సంతానం కోసం చేసిన తపస్సు శర్వుని భార్య (శంకరుని భార్య) అయిన శర్వాణీ (పార్వతి)దేవిని గురించి-

ఏ శంకరుడు అగ్నిని తన కంఠంలో దాచేసుకున్నాడో ఆ అగ్నిలోకే ప్రవేశించింది వాసవి.

ఆమె విశ్వరూపాన్ని చూపడమనేది ఆమె దేవత అని ప్రత్యక్షంగా నిరూపించడం కోసమే. నిరంతరం సర్వాభరణాలతోనూ దర్శనిమస్తూండడం లలితా సహస్రనామాల్లోని **సర్వాభరణభూషితా సర్వాలంకార యుక్తా** అనేవాటిని తెలియజేస్తుంది.

సతీదేవి ఎలా అగ్నిప్రవేశం చేసిందో అదేతీరుగా వాసవీమాత కూడా అగ్నిప్రవేశం చేసింది కులప్రతిష్ఠ కోసం. శంకరుణ్ణి తప్ప మరొకరిని పెండ్లాడనని పార్వతి ఎలా దృఢంగా అన్నదో, అదేతీరుగా వాసవీ మాత కూడా తల్లిదండ్రుల ఇష్టానికి అనుగుణంగానే ఉంటానన్నది. కన్యగా ఉండిపోతానని స్వీయాభిప్రాయాన్ని చెప్పింది కూడా.

'బాలా త్రిపురసుందరి' అనడంలో రహస్యమిదే. సంతానాన్నీ, ఐశ్వర్యాన్నీ ఇచ్చే దేవత వాసవీకన్యకా పరమేశ్వరి! తన్నో వాసవీ ప్రచోదయాత్.

# దక్షిణ వివక్ష వివాదం

## ➡ కొన్ని ప్రాంతాలకు అన్యాయం నిజం
## ➡ వేర్పాటువాదం అంగీకారం కాదు

కాశ్మీర్ నుండి కన్యాకుమారి వరకుఅంటూ సువిశాలమయిన భారతదేశం గురించి గర్వంగా వర్ణిస్తాం. కాని నిజానికి భారతదేశపు శిరస్సు వంటి దైన కాశ్మీర్‌లోని మూడొంతుభాగం పాకిస్తానీ ఆక్ర మణలో వుంది.

1947లో పాకిస్తాన్ తెగబడి ఆక్రమించిన ఆ భూభాగాన్ని నేటివరకు తిరిగి భారత్‌లో కలుపుకో లేకపోయాం. ఇక ఈశాన్యభారతదేశంలోనూ పలు భూభాగాలు ఆయుధపోరాటంలో ఇటీవలికాలం వరకు సాగింది. భారతవ్యతిరేక భావనలతో,

భారత దేశంలో భాగంగా వుండేందుకు ఇష్టపడని వర్గాలు విదేశీ ప్రభుత్వాలు, సంస్థల మద్దతుతో పోరాటాలు చేస్తున్నాయి.

ఇటీవలికాలంలో ఆ విచ్ఛిన్న శక్తులమీద భారత్ బలగాలు విజయం సాధించాయి. కాశ్మీర్‌లో పాకిస్తాన్ ప్రేరేపిత ఉగ్రవాదులు తమ అలజడులను కొనసాగిస్తూనేవున్నారు.తరచుగా హింసాత్మక సంఘటనలు, ఎదురుకాల్పులు, పలువురి మరణాలు వార్తల్లో వింటూనేవున్నాం.

దేశం స్వాతంత్ర్యం సాధించిన 70 ఏళ్ళ తర్వాత కూడా ఇంకా దేశమంతా ఒక్కటేనన్న భావన కలగకపోవడం దురదృష్టకరం.నేటివరకు వేర్పాటువాదధోరణులు ఉత్తరాదికి, సరిహద్దు రాష్ట్రాలకే పరిమితం అనుకుంటున్న వేర్పాటువాదం అనే పదం ఇప్పుడు దక్షిణాది నుండి వినిపించటం ఆశ్చర్యకరం.

కాశ్మీర్‌లోనే వుందనుకున్న వేర్పాటు ఉద్యమంలో మేము నడుస్తామంటూ కన్యాకుమారి ప్రాంతం నుండి వినిపించటం విచిత్రమే.

సాదాసీదా సినీనటులు మొదలుకుని, తలలు పండిన సీనియర్ రాజకీయనాయకుల వరకు వివిధ దక్షిణాది రాష్ట్రాలనుండి ఏకకాలంలో వేర్పాటువాదం మాటలు వినపడటం వెనుక రాజకీయం ఉంది. ఆంధ్రప్రదేశ్‌కి అన్యాయం చేస్తున్నారంటూ తెలుగుదేశం పార్టీ ఫిర్యాదు చేస్తున్న సమయంలో అది తమ రాష్ట్రానికి అన్యాయం అనే కోణం నుండే మాట్లాడారు కాని దక్షిణాది భారతదేశం వేరు అనే మాటలు రాలేదు.

అయితే కమల్‌హాసన్ సొంతంగా పార్టీ ప్రకటిస్తూ చేసిన ప్రసంగంలో తొలిసారిగా ద్రవిడరాష్ట్రాలు అనే పదం వినిపించాడు.

ద్రవిడ గుర్తింపును పెంపొందించుకుంటే దక్షిణాది రాష్ట్రాలకు జరుగుతున్న అన్యాయాలనుండి విముక్తి లభిస్తుందని కమల్‌హాసన్ అన్నాడు.

ఆ ఆలోచనాధోరణికి తగినట్టుగానే అతని పార్టీ జెండా రూపొందించాడు.అందులో ఒక చేతిని మరొక చేయి ఇముడ్చుకుని వుంటాయి.

ఆ ఆరుచేతులు ఆరు దక్షిణాది రాష్ట్రాలని, అవి కలిస్తే చాలన్న భావన కమల్‌హాసన్‌ది.

రాజకీయ అనుభవలేమి, గతంలో రాజకీయంగా పార్లమెంట్‌లో జరిగిన చర్చల గురించి తెలియని కమల్‌హాసన్ అటువంటి విభజనవాద ప్రస్తావన చెయ్యటం అర్థంచేసుకోవచ్చు.

కమల్‌హాసన్ చేసినటువంటి దక్షిణ-ఉత్తర విభజన అంశాన్ని వెనువెంటనే అందిపుచ్చుకున్నాడు పవన్ కళ్యాణ్. నటనలోనే కాదు, రాజకీయ అంశంలోకూడా తాను కమల్‌హాసన్‌కి పోటీదారుడినని చెప్పుకోవటం పవన్‌కళ్యాణ్ ఉద్దేశ్యం కావచ్చు.

యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ సౌత్ ఇండియాగా ఏర్పడి కేంద్రంనుండి రావాల్సినవి రాబట్టుకునే ఆలోచనకు తన మద్దతు వుంటుందని పవన్‌కళ్యాణ్ ప్రకటించాడు. ఈ నటులిద్దరికీ సొంత పార్టీ అధ్యక్ష పదవులు తప్పించి ప్రజాప్రతినిధులుగా గుర్తింపు లేదు.

కాని తెలుగుదేశం పార్టీ తరపున ఎమ్.పి.గా గెలిచిన మరో సినీనటుడు మురళీమోహన్ దక్షిణరాష్ట్రాలు అన్యాయానికి గురవుతున్నాయని, ఆ వివక్షత ఇలాగే కొనసాగితే దక్షిణాది రాష్ట్రాలు స్వతంత్రదేశంగా ప్రకటించుకునే ప్రమాదం ఉందని విభజన వాదనను మరో మెట్టుపైకి తీసుకువెళ్ళాడు.ఆంధ్రప్రదేశ్,తమిళనాడులోని విభజన గొంతుకలకు తెలంగాణ, కేరళ, కర్ణాటక రాష్ట్రాలలోని పార్టీలు వెనువెంటనే తమ గొంతులను కలపలేదు.

తమ రాజకీయ డిమాండ్లు సాధించుకునేందుకు దేశ విచ్ఛిత్తి గురించి మాట్లాడటంవల్ల తమ పార్టీల వాదన బలహీనపడుతుందని అధినాయకులు గుర్తించారు. అందుకే ఒక దశలో దక్షిణాది విడిపోవటమనే పదాన్ని ప్రయోగించిన చంద్రబాబునాయుడు దానిని సరిదిద్దుకుని కేంద్రంపై యుద్ధానికి ఇతర మార్గాలను ఎంచుకున్నాడు.

ప్రజలందరినీ ఏకం చెయ్యగలిగినది ఆర్థిక అంశం. కాబట్టే ఆర్థికపరంగా దక్షిణాది రాష్ట్రాలు వివక్షతకు గురవుతున్నాయని, తమకష్టాన్ని ఉత్తరాదివారి అభివృద్ధికి ఉపయోగిస్తున్నారన్న ఆరోపణతో దక్షిణాది రాష్ట్రాలు ఐక్యతారాగం అందుకున్నాయి.

ఈ రాగం మరింతగా శృతి చేసి బిగ్గరగా వినిపించేందుకు కేరళ రాజధాని తిరువనంతపురం వేదిక అయింది. దక్షిణాది రాష్ట్రాల ఆర్థికమంత్రుల సమావేశానికి తెలంగాణ, తమిళనాడులు హాజరుకాకపోవటాన్ని బట్టి దక్షిణాది రాష్ట్రాలమధ్య వున్న ఐక్యత ఏపాటిదో అర్థమైంది.

అయినా తిరువనంతపురం నుండి వినిపించిన వివక్షతా అంశం పూర్తిగా నిర్లక్ష్యం చెయ్యదగినదికాదు. దక్షిణాది రాష్ట్రాలకు అందివచ్చిన అంశం 15వ ఆర్థికసంఘం పరిశీలనకు నివేదించిన అంశాలు. 15వ ఆర్థికసంఘం చేసే సిఫార్సులు 2020-2025 సంవత్సరానికి వర్తించేవి.

2019లో జరిగే ఎన్నికల్లో తిరిగి ఎన్.డి.ఎ.ప్రభుత్వం అధికారంలోకి వస్తుందో లేదో తెలియదు. ఒకవేళ ఎన్.డి.ఎ. ఓడిపోతే 15వ ఆర్థికసంఘ సిఫార్సులను అమలుచేసేబాధ్యత నాడు అధికారంలో వుండేవారిది.

కాబట్టి ఇప్పటినుండే ఈ అంశంమీద యుద్ధం చెయ్యాల్సిన అవసరముందా! నేడు ఆర్థికసంఘంవిషయంలో అభ్యంత



**చట్టబద్ధమైన పాలన అందించటంలో, సమాజంలో శాంతిభద్రతలు కాపాడటంలో రాజీపడే ప్రశ్నే లేదు.**
-నితీష్‌కుమార్, బిహార్ సి.ఎమ్.

రాలు లేవనెత్తే రాష్ట్రాలన్నీ 2020లోగానే ఎన్నికలకు వెళతాయి. ఆ రాష్ట్రాలలో ఇప్పుడున్న ప్రభుత్వాలలో ఎన్ని గెలుస్తాయో కూడా ఎవరికీ తెలియదు. ఈ నేపథ్యంలో దక్షిణ, ఉత్తర భారత వివాదం రాజకీయం కోసం చేపట్టిన ఆర్థికఅంశంగానే పరిగణించాలి.

అయితే కేంద్రం నుండి నిధుల మంజూరీ విషయంలో నేటివరకు పరిగణనలోకి తీసుకుంటున్నది 1971 నాటి జనాభావి. 1971 తర్వాత కుటుంబ నియంత్రణ విషయంలో కొన్ని రాష్ట్రాలు ముందంజలో వున్నాయి. జనాభాను అదుపుచేయడంలో దక్షిణాదివారిది అగ్రస్థానం.

ఉత్తరాదిరాష్ట్రాలు ఆ విషయంలో బాగా వెనకబడున్నాయి.జనాభాని పెంచుకుని లబ్ధిపొందే ఉత్తరాది రాష్ట్రాల వల్ల దక్షిణాది రాష్ట్రాలకు దెబ్బ తగులుతున్నదనేది దక్షిణ రాష్ట్రాలవారి వాదన.

ఇప్పుడు 15వ ఆర్థిక సంఘం 2011 నాటి జనాభా లెక్కలను పరిగణనలోకి తీసుకుంటామని ప్రకటించింది. జనాభా అంశం మీద నిధుల బదిలీని చేపడితే కుటుంబనియంత్రణ పథకాలను విజయవంతంగా అమలుచేసినతాము నష్టపోతామని దక్షిణాది రాష్ట్రాలు వాదిస్తున్నాయి.

అందుకు వారు కొన్ని గణాంకాలను ప్రజలముందుంచారు. దేశపన్నుల ఆదాయంలో దక్షిణాది రాష్ట్రాలు 30శాతం అందిస్తుండగా కేంద్రం నుండి ఆ రాష్ట్రాలకు కేవలం 18 శాతం మాత్రమే నిధులు వెనక్కి తిరిగివస్తున్నాయన్నది వారు చూపుతున్న విషయం.ఐతే అది కేవలం దక్షిణాది రాష్ట్రాలకే పరిమితమైన విషయం కాదు.

మహారాష్ట్ర, గుజరాత్ వంటి రాష్ట్రాలు దక్షిణాది రాష్ట్రాలకన్నా ఎక్కువ ఆదాయం కేంద్రానికిఅందించి, కేంద్రం నుండి తక్కువ నిధులు అందుకుంటున్నాయి. కాని ఆ రాష్ట్రాలనుండి అన్యాయపు నినాదం బయటకు రాకపోవటాన్ని గమనించాలి.

పైగా ఇటువంటి తేడా కేవలం నరేంద్రమోడీ ప్రభుత్వం రాకవల్ల ఏర్పడింది కాదు.

1971 నాటి జనాభా లెక్కల ప్రాతిపదికనే నిధుల కేటాయింపు కొనసాగాలన్నది దక్షిణాది రాష్ట్రాల డిమాండ్. 1971 జనాభా లెక్కల ప్రాతిపదికనే 13వ, 14వ ఆర్థిక సంఘాలు సిఫార్సులు చేశాయి. 13వ ఆర్థికసంఘం సిఫార్సులప్రకారం రాష్ట్రాలు ఇచ్చిన ప్రతి వంద రూపాయలలో కేంద్రం నుండి 32 రూపాయిలు మాత్రమే తిరిగి రాష్ట్రాలకు వచ్చేవి.

నరేంద్రమోడీ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత 14వ ఆర్థికసంఘం చేసిన 42 శాతం నిధుల బదలాయింపు సిఫార్సుని అంగీకరించింది.

ఈ మేరకు నిధుల బదలాయింపులు జరిగాయి. అయినా ఆ విషయంలో తమకు అన్యాయం జరుగుతోందని గత 10-15 సంవత్సరాలలో దక్షిణాది రాష్ట్రాలవారు ఎన్నడూ గొంతెత్తలేదు.

మనమంతా భారతీయులం, సంపద అంతా భారతీయుల మధ్య పంపిణీ చేసుకుంటున్నాం అనే భావనతోనే నిధుల కేటాయింపుల విషయంలో సర్దుబాట్లు చేసుకున్నారు.

ఇతర ప్రాంతాలకు లేని కొన్ని ప్రయోజనాలు బ్రిటీష్‌పాలకుల సమయంలోనే దక్షిణాది రాష్ట్రాలకు దక్కాయి. ఇంగ్లీషు విద్యను ముందుగా అందిపుచ్చుకున్నారు.దానిఆధారంగా కేంద్రసర్వీసుల్లోకి వెళ్ళారు. కేంద్రంలో తమిళ అధికారులు చక్రం తిప్పుతున్న రోజుల్లో తమిళనాడు పలురకాలుగా లబ్ధి పొందింది. కేంద్రప్రభుత్వం నెలకొల్పిన పలు పబ్లిక్‌రంగ సంస్థల వల్ల హైదరాబాద్ ఎదిగింది.

ఇతర రాష్ట్రాలలో అన్ని కేంద్రప్రభుత్వ సంస్థలు లేవు.అలా ఆదాయం పెంచుకుని,ఇప్పుడు ఆఆదాయపరంగా మాకే లబ్ధి వుండాలని దక్షిణాది రాష్ట్రాలు వాదిస్తున్నాయి. దక్షిణాది రాష్ట్రాల వాదనను ఉత్తరాది రాష్ట్రాలవారు సీరియస్‌గా తీసుకోవటంలేదు.

దక్షిణాది రాష్ట్రాలలోని ప్రాంతీయపార్టీలు రాజకీయలబ్ధి కోసం లేవనెత్తిన అంశంగానే వారు భావిస్తున్నారు. ఒకవేళ దక్షిణాదిపార్టీలు విభజనవాదాన్ని మరింత పెంచితే ఉత్తరాదివారు వేసే ప్రశ్నలకు ఉక్కిరిబిక్కిరి అవ్వాల్సివస్తుంది.

## ➡ ఆర్థిక అంశాల ఆధారంగా ఉద్యమం
## ➡ వేర్పాటు భావనవైపు మళ్ళకూడదు

సైనికదళాలలో మేము అధిక సంఖ్యలో పనిచేస్తూ, సరిహద్దులను రక్షిస్తుండబట్టి దక్షిణాది రాష్ట్రాలు ప్రశాంతతను అనుభవించి ఆర్థికంగా ఎదగగలుగుతున్నాయని వాదిస్తే మన దగ్గర ఏం సమాధానం ఉంటుంది! ఇటువంటి వాదోపవాదాలు 1960ల్లోనే జరిగిన విషయం ఈతరం నేతలకు, నేతలం అనుకుంటున్న సినిమా నటులకు తెలియదేమో!

జవహర్‌లాల్ నెహ్రూ ప్రధానిగా వున్న 1962లో డి.ఎమ్.కె. పార్లమెంట్‌సభ్యుడు సి.ఎన్.అన్నాదురై ద్రవిడదేశం వేరని, కేంద్రం మద్రాసు నగరాన్ని నిర్లక్ష్యం చేస్తోందని, రాజ్యాంగం పునఃసమీక్షించి ద్రవిడప్రాంతాలు విడిపోయే వెసులుబాటు కల్పించాలని అన్నాడు.

ఆ సమయంలో రాజ్యసభలో సభ్యుడిగా వున్న అటల్ బిహారీ వాజ్‌పేయి, అన్నాదురై ఆలోచన ఎంత ప్రమాదకరమైనదో వివరిస్తూ సభలో చేసిన ప్రసంగానికి దక్షిణరాష్ట్రాల ఎమ్.పి.లు కూడా చప్పట్లు చరిచారు.మద్రాసుకు అన్యాయం అని అన్నాదురై అంటున్నారు. కాని తమకు అన్యాయం జరుగుతున్నదని అన్ని రాష్ట్రాలూ అంటూనేవుంటాయి.

తమిళనాడులో కూడా మద్రాసులో జరిగిన అభివృద్ధి ఇతర పట్టణాలలో, గ్రామాలలో జరగలేదు. కాబట్టి మద్రాసువాసులు ఇతర తమిళప్రాంతాల మీద వివక్షత చూపించినట్టు భావించలేం కదా!

మనసుల్లోని వేర్పాటువాదానికి ఒక సైద్ధాంతిక భూమికను సృష్టించే ప్రయత్నం మానుకోవాలని నాడు వాజ్‌పేయి సూచించారు.

ప్రాంతీయంగా వివక్షతలు లేవని ఎవరూ అనరు. తెలంగాణలో హైదరాబాద్‌లో అత్యధిక రెవిన్యూ వస్తున్నది. అది ఇతర జిల్లాల అభివృద్ధికి ఉపయోగించటంలేదా! హైదరాబాద్ నుండి వచ్చే ఆదాయ మంతా హైదరాబాద్‌మీదే వినియోగించాలన్న వాదన ఎవరైనా చేస్తే ముఖ్యమంత్రి కె.సి.ఆర్. అంగీకరిస్తారా!

ఫెడరల్‌స్ఫూర్తిగురించి మాట్లాడే ముఖ్యమంత్రులందరూ తమ పాలనలో ఒక నగరం అభివృద్ధి మీద దృష్టిపెట్టి నడిపినవారే.

హైదరాబాద్ నగరంలో భూమి ధరలు పెరిగినట్టుగా, ఇతర జిల్లాలో పెరగలేదేం! అది ప్రాంతీయ అసమానతను సృష్టించడం కాదా!

ఈ విషయం ఎ.పి. ముఖ్యమంత్రితో సహా దక్షిణాది రాష్ట్రాలందరూ గుర్తెరగాలి.

రాష్ట్రాలకు న్యాయంగా దక్కాల్సినవి సాధించటానికి ఉద్యమించటాన్ని ఎవరూ తప్పుపట్టరు. తమకు రావాల్సిన వాటాను సాధించేందుకు పార్లమెంట్‌లో రాష్ట్రాల ప్రతినిధులు వున్నారు.

వారు తమ వాదనలతో అన్యాయాన్ని చక్కదిద్దగలిగేలా కేంద్రం మీద ఒత్తిడి తీసుకురాగలరు. రాజకీయ విభేదాల ఆధారంగా జాతీయభావనను విచ్ఛిన్నం చేసే యత్నాలు అంగీకరించలేము.

ఈ రోజు నరేంద్రమోడీ ప్రధానమంత్రిగా వుండవచ్చు. రేపు రాహుల్‌గాంధీనో లేక తృతీయఫ్రంట్ తరపున కె.సి.ఆర్, చంద్రబాబునాయుడులలో ఎవరైనా ప్రధానిపదవిలో కూర్చోవచ్చును. వారి వారి పదవులు,వారి విధానాలు శాశ్వతం కాదు.కాని భారతీయత శాశ్వతం. భారతదేశ సమైక్యత కీలకం.

1962 చైనా దురాక్రమణకు ముందు డి.ఎమ్.కె. తమిళనాడు విడిపోవాలన్న డిమాండ్ చేసింది.

చైనా దురాక్రమణ తర్వాత దేశ సమైక్యత అవసరాన్ని గుర్తించి తమ వేర్పాటు ఆలోచనకు స్వస్తిచెప్పి భారత దేశ రాజ్యాంగబద్ధ విధానాలకు కట్టుబడివుంటానని వాగ్దానం చేసి, ఆ తర్వాతి ఎన్నికల్లో అధికారం చేపట్టింది.

వేర్పాటువాదం ప్రమాదకరమైనది. ఒక ప్రాంత ప్రజల వేర్పాటువాద ఉద్యమఫలితాల వల్ల ఒక భాషా జాతి ఎంతగా నష్టపోయిందో, అంతర్గతంగా ఎలా కలహించుకున్నదో తెలుగువారికి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. స్వార్థ రాజకీయ ప్రయోజనాలను, సంకుచిత రాజకీయవిధానాలకు ఎంత త్వరగా స్వస్తి చెపితే అంత మంచిది.

*డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు*

Courtesy : WOMAN's ERA

# సెక్స్ ఒక పవిత్రబంధం

సెక్స్ గురించి, శరీర భాగాల గురించే కాదు, సెక్స్‌లో మనసుకుండే పాత్ర గురించి సరిగ్గా అర్థం చేసుకోనివారే లైంగికంగా, పిచ్చిగా ప్రవర్తిస్తారు.

ఇంటి దగ్గర సరైన పరిజ్ఞానంవారికి అందించబడనప్పుడు, అనవసరపు భయాలు కల్పించినప్పుడు, లైంగికంగా తప్పుడు సమాచారం అందుకున్నప్పుడు స్త్రీ, పురుషులిద్దరి ప్రవర్తనా మారిపోతుంది.

యుక్త వయసులోకి అడుగుపెడుతున్నప్పుడే ఆ మార్పును, ఆ మార్పు వెనకాల వున్న అసలువిషయాలను, శరీరంలోవచ్చినమార్పులకు తగినట్టుగా ఎలా ప్రవర్తించాలో, శారీరకఅంగాల్నెలా ఉపయోగించుకోవాలో తెలియచెప్పనందునే సమాజంలో ఇటువంటి సమస్యలొస్తున్నాయి.

స్త్రీ, పురుషుల మధ్య ఆకర్షణ ప్రకృతి సహజమైనది. స్త్రీ, పురుష అనుబంధం ఎంతో పవిత్రమైనది. అది మనసుల కలయిక. శరీరాలు పెనవేసుకునేందుకు ప్రోత్సహించేది.

ఇష్టపడి చేసినప్పుడు అద్భుతమైన ఆనందం, తృప్తి ఇచ్చేది లైంగిక బంధం. ఆ అనుబంధంలోకి దిగి అనుభవించినవారికే అందులోని అమరత్వం అర్థమవుతుంది. అటువంటి ఒక పవిత్రమైన లైంగిక బంధాన్ని సరిగ్గా అర్థంచేసుకోవటంలేదు.

లైంగికంగా ఎలా ప్రవర్తించాలో చాలామందికి తెలియదు.మనసును గెలవటం అంటే ఏమిటో అర్థం కాదు. పురుషుడు స్త్రీపట్ల ప్రవర్తించాల్సిన పద్ధతిలో లోపం. స్త్రీ, పురుషుడితో ఎలా వ్యవహరించాలో తెలియని పరిస్థితి.

ఫలితమే ఒక పవిత్రబంధం కాస్తా అపవిత్ర స్పర్శలకు, అత్యాచారాలకు, మోసాలకు దారితీస్తున్నది. మరే ఇతర జీవ జాతులకు ఇవ్వని ఒక గొప్ప లైంగిక వరం మానవులకు ప్రసాదించింది ప్రకృతి.

మిగిలిన జీవ జాతుల్లో లైంగిక ఆకర్షణ,కోరికలు అనేవి ఏదో ఒక ఋతువులో మాత్రమే కనిపిస్తాయి. ఋతువులకు అతీతంగా లైంగికంగా కలిసే జీవ జాతులు కొన్ని లేకపోలేదు.

అయితే వాటి శాతం బహుతక్కువ. వాటికి భిన్నంగా మానవులకు సంవత్సరకాలమంతా లైంగిక శక్తిని ప్రసాదించింది ప్రకృతి. ఏ రోజు అయినా లైంగికంగా కలవవచ్చు. అందులోనుండి పొందగలిగిన గరిష్ఠతృప్తిని పొందవచ్చు. కాని అటువంటి ఆనందం, తృప్తి ఆ పవిత్రకార్యం నుండి పొందాల్సినంత పొందుతున్నారా! అనేది ప్రశ్న.

సెక్స్ అనేది దానిని ఒక పవిత్రబంధంగా చూడగలిగితే సమాజంలో ఇన్ని రకాల లైంగిక నేరాలు జరగవు. గుంపుగా జనం కనిపిస్తే ఆడవారు భయపడాల్సిన అవసరం రాదు.

## యుక్త వయసులో

నలుగురిలో కలిస్తే తన శరీరం మీద ఎటువంటి దాడి జరుగుతుందోనన్న బెంగ ఆడవారికి కలగదు. కాని నేడు జరుగుతున్నది వేరు. తిరణాలలో, కిటకిటలాడే బస్సుల్లో, రైళ్ళలో ఆడ, మగ తేడా లేకుండా కలిసినచోట ఆడవారి శరీరం తాకకూడని చోటును తాకే పురుషులు కనిపిస్తున్నారు.

ఇతర సమయంలో ఎంతో మర్యాదగా ప్రవర్తించేవారుకూడా సందర్భాన్నిబట్టి మారిపోయి ఆడవారిపట్ల అనుచితంగా ప్రవర్తిస్తున్నారన్నది ఫిర్యాదు. ఆఫీసుల్లో లైంగిక వేధింపులు, ఆసుపత్రుల్లో అత్యాచారాలు వంటివన్నీ ఆ అనుచిత ప్రవర్తనవల్ల వస్తున్నవే.

సెక్స్‌గురించి సరిగ్గా అర్థంచేసుకున్నవారు తమ శరీరాన్ని జాగ్రత్తగా చూసుకున్నరీతిలోనే అవతలివారి శరీరాన్ని పవిత్రంగా చూస్తారు. అడ్డగోలుగా ఆ ఆనందం పొందాలనుకోరు. కోరి వచ్చినవారిని మెప్పించటంలో వున్న ఆనందంముందు బలవంతంగా అందుకునేది ఆనందం కానే కాదు.

## హార్మోన్లే మూలం



మనుషుల్లో వున్న అనేకశక్తులలో లైంగిక శక్తి ఒకటి. ఇదిచాలా సహజమైన శక్తి. ప్రకృతి ప్రత్యేకంగాఅందించినటువంటిది. మనిషి మనిషిలా ప్రవర్తించి, తాను నిర్వ హించవలసిన కార్యక్రమాన్నినిర్వహించేందుకు ఆ శక్తిని అందించింది ప్రకృతి.

ఆ శక్తిని వినియోగించితీరవలసిందే. వయసుతో రావాల్సిన మార్పులువస్తాయి.వాటిని ఎవరూ ఆపలేరు. శరీరంలో ఏర్పడేటువంటి హార్మోన్లప్రభావాన్ని ఆపాలని ప్రయత్నించటం అర్థంలేని విషయం. లైంగికశక్తి ప్రదర్శనకు, లైంగికంగా ఉత్తేజమయ్యేందుకు హార్మోన్లే మూలం. ప్రకృతిసహజమైన లైంగిక వాంఛలను కాదనుకోవటం తప్పు.

ఆ కోర్కెలను అదిమిపెట్టేయత్నం విఫలయత్నమే అవుతుంది. ఏ శక్తినైనా అదిమిపెట్టాలని చూస్తే అది ఏదో ఒక సమయంలో బద్దలైనట్టే, లైంగిక కోర్కెలను అదిమిపెట్టాలనుకున్నవారు ఆ కోర్కెల విస్ఫోటానికి బలి అవుతారు.

స్త్రీ, పురుషులిరువురిలో ఒక వయసుకు రాగానే లోపల మార్పులు మొదలై, బయటకు కనిపించి లైంగికశక్తి అందించబడుతుంది.

ఆ మార్పులు సహజమైనవని అర్థంచేసుకోలేని వారికే పలురకాల భయాలు.

ఆ మార్పులను వివరించి తమ పిల్లలను మానసికంగా సిద్ధంచెయ్యని తల్లిదండ్రులదే తప్పు.

రజస్వల అనుభవం సహజమైనది అమ్మాయిలకు. నిద్రలోనే జరిగేటువంటి తొలిస్ఖలనం అంతే సహజమైనది అబ్బాయిలకు. అయినా వాటిమీద భయాలు. తమ శరీరంలో కూడా మార్పులను అంగీకరించలేని బేలతనం. తమకేదో జరిగిపోతుందన్న బెంగ. మనసులో అంతులేని ఆలోచనలు.

శరీరంలో వస్తున్న మార్పులను తాను సరిగ్గా వినియోగించుకోగలనో లేదోనన్న సందేహాలు.

ఒక సహజమైన, ప్రకృతి ప్రసాదితమైన అంశాలలో ఒక సెక్స్‌మీదే ఎందుకు అన్ని రకాల సందేహాలు! అనేది అంతుపట్టని ప్రశ్న.

ప్రపంచానికి కామసూత్ర అందించిన భారతీయ సమాజంలో సెక్స్ మంచిది కాదు అన్న అభిప్రాయం కలగటమే ఒక వింత. పవిత్రమైన కార్యంగా ఒకనాడు భావించినది నేడు పాపకార్యంగా ఎందుకు చూడబడుతున్నది. సెక్స్ ఆలోచనలే రాకూడదు.

సెక్స్ కోర్కెలు అనైతికం. కోర్కెలను అణచుకోవాలేగాని ప్రదర్శించకూడదు.

## చాలా సహజమైనవి

నగ్నంగా శరీరాన్ని ప్రదర్శించకూడదు అంటూ ఎన్నో రకాల వ్యతిరేక అంశాలను పిల్లల మనసుల్లోకి ఎక్కిస్తున్నది సమాజం.

అలాకాక లైంగిక వాంఛలు చాలా సహజమని, వాటిని ఏ పద్ధతిలో హాయిగా అనుభవించాలో వారికి తెలియచెపితే సమాజంలో ఇటువంటి అక్రమంగా తడమటం, అత్యాచారాలవంటివి జరగవు.

ఏ కోరికనైనా అదిమిపెట్టటంవల్ల వచ్చే నష్టాలు మనుషులకు తెలియనివి కావు. సెక్స్ కోర్కెలను అదిమిపెట్టినందున మానసిక ఒత్తిడి పెరుగుతుంది. లైంగిక అంగాలకు సంబంధించిన అనారోగ్యాలు వస్తాయి. తమ శరీరం తమ ఇష్టం.

ఆ శరీరంమీద హక్కు తమది అనే ధైర్యం యవ్వనంలోకి అడుగుపెడుతున్నవారికి చెప్పాల్సింది పోయి అనవసరపు ఒత్తిడులకు గురిచేసే విషయాలను చెపుతున్నారు.

సెక్స్‌గురించి మాట్లాడటమే తప్పన్న భావన సమాజం కల్పించింది. ఒకవైపు సెక్స్ చాలా పవిత్రమైన కార్యంగా చెపుతూ మరోవైపు సెక్స్‌కి సంబంధించిన ఆలోచనలు, ఊహలు, సెక్స్‌లో పాల్గొనాలన్న కోరికలు ప్రమాదకరమైనవని చెప్పటం ద్వారా ఎంతో గందరగోళం యువతలో సృష్టిస్తున్నారు.

ఎంతో చక్కని, విలువైన, పవిత్రమైన, అద్భుతమైన అనుభవంగా సాగాల్సిన సెక్స్, స్త్రీ, పురుషుల పాత్ర సమానంగా సాగాల్సిన సెక్స్ చివరికి అమ్మాయిలు భయపడే అంశంగా-

పురుషుడికి మాత్రమే ప్రాధాన్యత వుండే కార్యంగా, స్త్రీ సమర్పించుకునేదిగా, స్త్రీ పవిత్రంగా కాపాడుకోవాల్సినదిగా ఆలోచించే స్థితికి సమాజం తెచ్చింది.

**కె.సుదర్శన్**



# అద్భుతమైన వరం

₹10,000 బహుమతి కథ

"అమ్మా, బాబుకి మళ్ళీ బాగా జ్వరం ముంచుకువచ్చిందమ్మా" పనిమనిషి రాజమ్మ స్నిగ్ధ ఆఫీసుకి ఫోన్ చేసింది. అరె మళ్ళీనా, సిరప్ వేశావా" అంది సిస్టంలో ఫైల్ క్లోజ్ చేస్తూ.

"వేశానమ్మా, కానీ ఒళ్ళు బాగా కాలిపోతోంది. కొంచెం కంగారు అన్పించి, ఫోన్ చేశానమ్మా" అంది.

"అంటే అనిల్ ఇంట్లో లేడా" అడిగింది స్నిగ్ధ.

"ఇందాకే ఎవరో ఫోన్‌చేస్తే అయ్యగారు హడావుడిగా బయటకు వెళ్ళిపోయారమ్మా"

"ఇంత రాత్రివేళ పన్నెండింటికి నిన్ను, పిల్లాడ్ని వదిలేసి బయటకు వెళ్ళాడా, నేను నైట్ ఆఫీసుకి వెళ్ళానని తెలుసుకదా" నమ్మలేనట్లుగా అంది.

సెల్ : 97044 44760

కె.వాసవదత్త రమణ





రాజమ్మ ఏమి జవాబు చెప్పలేనట్లుగా "అదేనమ్మా, కానీ సారు" ఫోనులో ఇబ్బందిగా అంది.

"సరేలే, ముందు వాడి తలమీద తడిగుడ్డ వేసి తీస్తుండు, నేను సార్‌తో మాట్లాడతాను. ఎవరో ఒక్కళ్ళం త్వరగా ఇంటికి వచ్చేస్తాంలే, కంగారుపడకు" ఫోన్ పెట్టేసి, అనిల్‌కి కాల్ చేసింది.

"హాయ్ స్వీట్ హార్ట్, ఏంటి మరీ ఇంత రాత్రివేళ నీకు గుర్తుకువచ్చాను, కొంపదీసి మూడ్‌గాని వచ్చేసిందా" కొంటెగా అడిగాడు.

అతను చెప్పింది వినిపించుకోకుండా "అనిల్? ఎక్కడున్నావు ఇప్పుడు?" అసహనంగా అడిగింది.

"వాట్? ఏమైంది, స్నిగ్ధ" ఆశ్చర్యంగా అన్నాడు.

"ఏమైందని, అంత కూల్‌గా అడుగుతున్నావా? నువ్వు ఇంట్లో లేవని పబ్‌లో పార్టీలో ఉన్నావని నాకు తెలియదనుకున్నావా?" ఆమె మాటల్లోని ఆవేశానికి అతనిలో హుషారు చప్పున చల్లారిపోయింది.

"ఏమైందిప్పుడు?" విసుగ్గా అన్నాడు.

"పొద్దున పోలియో చుక్కలకి, జ్వరం తప్పనిసరిగా వస్తుందని డాక్టర్ మనకి చెప్పాడా లేదా? ఇప్పుడు మున్నాకి హైఫీవర్. అసలు నీకేమైనా వాడి సంగతి పడుతుందా? నాకు నైట్ డ్యూటీ అని తెలిసికూడా నువ్వు జ్వరంతో ఉన్న బాబుని ఇంట్లో అలా వదిలేసి ఇంత అర్ధరాత్రివేళ రోడ్లమీద తిరుగుతున్నావా? ఇదేనా తండ్రిగా నీ బాధ్యత?"

"మరీ సీన్లు సృష్టించకు స్నిగ్ధా, మున్నా బాగానే



ఉన్నాడు, నేను బయటికి వచ్చి జస్ట్ ఒక గంటైంది. అంతే, అదీ ప్రణీత్ బర్త్‌డే పార్టీ అని ఫోన్ చేసి చాలా గొడవపెడితే"

"సిగ్గులేదు అబద్ధాలాడటానికి"

"షట్ యువర్ మౌత్, చాలా రెచ్చిపోయి మాట్లాడుతున్నావ్" కోపంగా ఫోన్ పెట్టేశాడు.

ఆమె అవమానంతో, కోపంతో ఉడికిపోయింది. ఆఫీసు నుంచి టెన్షన్‌పడుతూ, కార్ డ్రైవ్ చేసుకొని ఇంటికి చేరేటప్పటికి రాత్రి రెండుగంటలు దాటింది.

"సిరప్‌వేశాను, వేడి కొద్దిగాతగ్గిందమ్మా" రాజమ్మ తలుపులు తీస్తూ అంది.

"ఓకే" అంటూ అలసిపోయిన కళ్ళతో, ఆందోళనగా బెడ్‌రూమ్ తలుపుతీసి లోపలికి చూస్తే... అనిల్ మంచంమీద అడ్డంగా పడుకొని నిద్రపోతున్నాడు, అతని గుండెల మీద మున్నా నిద్రపోతున్నాడు అతని చేతులు బాబును చుట్టుకునిఉన్నాయి భద్రంగా!

నిశ్శబ్దంగా లోపలికి నడిచి వాడి ఒంటిమీద చేయి వేసి చూసింది 'కొద్దిగా వేడిగా ఉంది. కాని చెమట పడుతోంది పర్వాలేదులే' అని మనసులో అనుకుని రిలీఫ్‌గా నిట్టూర్చి, అలాగే వాళ్ళపక్కగా ఓ మూలకి ఒరిగి పడుకుంది. వెంటనే నిద్రపట్టేసింది ఆమెకి.

"రిషి. అసలు మనుషులు ఇంత అహంకారులుగా ఎందుకు అవుతున్నారో నాకు అర్థం కావడం లేదు" క్యాబిన్ డోర్ విసురుగా తీసుకుని లోపలికి వస్తూ అంది స్నిగ్ధ, రిషితో.

"అంత అర్థం కాకపోవడానికేం ఉంది? ఆ మనుషుల్లో, నువ్వుకూడా ఉన్నావు కదా" అన్నాడు రిషి.

"నేనా" నమ్మలేనట్టుగా కోపంగా అంది.

"యా" తమాషాగా తల ఊపుతూ అన్నాడు.

"నో వే" ఎర్రబడిన ముఖంతో అంది.

బదులుగా గట్టిగా నవ్వాడతను.

"ఆపు రిషి. ఏంటానవ్వు? అబ్బా నీ నవ్వుతో నా చిరాకును ఇంకాపెంచేస్తున్నావు? నేనెంత ఫ్రెండ్లీగా ఉంటాను,అస్సలునన్ను ఎందుకలాఅన్నావో,ముందు అది చెప్పు?" చిన్నబోయిన ముఖంతో అంది.

"నేను చెబితే నువ్వు జీర్ణం చేసుకోలేవులే కానీ ఐనా నువ్వు ఎస్కేపిస్ట్ అని ఎప్పటికీ ఒప్పుకోలేవు"

"షిట్, కావాలని ఊరికే నన్ను రెచ్చగొట్టకు నాకు ఒళ్ళు మండిపోతోంది"

"అందుకే వదిలెయ్. కూల్‌గా మంచినీళ్ళు తాగు" టేబుల్ మీదున్న నీళ్ళు చూపిస్తూ అన్నాడు.

"టాపిక్ డైవర్ట్ చేయకు. నేను ఎస్కేపిస్ట్ అనడానికి ఒక్క కారణం చెప్పు ముందు" తీవ్రంగా అంది.

"రిలాక్స్ స్నిగ్ధ, నువ్వు నాతో ఇలా మాట్లాడటమే, నీ భర్తతో నీ భావాలు సరిగా పంచుకోలేక, మీ ఇద్దరికీ పడక నీ ఆఫీస్ కొలీగ్స్‌తో నీ వ్యక్తిగత విషయాలు చర్చించడమే" తాపీగా అన్నాడు.

దెబ్బతిన్న పాములా అతనివంక చూసింది. అతనిది ముందే ఊహించినట్లుగా ఆమె ముఖంకేసి పరిశీలనగా చూస్తుండిపోయాడు.

"అరే ఏమైంది? అగ్నిపర్వతం పేలుతూ అలాఅలా ఆగిపోయింది" ఆశ్చర్యాన్ని నటిస్తూ అన్నాడు.

"వెయిట్, జస్ట్ వెయిట్ రిషీ. నాకిప్పుడు అంతా బాగా క్లియర్‌గా అర్థమవుతోంది. అనిల్‌కి పెళ్ళయిన కొద్ది సంవత్సరాలకే నేను చాలా బోర్ కొట్టేస్తున్నాను, అంటే మగవాళ్ళకి ఎప్పుడూ చెప్పుచేతల్లో ఉండే భార్యలు కావాలి, పొద్దున లేవగానే కాఫీ అందివ్వాలి, మంచి భోజనంపెట్టాలి, పైగా ఉద్యోగం చేసి డబ్బులు తేవాలి. పిల్లల్ని తానేబాధ్యతగా చూసుకోవాలి. మగాళ్ళని మటుకు కాలుమీద కాలువేసి కూర్చోనివ్వాలి. అప్పుడే మేము నచ్చుతాము అంతేనా"

రిషి కుర్చీలోంచి హఠాత్తుగా లేచాడు ముందుకు వంగి ఆమె కళ్ళలోకి లోతుగా చూశాడు. "నెక్ట్స్ వీక్ మనం పూనా సెమినార్‌కి వెళ్తున్నాం కదా"

"అయితే, ఇప్పుడు దాని గొడవ ఎందుకు?" చికాకుగా అంది స్నిగ్ధ.

"ఆ టూర్ మధ్యలో రెండు రోజులు నిన్ను మహాబలేశ్వర్ హిల్ రిసార్ట్‌కి ఏకాంతంగా తీసుకెళ్ళాలనిపిస్తోంది" "వాట్...!!"

"నీకు కంఫర్మ్‌గాపిచ్చెక్కింది" అరిచింది స్నిగ్ధ.

"రిషి. వావ్ మహాబలేశ్వర్ ఇట్స్ బ్యూటిఫుల్ ప్లేస్ రిషి, ఐ లవ్ దిస్ ప్లేస్. రియల్లీ థ్యాంక్స్, చుట్టూ ఉన్న ప్రకృతి ఎంత బావుందో, నేను ఎప్పటినుంచో వద్దామనుకుంటున్న హాలిడే స్పాట్ ఇది. ఇప్పటికి ఆఫీస్‌వాళ్ళ పుణ్యమాఅని రావడానికి వీలైంది" సంభ్రమాశ్చర్యంగా అంది స్నిగ్ధ.

వైట్ టీ షర్ట్, బ్లూ జీన్స్ వేసుకున్న స్నిగ్ధ అతని కంటికి చిన్నపిల్లలా, ఓ కాలేజ్‌గర్ల్‌లా అనిపించింది.

"బాగానే ఉంది కానీ, నేను అందరినీ తీసుకుని వస్తే, క్రెడిట్ అంతా ఆఫీస్‌కా, వెరీ బ్యాడ్?" దూరంగా కనిపిస్తున్న ఆఫీస్ కొలీగ్స్‌ని చూస్తూ అన్నాడు.

"ఓకే, ఓకే థ్యాంక్స్, నీకే థ్యాంక్స్ అంతా సరేనా" ఎర్రటి చిగుళ్ళు కన్పించేలా నవ్వుతూ అంది.

"ఓన్లీ థ్యాంక్స్, అంతేనా" అలకగా అన్నాడు.

"మరి? ఇంకేం కావాలి?" అంది.

"ఈ జీన్స్, చుడీదార్స్ అన్ని వదిలేసి..."

"వదిలేసి..." అనుమానంగా చూస్తూ అంది.

"చక్కగా చీర కట్టుకుని, మధ్యలో ఆఫీస్ పనులు ఇవి, అవి అని డైవర్ట్ అవ్వకుండా, నాతో సరదాగా హిల్‌స్టేషన్ అంతా తిరగాలి. జస్ట్ 24 గంటలు. ఓన్లీ విత్ మి" అన్నాడు రిషి.

"రిషి" షాక్ కొట్టినట్లుగా చూసింది.

"రేపు ఒక్కరోజు! అబ్బా స్నిగ్ధ. అంత ఆలోచిస్తున్నావు. నువ్వు వేస్ట్" తలపట్టుకున్నాడు.

"ఏయ్, ఏదయినా తేడా వచ్చిందో, అనిల్ నిన్ను చంపేస్తాడు" చటుక్కున అంది.

"ఇప్పుడు అతని స్థానం గుర్తుకువచ్చిందా తల్లి. అయినా నీకంటే అతనికి వెయ్యిరెట్లు విశాల హృదయం ఉంది, సరే ఎవరు డిస్టర్బ్ చేసినా నువ్వు టూర్ అయ్యేవరకు నువ్వు నా పరిధిలోనే ఉండాలి" ఆమె కళ్ళలోకి లోతుగా చూస్తూ అన్నాడు.

"అలాగే" ఇబ్బందిగా కదులుతూ అంది.

# ప్రజాస్వామ్య వ్యవస్థలకు మేలుకొలుపు మాట



“ప్రజాస్వామ్యంలో వ్యవస్థలన్నీ సరైనమార్గంలో వెళుతున్నాయా లేదా అనేది ఎప్పటికప్పుడు సమీక్షించుకోవటం అవసరం” అని సుప్రీమ్‌కోర్టు న్యాయమూర్తి జాస్తి చలమేశ్వర్ చేసిన హెచ్చరిక వివిధ స్థాయిలలో బాధ్యతలు నిర్వహిస్తున్న వారికే కాదు ప్రజాస్వామ్య హితులు అందరికీ ఒక మేలుకొలుపు వంటిది.

ఇటీవలికాలంలో న్యాయవ్యవస్థ సంక్షోభంలోపడినప్పుడు తన గొంతుక విప్పి, మీడియా ముందుకు వచ్చిన సాహసి జస్టిస్ చలమేశ్వర్. ఇప్పుడు చీఫ్ జస్టిస్ దీపక్ మిశ్రాని అభిశంసించాలన్న డిమాండ్ రాగా అది సమస్యకు సమాధానం కాదని, వ్యక్తికన్నా వ్యవస్థలు ముఖ్యమనటంద్వారా తనలోని న్యాయకోవిద పరిపక్వతను మరోమారు ప్రదర్శించాడు.

‘రాజ్యాంగం పొందుపరిచిన ప్రధానన్యాయమూర్తి హక్కులను గురించేకాదు, ఆ హక్కులతో పాటుగా వచ్చే బాధ్యతలనూ విస్మరించకూడదు. అధికారం విచ్చలవిడిగా వాడకూడదు. ప్రజలకు మేలు చేసేలా వుండాలి’ అన్నది జస్టిస్ చలమేశ్వర్ చేసిన హెచ్చరిక.

రాజ్యాంగ వ్యవస్థలు, వాటి విలువలు దిగజారుతున్నాయన్న ఆందోళన దేశ ప్రజలందరిలో వుంది. అటువంటి సమయంలో బాధ్యతాయుతమైన పదవిలోవున్నవారు వ్యవస్థలనిర్వాహకులను మేలుకొలపాల్సివుంది. ఆ పనిని చేపట్టిన జస్టిస్ జాస్తిచలమేశ్వర్ అభినందనీయుడు.

పదవీ విరమణ తర్వాత తాను ప్రభుత్వ పదవులేవీ కోరనని ముందుగానే స్పష్టంచేసి, తాను నోరు విప్పుతున్నది వ్యవస్థల మెరుగుకోసమేనన్న జస్టిస్ చలమేశ్వర్ మాటను జాతి స్వాగతిస్తున్నది. ◆

హోటల్ గదిలోంచి బయటకు రాగానే చల్లగాలి ఒంటికి తాకి స్నిగ్ధకి హాయిగా అనిపించింది. “రిషి, శారీ నాకు అంత కంఫర్ట్‌గాఉండదు చూడు బావుందా, బాగా కట్టుకున్నానా. అనిల్ చూస్తే నవ్వుతాడు, చీర కట్టుకోవడం రాదు అసలు నువ్వు ఆడపిల్ల వేనా అంటాడు” చీర కుచ్చెళ్ళు సవరించుకుంటూ, లేని విసుగుని నటిస్తూ అంది స్నిగ్ధ.

“ఏంటి, ఎక్కడున్నావు నువ్వు రిషి” అని తలతిప్పి చూస్తే, పక్కన కొంటె చిరునవ్వుతో అనిల్ ఉన్నాడు.

“అనిల్” నువ్వు, ఇప్పుడే తలుచుకుంటున్నాను, ఎలా వచ్చావు? బాబేడి?” అంది స్నిగ్ధ.

“బాబుని అమ్మ దగ్గర వదిలి వచ్చాను” అన్నాడు అనిల్. ఇంతలో “బై” అంటూ చేయి ఊపుతూ నవ్వుకుంటూ వెళ్ళిపోతున్న రిషి కనిపించాడు ఆమెకి.

“ఇది మీరు ఇద్దరూకలిసివేసిన ప్లానా, అవునా”

“అవును” అనిల్ నవ్వుతూ అన్నాడు.

“ఛ నిన్నట్నుంచి ఎంత హడలుకొట్టాడు”

“మనం ఈ రెండు రోజులు ఏకాంతంగా గడపాలన్నది రిషి ఐడియా డియర్”

“మాటల్లో ఏదోతేడా ఉందనిపించింది, కానీ అది ఏమిటో పట్టుకోలేకపోయాను. తోడు దొంగలు ఇద్దరూ కలిసి ఎంత నాటకం ఆడారు. నాకిప్పుడు అంతా అర్థమవుతోంది”జారిపోతున్న పైటలోంచి సన్నటి నడుం, వాలుగాపక్క నుంచి సిగ్గుగా తొంగిచూస్తూ ఉంది.

ఆమెవంక మెరుస్తున్నకళ్ళలో చూసి, “చీర కట్టుకుంటే నీలో ఇంత అందం ఉందా? స్నిగ్ధా, యు ఆర్ టూ బ్యూటిఫుల్!” అన్నాడు అనిల్.

“థ్యాంక్యూ, అయినా ఏంటి జీన్స్‌లో, లెగ్గింగ్స్‌లో అందంగా ఉండనా” కవ్వింపుగా అంది.

“అందంగా ఉంటావు డార్లింగ్, కానీ చీరలో నాలాంటి మగాడిని ప్రొవోక్ చేసే అందం వేరేది ఒకటి ఉంటుంది. అది మత్తెక్కించేస్తుంది” కళ్ళతో ఆమెని ఆసాంతం తడుముతూ అన్నాడు.

“చాల్లే” ఆమె ముఖం ఎర్రబడింది.

“నిజం” అంటూ ఆమెకి దగ్గరకి వచ్చాడు. కొద్దిగా సిగ్గుపడి “ఓకే థ్యాంక్స్” ముద్దుముద్దుగా అంది.

తాకీతాకనట్టుగా ఆమెకి పక్కన నిలబడి, ఎదురుగా ఉన్న సెల్లోకి చూపిస్తూ “లవ్లీ పెయిర్ కదా, మన పెయిర్” అన్నాడు సెల్ఫీ తీస్తూ.

ప్రేమగా అతని మెడ చుట్టూ చేయి వేసి “ఎప్పుడూ ఇలా ఉండవెందుకు అనిల్” సన్నటి నీటిపొర కళ్ళలో మెరుస్తుండగా చిన్నపిల్లలా అంది.

“ఓకే ఓకే గతాన్ని వదిలెయ్. నేను మారాలి, నువ్వు కొంచెం మారాలి. సరే పద పద వి విల్ స్టార్ట్ ఫస్ట్ సైట్‌సీయింగ్” ఆమె నడుముచుట్టూ చేయివేసి దగ్గరగా లాక్కుంటూ అనిల్ హుషారుగా అన్నాడు. ఒక గంట అక్కడే ఉన్న గార్డెన్లో కలిసి తిరిగారు.

“ఐస్ క్రీమ్ తిందామా” అన్నాడు అనిల్. ఒక మూల ఉన్న టేబుల్ చూసుకుని, కూర్చుని ఆర్డర్ ఇచ్చారు. “అరే ఏంటి? నా ఐస్ క్రీమ్ నువ్వు తింటున్నావు” గారాంగా అంది.



చిరంజీవిగారు ప్రస్తుతం కాంగ్రెస్‌లో వున్నా రేపు ఎటు మొగ్గుతారో నాకు తెలియదు... ఆయన ఎటువెళితే నేను అటే.

-అల్లు అర్జున్, నటుడు

“నీ పెదాల తేనె కలిసి ఇంకెంత తియ్యగా ఉందో అని రుచిచూస్తున్నాను”గట్టిగా నవ్వుతూ అన్నాడు.

“ష్ అందరూ మనవంకే చూస్తున్నారు”

“చూడని నాకేంటి! నా వైఫ్, నా ఇష్టం!” ఐస్ క్రీమ్ ఇంత తీయగా ఉంటే, ఐస్‌క్రీమ్‌తో కలిపి నీ పెదాల్ని... రుచి!”

“చట్!” చేయి ఎత్తి అతని నోరుమూస్తూ కొట్టబోయింది. ఆమె రెండు చేతులను తన గుప్పెట్లో ఇముడ్చుకుంటూ “ఇప్పుడు కొట్టు చూద్దాం” అన్నాడు అల్లరిగా. చల్లగాలికి అతని నుదురుమీద జుట్టంతా ఎగిఎగిరిపడుతోంది. అతని ముఖంలో కొంటెదనం వెల్లివిరుస్తోంది.

“స్నిగ్ధా!” పద, ఆ కొండదాటి ముందుకు వెళ్దాం” స్పీడ్‌గా ముందుకు కదిలాడు. అనిల్‌చేతులు పట్టుకుని, పోటీపడుతూ పచ్చటికొండలనిఎక్కుతుంటే స్నిగ్ధలో ఏదోతెలియని ఉత్సాహం ఆమెమనస్సంతా ఆనందంతో తుళ్ళిపడుతోంది.

మధ్యలో ఒకచోట ఎక్కుతుంటే కాలు జారింది “ఏయ్ జాగ్రత్త!” వెనక నుంచి వచ్చి రెండు చేతుల్తో ఆమెని చుట్టేసుకుని చెవిదగ్గర గుసగుసగా అన్నాడు. అతనినలాగే లతలా పెనవేసుకుపోయింది.

“అదిగో... పైన చూడు! ఎన్ని పక్షులో!” అతని భుజం మీదనుంచి పైకి చూసింది ఆకాశం వంక”

“ఇదిగో చూడు, మనం ఎంత పైకి వచ్చామో. మబ్బులో పైకి తేలుతున్నాము చూడు” కళ్ళు తిప్పుకుని చిన్నపిల్లలా సంబరంగా చూసింది. ‘కిందంతా పచ్చని దుప్పటిలా నేలా, పైన నీలిరంగు ఆకాశం.

చుట్టూ మురిపిస్తున్న ప్రకృతి. అతన్ని తమకంగా అల్లుకుపోయింది. రెండు చేతులూ చాచి గిరగిరా తిరుగుతూ “అనిల్, ఐ యామ్ వెరీ హ్యాపీ, నా జీవితంలో ఈరోజుని ఎప్పటికీ మర్చిపోలేను. మన పెళ్ళయ్యాక ఇంత ఆనందాన్ని నేనెప్పుడూ ఫీల్ అవ్వలేదు” మెరుస్తున్న కళ్ళతో అంది స్నిగ్ధ.

“ఈ అద్భుతమైన ఆలోచనకు కారకుడు రిషి. నన్నుచాలా ఫోర్స్‌చేశాడు, ఆఫీస్‌లో చాలా బిజీ అన్నా వినలేదు. ఒక్కరోజు ఎలాగైనా నేను వచ్చి వెళ్ళాలని అతను గట్టిపట్టు పట్టేశాడు. ఇక తప్పలేదు. ఫ్లైట్ బుక్ చేసుకుని వచ్చేశాను, కానీ ఇంత అందమైన అనుభూతులతో తిరిగి వెళ్తానని ఊహించలేదు”

“మధురమైన రాత్రికి థ్యాంక్స్‌స్నిగ్ధ, మన ప్రామిస్‌లు మర్చిపోకు. ఏ గొడవలు పడకుండా, ఇకనుంచి మనం ప్రతిరోజూఇలాగే ప్రతిరాత్రి గడపాలి. ఐ లవ్ యు డార్లింగ్. “రిషి థ్యాంక్స్, మీ వర్క్ పూర్తిచేసుకుని త్వరగా వచ్చేయండి” అని అనిల్ మర్నాడు వెళ్ళిపోయాడు.

“పద అక్కడ కూర్చుందాం” సెమినార్ అయి బయలుదేరేరోజున స్నిగ్ధతో అన్నాడు రిషి. అతను గడ్డిలో వెల్లకిలా పడుకుంటూ, తలకింద చేయి పెట్టుకొని



## ఆశలన్నీ దానిపైనే

గత ఏడాది నాలుగు చిత్రాలపై పెట్టుకున్న ఆశలన్నీ అడియాసలు కాగా, ఈ ఏడాది 'ఆచారి అమెరికా యాత్ర'పై ప్రగ్యాజైస్వాల్ కొండంత ఆశలు పెట్టుకున్నది. సినిమా విడుదల వాయిదాలు పడుతూ వచ్చి, ఎట్టకేలకు తేదీ ఖరారు కావడంతో ఊపిరి పీల్చుకున్నది.

గత ఏడాదిలో చేసిన సినిమాల్లో రెండు క్యామియోలే. ఒక్క, 'జయజానకి నాయక' మినహా మిగతావి బాక్సాఫీసు విజయాలు చవిచూడలేదు. టాలీవుడ్‌లో నిలదొక్కుకోవాలంటే ఈ కొత్త సినిమా దృఢమైన ప్రభావం చూపాల్సివుంటుంది. ప్రగ్య ఈ చిత్రంలో ఎన్ఆర్ఐ గాళ్‌గా నటిస్తున్నది.

ఆమెవంక పరీక్షగాచూస్తూ "గుడ్ స్నిగ్ధ. నేను అనుకున్న ఫలితం నీలో కనిపిస్తోంది. నీ సంతోషానికి కారణం చెప్పనా" అన్నాడు.

"చెప్పు" తుళ్ళిపడుతూ అంది స్నిగ్ధ.

"నువ్వు అమ్మాయిలా ఉండటం, నీ జీవితం, నీ జీతం, నీ హోదా అన్నీ మర్చిపోయి, నువ్వు సహజంగా స్త్రీలా ప్రవర్తించడం, అంతే సింపుల్" నవ్వుతూ అన్నాడు. స్వచ్ఛమైన అతని నవ్వువంక అడ్మైరింగ్‌గా చూస్తూ "అబ్బా మళ్ళీ మొదలుపెట్టావా రిషి, ఫైనల్‌గా నువ్వు కూడా హ్యాపీనే కదా" అంది.

"ఎస్ 100%, నేను ఓవర్‌గా చేశానని అనిపించిందా, ఇద్దరినీ ఇబ్బంది పెట్టానని పించిందా"

గలగలా నవ్వేస్తూ "నిజం చెప్పాలంటే నేను అనిల్‌తో కలిసిపోయి, నేను నేనయ్యాను, అంతా ప్రకృతి మహిమ. మా మధ్య ఉన్న గ్యాప్ హఠాత్తుగా మాయమైంది. ఇక రోజూ నీకు థ్యాంక్స్ చెప్తూనే ఉంటాను రిషీ" అంది స్నిగ్ధ.

"ఆ అవకాశం నీకు రాదులే"

"అంటే" అతని కళ్ళలోకి గుచ్చిగుచ్చి చూసింది.

"రెండు నెలల క్రితం అప్లై చేశాను చూడు, అదే యుఎస్ ఆఫర్ వచ్చింది, ఫ్లయింగ్ టు అమెరికా" గాల్లో చేయి విమానంలా ఊపుతూ అన్నాడు.

షాక్ తిన్నట్లుగా "నో ఐ డోంట్ బిలీవ్, నేను ఒప్పుకోను. నువ్వు వెళ్ళొద్దు రిషీ, నాలుగు రోజులైతే మళ్ళీ అనిల్ మారిపోతాడేమో, అప్పుడు నా బాధల్ని ఎవరికి చెప్పుకోవాలో తెలియక నేను ఒంటరిగా మిగిలిపోతాను" అంది స్నిగ్ధ.

"లైఫ్ ఈజ్ బ్యూటిఫుల్ స్నిగ్ధ. దేముడు మనకిచ్చిన అద్భుతమైనవరం జీవితం. దాన్ని ఆనందంగా, ఆహ్లాదంగా మార్చుకోవడం మన చేతుల్లోనే ఉంది. అంతకన్నా అద్భుతమైనవరం శృంగారం.అది ఎగ్జయిటింగ్‌గా చేసుకోవడం ఇద్దరి చేతుల్లోనే ఉంది"

"స్నిగ్ధా, ఈ బిజీలైఫ్‌లో మార్నింగ్ డ్యూటీస్, నైట్ డ్యూటీస్ అంటూ నువ్వు, అనిల్ చెరోవైపు దూరంగా వెళ్ళిపోతున్నారు.అందుకే ఆ వెలితిలే లోపల డిప్రెషన్ లాగా మారి చికాకులు, కోపాలు, బయటపడి నీకు, అనిల్‌కి మధ్య అగాధాల్ని సృష్టిస్తున్నాయి.

వారమంతా కష్టపడి,వీకెండ్ సెలబ్రేషన్స్ అంటూ ఊరంతా బొంగరంలా తిరిగి, హోటల్‌లో భోంచేసి ఇంటికిరావడమే, పెద్ద ఎంజాయ్‌మెంట్ అని, ఒక పదినిమిషాలసౌఖ్యం పెద్ద శృంగారం అని ఫీల్అవుతూ ఒట్టిభ్రమల్లో మీరిద్దరేకాదు, చాలామంది హైటెక్ సిటీల్లో ఇలాగే బతికేస్తున్నారు.

"స్నిగ్ధా, ఆనందం అనేది కేవలం వీకెండ్స్ స్పెండ్ చేయటంలోనేరాదు.ప్రతిసెకనూ కవ్వింతలు, తుళ్ళింతలు మిళితంచేసి నీ జీవితాన్ని రసమయం చేసుకోవడంతోవస్తుంది. లైఫ్ అంటే ఇలా ఉండాలి, ఇలా గడపాలి, థ్రిల్లింగ్‌గా, జాయ్‌ఫుల్‌గా ప్రతి నిమిషం ఎంజాయ్‌చేస్తూ అని నీకు తెలియచేయాలి అని అనుకున్నాను. అందుకే ఆ రోజు అలా ప్లాన్ చేశాను. అయితే అనిల్ నిజంగా గ్రేట్, ఒప్పుకున్నాడు. నేను ఎలా చెప్పానో అలాగే చేశాడు"

"అనిల్, మరి ఆలా నీలా లేడు, నీలా నా గురించి ఏమీ ఆలోచించడు కదా, నన్ను కేర్‌గా చూసుకోడు కదా. చొరవ తీసుకోడు కదా అని ఫీల్ అవ్వకు. మగవాడు ఎప్పుడూ చిన్నపిల్లవాడే స్నిగ్ధా. అతన్ని మౌల్డ్ చేసేశక్తి ఆ భగవంతుడు ఒక్క ఆడదానికే ఇచ్చాడు.

తల్లిగా, చెల్లిగా, నెచ్చెలిగా, చెలిగా, వివిధ రూపాలతో ఆడది మగవాడ్ని ప్రతిగమనంలో చాలా ఇన్ఫ్లుయెన్స్ చేయుగలదు.కానీ నువ్వు నీలో స్త్రీ పాత్ర గురించి నువ్వు మర్చిపోయావు. ఉద్యోగం, కెరీర్, ప్రమోషన్స్ అంటూ నువ్వు పురుషపాత్రలోకి వెళ్ళిపోతున్నావు. సమాజం మారుతోంది.

ఆడవాళ్ళు అన్ని రంగాల్లోకీ దూసుకుపోతున్నారు. ఆడవాళ్ళు ఎదగకూడదని నేను అనడంలేదు, కానీ భగవంతుడు నీకు బేసిక్ రోల్‌గా ఇచ్చిన స్త్రీ పాత్రలోని మాతృత్వం మమకారాన్ని, పెద్దరికాన్ని, ఇల్లాలిలా నీ బాధ్యతలను విస్మరించకూడదని నా అభిప్రాయం. నువ్వేకాదు, ఈతరంలోని ప్రతి అమ్మాయీ ఆ సన్నని తీగను బ్యాలెన్స్‌గా దాటాలి.

మరి నేనూ ఉద్యోగం చేసి సమానంగా సంపాదిస్తున్నాను, అనిల్ కూడా స్త్రీ పాత్రా పోషించాలి కదా అని నువ్వు హక్కుగా అడగవచ్చు.

కానీ స్త్రీ మారినంత సులువుగా పురుషుడు మారలేడు స్నిగ్ధా. దానికి చాలాతరాలు పడుతుంది. ఎవరు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా అదివాస్తవం. అయినా నువ్వు రాత్రిళ్ళు డ్యూటీకి వెళితే తెల్లవార్లూ అనిల్ ఏడాది బట్టి మున్నాని బాధ్యతగా చూసుకుంటూనే ఉన్నాడు కదా. అది ఒక మార్పేకదా స్నిగ్ధా. అతను క్రమంగా ఇంకా మారతాడు.

తిరిగి వెళుతున్నప్పుడు, అనిల్‌కి కూడా ఇదంతా చెప్పాను స్నిగ్ధ. నిన్ను పూవుల్లో పెట్టి చూసుకోమన్నాను. మనసంతా ఇంత ప్రేమని నింపుకున్న అమ్మాయి ఎక్కడా దొరకదని, నువ్వు చాలా అదృష్టవంతుడవని కూడా చెప్పాను"

"గో ఎహెడ్ స్నిగ్ధ, మాక్ యువర్‌లైఫ్ మరి బ్యూటిఫుల్ అండ్ రొమాంటిక్. అప్పుడు నా వంటి వాళ్ళ అవసరం నీకు ఎప్పుడూ ఉండదు. ఎప్పటికి రాకూడదుకూడా. నీ ప్రాణస్నేహితుడిగా ఇదే నా కోరిక"

"రిషి" అతని మాటలకు చలించిపోతూ కళ్ళలో చెమ్మచేరుతుండగా అతని చేయి పట్టుకుంది.

కొద్ది నెలలకు….."హాయ్ స్నిగ్ధ, గుడ్ మార్నింగ్… సారి గుడ్‌నైట్ అని చెప్పాలేమో?" అమెరికా నుంచి రిషి కాల్‌చేశాడు. "అదేమిటి? అప్పుడే టైం అయిందా?" అరిచింది స్నిగ్ధ.

"అంతేకదా. నేను పొద్దున ఆఫీస్‌కి వచ్చాను అంటే నువ్వు రాత్రి నైట్ డ్యూటీకి బయలుదేరుతూ ఉండాలిగా. ఇక్కడ మీకు పగలు అయితే మాకు రాత్రిగా? ఏంటి? ఇంకా రెడీ కాలేదా ఆఫీస్‌కి డుమ్మా కొట్టావా ఏంటి?" అన్నాడు రిషి అవతలినుంచి.

"అమ్మో,టైమ్‌చూడనేలేదు?ఇవాళ చాలాఅర్జెంట్ మీటింగ్ కూడా ఉంది. అయినా ఏది ఈ పిల్లోడు నన్ను వదిలిపెడితేగా" అంది.

"ఎందుకు లేట్ అవుతావు ఎప్పుడూను. కాస్త అనిల్‌కి బాబును చూసుకోమని చెప్పు, మళ్ళీ ఇంత రాత్రివేళ కార్ డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళాలి నువ్వు"

"అయ్యో రిషి, ఇక్కడ నన్ను వదలంది ఆ పిల్లవాడు కాదు, ఈ అనిల్ మహానుభావుడే" వెనక నుంచి ముద్దుల చప్పుడు.

"ఇంకానయంరిషి,నీకుఫోన్‌లో అక్కడ బొమ్మల్లా కనపడటంలేదు, సిగ్గుతో చచ్చిపోదును. అబ్బా, వదులు అనిల్, అయ్యో రిషి నిన్ను కాదులే, ఫోన్ నువ్వే పెట్టేసెయ్. నేను ఆఫీస్‌కి వెళ్ళాక నీకు మళ్ళీ కాల్ చేస్తాను" అనిల్ కౌగిలిలో కరిగిపోతూ, హడావిడిగా ఫోన్ క్లిక్ చేసింది.

రిషి పెదాలపై చిరునవ్వు విరిసింది.

# అంతా రాజకీయమే

## చేసేది లేక

అధికారంలో ఉండగా తెలుసుకోవాల్సిన విషయాలను చాలామంది నేతలు అధికారం కోల్పోయిన తర్వాత తెలుసుకుని, ఆ విషయంమీద ఆశ్చర్యపోయి, పరిస్థితులు ఇంత అధ్వాన్నమా అని మాట్లాడి నలుగురిలో చులకనవుతుంటారు. అందుకు ఉదాహరణ మాజీ కేంద్రమంత్రి పి.చిదంబరం.

ఆయన ఈ మధ్య చెన్నై విమానాశ్రయంలో కప్పు కాఫీకి 180 రూపాయలు చెల్లించాల్సివచ్చేసరికి బిగ్గరగా అరచి, నానా యాగీచేసి, ఆ అధిక ధర నరేంద్ర మోడీ పాలనమీదికి నెట్టే యత్నం చేశాడు.

ప్రజలు అంతకన్నా తెలివిమీరినవారు కదా! అందుకే 'అయ్యా చిదంబరంగారూ అధికారంలో ఉండగా మీరు సొంతడబ్బులతో కాఫీ తాగివుండరు. అందుకే ఆ ధరల గురించి తెలియదు.

కప్పు కాఫీ రూ. 180 వరకు యు.పి.ఎ. హయాంలోనే ఉంది' అనే అన్నారు. పైగా 'మీరు ధర విషయంలో ఫిర్యాదు చేస్తున్న కాఫీ కేఫేడే షాపులను మీ బంధువులే మలేషియాతోసహా పలుచోట్ల నిర్వహిస్తున్నారుకదా!' అంటూ వెంటాడారు సోషల్ మీడియాలో. ఏం చేసేది లేక చిదంబరం విమానం ఎక్కి వెళ్ళిపోయాడు. ◆

## ఓగ్గీ మోకాలడ్డు

రాబోయే ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ గెలుపుకు అవకాశాలు వున్న రాష్ట్రాలలో మధ్యప్రదేశ్ ఒకటి అన్నది పరిశీలకుల భావన.

పదిహేనేళ్ళ పాలనతర్వాత బి.జె.పి.కి వ్యతిరేకంగా ఓటు వెయ్యాలని ఓటర్లు అనుకుంటున్నారు. అటువంటిచోట కాంగ్రెస్ మరింత అప్రమత్తంగా వ్యవహరించి అధికారం సొంతం చేసుకోవాలి.

అయితే గెలుపుకన్నా సి.ఎమ్. అభ్యర్థిమీద దృష్టి పెడుతున్నారు కాంగ్రెస్ నేతలు. అక్కడ పార్టీలో యువనాయకుడు జ్యోతిరాదిత్య సింధియా, వృద్ధ నాయకుడు దిగ్విజయ్ సింగ్- ఇద్దరూ రాజవంశానికి చెందినవారు. అందువల్ల వారికి పడదు.

ఇప్పుడు జ్యోతిరాదిత్య సి.ఎమ్. అభ్యర్థి అయితే తనకు ఇబ్బంది అని వృద్ధనాయకుడు దిగ్విజయ్ సింగ్ సి.ఎమ్ అభ్యర్థిగా కమల్‌నాథ్‌కి తన మద్దతు అంటూ ప్రకటించాడు.

ఇది కాంగ్రెస్‌లో కలకలం రేపింది. అన్ని పార్టీలూ కలిసి పనిచేసి అధికారం చేపట్టాల్సిన సమయంలో రాష్ట్రంలో గ్రూప్‌లను ప్రోత్సహించే ఆలోచన డిగ్గీ రాజా చెయ్యటం ఢిల్లీ పెద్దలకు కొరుకుడుపడటం లేదు. ఎంతో దగ్గరికి వచ్చిన అధికారం పోతుందేమోనన్నది కాంగ్రెస్‌వారి భయం. ◆

## బి.జె.పి., సి.ఎమ్.ల కష్టాలు

మధ్యప్రదేశ్, ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రాలు రెండూ గత 15 సంవత్సరాలుగా బి.జె.పి. ప్రభుత్వాలు అధికారంలో ఉన్నాయి. ఆ 15 ఏళ్ళ కాలంలో 10 సంవత్సరాలు కేంద్రంలో యు.పి.ఎ. అధికారంలో ఉంది.

ఆ సమయంలో తమ రాష్ట్రంలో సి.ఎమ్.లు వ్యవసాయరంగాన్ని బాగా ముందుకు తీసుకువెళ్ళారు. ఎప్పుడైనా ఎక్కడైనా ఏదైనా ఇబ్బంది ఎదురయితే తప్పు తమది కాదని, కేంద్రంలో అధికారంలో ఉన్న కాంగ్రెస్ పార్టీదని ప్రకటించి తప్పుకునేవారు.

ప్రజలు నిజమేకాబోలు అనుకునేవారు. కాని ఇప్పుడు కేంద్రంలో, రాష్ట్రాలలో బి.జె.పి.దే అధికారం. తప్పు కేంద్రంమీద నెట్టేందుకు అవకాశం లేదు.

వ్యవసాయరంగానికి ఎంత చేసినా ఏదో ఒక సమస్య తలెత్తుతూనే వుంది. దానిని పరిష్కరించే బాధ్యత సి.ఎమ్.లదే. పైగా కేంద్రం అనుసరించే కొన్ని విధానాలు రాష్ట్రాలలోని రైతాంగానికి అనుకూలంగా లేవు. అయినా కేంద్రాన్ని, మోడీని ఏమీ అనలేరు.

గతంలో యు.పి.ఎ. ప్రభుత్వాన్ని రాజకీయంగా బెదిరించి బోలెడన్ని ప్రత్యేక లాభాలు పొందారు. ఆ అవకాశం పోయింది ఇప్పుడు. తమ తప్పులకు తామే బాధ్యత వహించాల్సి వుంది. ◆

## కొత్త పార్టీ భయం

కె.సి.ఆర్. పాలన స్వర్ణయుగం, జనమంతా ఉల్లాసంగా ఉన్నారు. సమస్యలే లేవు అంటూ కె.టి.ఆర్., మిగిలిన బంధుగణం బాకా బజాయిస్తున్నారు.

అయితే ఆ స్వడబ్బా వెనక 'కుటుంబ పాలన బృందం' మనసులో భయముందని అర్థమవుతోంది. అందుకే అధికార పార్టీవారు సమాజంలో అసమ్మతి బాణీని సహించలేకపోతున్నారు.

నిరసన దీక్షలకు, ఊరేగింపులకు, సమావేశాలకు దేనికీ అనుమతినివ్వటంలేదు. చివరికి కొత్త రాజకీయ పార్టీ పెడతామన్నా అనుమతినివ్వటంలేదు. అంతా అణచివేత ధోరణే.

తెలంగాణ ఉద్యమ సమయంలో జె.ఎ.సి. ఛైర్మన్‌గా చిరపరిచితుడైన కోదండరామ్ గొంతును ఎలాగైనా నొక్కివెయ్యాలన్నది కె.సి.ఆర్. ఎత్తుగడ.

అందుకే కోదండరామ్ ప్రతిపాదిత తెలంగాణ జనసమితి (టి.జె.ఎస్.) పార్టీ ఆవిర్భావ సభకు అనుమతినివ్వటం లేదు. ఆ సమావేశాన్ని ఎలాగైనా అణిచివేసి ముందుగా తమ టి.ఆర్.ఎస్. వార్షిక సమావేశం పెట్టి స్వడబ్బా మరింతగా బాధించాలన్న నిర్ణయం కె.సి.ఆర్. తీసుకున్నాడు. ◆

## మార్పులు తప్పవేమో

నరేంద్రమోడీ ప్రభుత్వ ఇమేజ్ మసకబారుతుందన్న ప్రచారం జరుగుతున్న వేళ కొత్త ఇమేజ్‌కోసం మంత్రివర్గ మార్పుల 'రూట్' పట్టే ఆలోచన సిద్ధమయింది. ఆర్థికమంత్రి అరుణ్‌జైట్లీ అనారోగ్యానికి గురై, కొన్ని నెలలపాటు ఆర్థికశాఖ బాధ్యతలు నిర్వహించలేని పరిస్థితి వచ్చింది.

దీనిని అవకాశంగా తీసుకుని ఆర్థికమంత్రి అరుణ్ జైట్లీని తొలగించాలని, అదే సమయంలో కొందరు ఇతర మంత్రులను, కొన్ని రాష్ట్రాల ముఖ్యమంత్రులను తొలగించి కొత్త 'టీమ్'తో ఎన్నికల్లోకి వెళ్ళాలన్న ఆలోచన స్థిరపడింది.

'ఇమేజ్'కి మరింత దెబ్బతగలకముందే దిద్దుబాట్లు చేయాలన్నది నరేంద్రమోడీ సలహాదారుల సూచన. అందుకే హడావుడిగా మార్పులకు తగిన ముహూర్తం వెతుకులాట మొదలైంది.

కర్ణాటక ఎన్నికల అడ్డంకులు తొలగిన వెంటనే మంత్రివర్గ మార్పులు తప్పవు. కేంద్ర మంత్రివర్గంలో స్థానం లేని రాష్ట్రాలు తెలుగు రాష్ట్రాలు. ఆ రెండు రాష్ట్రాలలోని బి.జె.పి. నేతలు తమలో ఎవరికి కేంద్ర మంత్రిపదవి దక్కుతుందోనన్న అంచనాల్లో ఉన్నారు. ఐతే ఆ పంపకాలు మోడీ ప్రభుత్వ ఇమేజ్‌ని పెంచుతాయా! ముంచుతాయా! అనేది ప్రశ్న. ◆

## కలిసిరావటంలేదు

కర్ణాటక ఎన్నికల ఫలితాలు రెండు జాతీయ పార్టీలకు కీలకం. 2019 ఎన్నికలముందు వచ్చిన ఈ ఎన్నికల్లో గెలిచి కొత్త ఉత్సాహం పొందాలని కాంగ్రెస్, కాంగ్రెస్ పార్టీని ఓడించి తమ సత్తా చూపాలని భారతీయ జనతా పార్టీ ఆశపడ్డాయి.

ఎన్నికల ప్రకటనకు ముందు ఆ రెండు పార్టీలకు అనుకూలంగా ఉంది వాతావరణం. కాని క్రమంగా సీన్ మారింది ప్రచారం పుంజుకునేసరికి. కర్ణాటకలోని ప్రాంతీయ పార్టీ జె.డి.ఎస్. బలపడింది.

85 ఏళ్ళ వయసులో కూడా ముందుండి ప్రచారం చేస్తున్నాడు మాజీ ప్రధాని దేవెగౌడ.

మరోవైపు లింగాయత్‌లు హిందువులు కాదని, వేరే మతమని ప్రకటించిన కాంగ్రెస్ పార్టీకి ఇబ్బందులు మొదలయ్యాయి. సమాజాన్ని చీల్చే ఆ నిర్ణయంపై మండిపడుతున్నది కన్నడ సమాజం.

ఇక బి.జె.పి.కి ప్రచారంలో ప్రతిసారీ ముందుండి నడిపించే నరేంద్రమోడీకి ఢిల్లీ రాజకీయాలలో ఎదురవుతున్న ఇబ్బందులవల్ల కర్ణాటకవైపు వచ్చేందుకు కుదరటంలేదు. ఇలా జాతీయ పార్టీలకు ఎందువల్లనో గాని కర్ణాటక ఎన్నికలు కలిసిరావటంలేదు.



## రాముని కోపం

దేవతలసభలో నిర్ణయింపబడిన దానికి అనుగుణంగా శ్రీహరి రాముని గా భూలోకంలో అవతరించి రావణుణ్ణి సంహరించదలిచాడు. ఒకరిని వధించాలంటే కావలసింది కోపం కదా! దేవతలకి అర్థంకాలేదు.

'రామునికి ఎలా ఎప్పుడు కోపం వస్తుందో? రాముణ్ణి విశ్వామిత్రుని వెంట పంపించారు. అంతటి భోగాలని అనుభవించిన రాముడు ముళ్ళమార్గం వెంట వెళ్తున్నా ఆయనకి కోపంరాలేదు. తాటక రక్తమాంసాలని చల్లుతూ ఉన్నా ఆయనకి కోపం రాలేదు.

దేవతలకి అర్థంకాలేదు. శూర్పణఖ సీతమ్మని మింగేస్తానంటూ వచ్చినప్పుడూ, జయంతుడనే కాకి సీతమ్మ వక్షఃస్థలమ్మీద గీరినప్పుడూ...రామునికి కోపం రావడం గమనించారు.

రాముడు బ్రహ్మాస్త్రాన్ని వేసేంతటి కోపం సీతమ్మకి ఏదైనా జరిగినప్పుడే అని గమనించారు. అదీ నిజమయిన భార్యారక్షణమంటే! ❐

# సత్యాన్వేషణ

## శంకర జయంతి

(తేది : 20.4.2018)

ఎంతటి సామాన్యుడికైన అర్థమయ్యే సామాన్య పదాలతో భజగోవిందశ్లోకాలని అందించారు శ్రీశంకరులు.

త్రేతలో రాముడూ, ద్వాపరంలో కృష్ణుడూ రాక్షసవధని చేసి లోకజనుల్ని ఉద్ధరిస్తే, శ్రీ శంకరులు జనుల్లో ఉన్న భ్రమలని తొలగించే నిజమయిన దైవ రూపాన్ని, స్తుతించే విధానాన్ని కూడా తెలియజేశారు.

పాలసముద్రాన్ని చిలికినవేళలో వచ్చిన హాలాహల విషాన్ని కంఠంలోనే ధరించి లోకానికి వెలుగునిచ్చే మానసిక సంతృప్తినిచ్చే చంద్రుణ్ణి తలమీద ధరించిన శంకరుణ్ణి స్తుతిస్తూ - నచ్చని విషయాన్ని కంఠంలోనే దాచుకోవాలనీ, అందరికీ ఉపయోగపడే వస్తువుని అందరికీ అందేలా చేయాలనీ చెప్పారు.

ఆకాశగమనశక్తి ఉండి కూడా నడకతోనే ఆసేతు శీతాచలాన్నీ తిరిగారు. బంగారువర్షాన్ని కురిపించగల్గే భిక్షాటననే చేశారు.అదీశంకరులవారంటే.❐

## శ్రీ శంకరాచార్య ప్రార్థన

శ్రుతి స్మృతి పురాణానా మాలయం
కరుణాలయమ్।
నమామి భగవత్పాద శంకరం లోకశంకరమ్ ॥

శ్రుతులూ స్మృతులూ పురాణాలూ అన్నీ కూడా ఎవరి కారణంగా స్థిరంగా నిలిచాయో, లోకంలోని జనులందరికీ సరైన మార్గమేదో దాన్ని చూపాలనే కరుణ కలిగినవారెవరో, భగవత్సమానులైన అలాటి శ్రీ శంకరాచార్యులవారికి హృదయపూర్వక నమస్కారములు. ❐

## రామానుజాచార్య జయంతి

(తేది : 21.4.2018)

తిరుమల ఆలయప్రాంగణంలో స్వామికి సమర్పించబడిన పూలని ఎప్పటికప్పుడు ధరింపజేసి తీసేస్తుంటారు. ఆ నిర్మాల్యాన్ని రంగదాసనే భక్తుడు ఓ బావిని తవ్వి దానిలో వేస్తూండేవాడు. కాలక్రమంలో 'రంగబావి'గా ప్రసిద్ధి పొందింది ఆ బావి.

స్వామి నిర్మాల్యాన్ని ఒట్టిగానూతిలో పడేయడం సరికాదంటూ రామానుజులు శ్రీదేవి, భూదేవి విగ్రహాలని బావిలో ప్రతిష్ఠింపజేశారు. నిత్య నైవేద్యాలూ ఉంటాయి ఇక్కడ.

విల్లిపుత్తూరులోని నారాయణునికి గోదాదేవి మాలని సమర్పించడం, బ్రహ్మోత్సవాలని చేయించడం, అది కూడా కొండపైన ఏర్పాటుచేయడం, యోగనారసింహుని ఆలయనిర్మాణం, వరాహస్వామిని దర్శించాకే తిరుమల ప్రభువుని దర్శించాలనే నియమాన్ని చేయడం, ఏ ఒక్కరూ భగవదనుగ్రహానికి దూరం కారాదనే ఉద్దేశ్యంతో

అష్టాక్షరీ మంత్రాన్ని ఆలయగోపురం ఎక్కి అందరికీ వినపడేలా ఉపదేశించడం వంటి సాహసోపేతమైన నిర్ణయాలు వీరి సొంతం. ❐

{ ఆత్మజ్ఞానమే ఉత్తమమైన జ్ఞానం. }

## విద్యారణ్య జయంతి

(తేది : 22.4.2018)

'పరసవేది' అనే ఒక మూలిక ఇనుముని బంగారంలా చేసేస్తుంది. ఐతే ఆ బంగారం మరో ఇనుప వస్తువుని బంగారంగా మార్చలేదు.

కాబట్టి శిష్యుణ్ణి ఉత్తమగురువుగా చేస్తూ, అతణ్ణి కూడా ఉత్తమశిష్యులని తేగల గురువుగా చేయాలనేది విద్యారణ్యస్వామి సంకల్పం.

విజయనగరసామ్రాజ్యాన్ని స్థాపించవలసిందని వ్యాసమహర్షి ఆజ్ఞచేయగా శ్రీచక్రం ఆకారంలో కోటని ఏర్పాటు చేసిన ఉత్తమ భాగవతులాయన. వీరి సోదరులే సాయనాచార్యులవారు.

వేదం ఎక్కడి మంత్రమైనాసరేవీరు తలుచుకున్నంతనే తన అర్థాన్ని తానే వివరించేదట. యోగిగా,సంగీత శిఖామణిగా, రాజనీతి ధురంధరునిగా వ్యాసానుగ్రహాన్ని పొందిన భక్తశిఖామణిగా వీరిని కీర్తిస్తుంది లోకం. ❐

## స్వాముల కర్తవ్యం

'మాకు ఫలానివారెవరో తెలియ'దని సామాన్యులెవరైనా అంటున్నారంటే ఆ దోషంలో భాగస్వామ్యం స్వాములకు కూడా ఉంటుందట.

నాలుగు నెలలపాటు (ఆషాఢ శుద్ధ ఏకాదశి నుండి కార్తికశుద్ధ ఏకాదశి) చాతుర్మాస్యదీక్ష చేస్తున్నకాలంలో పదిమంది తమ ప్రసంగాలకి వచ్చే తీరులోనూ, ఆకర్షణీయంగా ఉండేలాగా ప్రసంగిస్తూ హైందవభావాలనీ,

గురువులనీ, ప్రవక్తలనీ పండుగలను పదిమందికీ చెప్పవలసిన బాధ్యత వారికి కూడా ఉంటుందట. నిజానికి తాము నిత్యపూజని చేయవలసినవసరం లేనివారు అయినప్పటికీ మనకి 'ఇలా పూజించాలి సుమా!' అని చెప్పేందుకు పూజలని చేస్తుండాలిట.

# వేల వేల ప్రతికూల ఆలోచనలు




జీవితంలో ప్రతి ఒక్కరూ, ప్రతిరోజూ ఏదో ఒక ఒత్తిడికి గురవుతూనేవుంటారు. జీవిత పరుగులో ఇటువంటి ఒత్తిడులు వచ్చిపోతుంటాయి. అవి తాత్కాలికం. ఓ సమస్యో, ఇబ్బందో తలెత్తినప్పుడు ప్రతికూలత ఎదురైా, పరిష్కార మార్గంతో మాయమైపోతాయి. అయితే ప్రతికూల ఆలోచనలు ప్రతిక్షణం వేధిస్తుంటే కష్టం.

ప్రతికూల ఆలోచనలన్నవి అసహజం కాదు.కాని, జీవితంపై వాటి ఆధిక్యం పెరిగినప్పుడుమాత్రం ఇబ్బందులు తప్పవు. సంక్షేమాన్ని దెబ్బతీస్తాయి. శారీరకంగాను, మానసికంగాను కూడా ప్రభావితం చేస్తుంటాయి. మనం ఎక్కడున్నా, ఏం చేస్తున్నా రోజులో ఇరవైఐదువేలనుంచి యాభైవేలదాకా ఆలోచనలు వస్తుంటాయని అధ్యయనాల్లో గుర్తించారు.

ఈ ఆలోచనల సంఖ్య పెద్దది. పైగా వాటిలో ఎక్కువగా వుండేవి ప్రతికూల ఆలోచనలు. ఇన్ని వ్యతిరేక ఆలోచనలా? వాటి ప్రభావం ఎంత? అని విశ్లేషించుకుంటే 'అమ్మో' అనుకోక తప్పదు.

పరిస్థితులు లేదా సన్నివేశాలపట్ల సదరు వ్యక్తి ఏ విధంగా, ఏ దృక్పథంతో చూస్తున్నాడు, ఏ విధంగా ఆలోచిస్తున్నాడన్నదానిపై ప్రతికూలత ఆధారపడి వుంటుంది. ఫలితంగా సమస్య చిన్నదైనా, ఉన్నదానికంటే ఎక్కువగా కనపడుతుంది.

పరిస్థితులూ అలాగే పెద్దగా కనపడతాయి. ఇబ్బందికర ఆలోచనల్లో ఇరుక్కుపోతారు. వ్యతిరేక ఆలోచనలు పరిస్థితులకే పరిమితం కావు, తనను తాను తక్కువచేసి చూపుకోవడానికీ దారితీస్తాయి. తమకు తాము విలువలేని వ్యక్తులుగా అంచనాలు వేసుకుంటుంటారు. ఇటువంటి ఆలోచనలు అసంకల్పితంగానే ఒత్తిడికి గురిచేస్తాయి.

ఆత్మస్థైర్యాన్ని దెబ్బతీస్తాయి. ఆందోళన, ఫ్రస్టేషన్ తలెత్తుతాయి.వ్యతిరేక ఆలోచనలన్నవి పూర్తిగా నిర్మాణాత్మకరహితమైనవి, ఆరోగ్యంపై తీవ్ర ప్రభావాన్ని చూపుతాయి. జీవిత ప్రమాణాలను తగ్గిస్తాయి. ఒకసారి ప్రతికూల ఆలోచనల్లో మునిగిపోతే జీవితం దుర్భరంగా అనిపిస్తుంది.

## అడ్డుకట్ట వేయాలి

అది శారీరకంగానూ, మానసికంగానూ కూడా చిరాకుపెడుతుంది. పైగా ఆ విషయాన్ని గుర్తించలేకపోతారుకూడా. డిప్రెషన్‌లో ఒక ప్రధాన లక్షణం నిరాశావాదం. ప్రతికూల ఆలోచన అన్నది వాస్తవానికి డిప్రెషన్‌కు ఓ రూపంలాంటిది.

ఇటువంటి ఆలోచనాధోరణి ఒకసారి తలెత్తితే, దాన్ని నియంత్రించే పద్ధతి, కార్యాచరణ లేకపోతే అదలా పాతుకుపోతుంది.

ప్రతికూల ఆలోచనలు ప్రవర్తనా సంబంధిత లోపాలకు కూడా కారణం అవుతాయి. నిస్సత్తువ, నిరాశావాదం ఊపేస్తాయి. ఈ ఆలోచనలకు ప్రయత్నపూర్వకంగా అడ్డుకట్ట వేసి తీరాలి. అందుకు తమవంతు చర్యలు తప్పనిసరి.

## మూల కారణాన్ని గుర్తించాలి

మొట్టమొదట చేయాల్సిన పని ప్రతికూల ఆలోచనలను అర్థంచేసుకోవడం. దీనివలన ఇటువంటి ఆలోచనలకు దారితీసే పరిస్థితులను అర్థంచేసుకోవడానికి వీలవుతుంది. వాటికి ఓ రికార్డును మెయిన్‌టెయిన్‌చేస్తూ, నెమ్మదిగా బుర్రనుంచి తొలగించుకునే ప్రయత్నాలకు శ్రీకారంచుట్టడానికి ఇది తొలిమెట్టు.

ఈ ఆలోచనలు నాకు సంబంధించినవేనా? వ్యక్తిగతంగా తీసుకోవాలా? సదరు పరిస్థితికి ప్రతిస్పందించాలా? కాలం ఇచ్చే మార్పుకోసం ఎదురుచూడాలా? ఆరునెలల తరువాత ఇదే పరిస్థితి వుంటుందా? వంటి ప్రశ్నలను ఎవరికి వారే వేసుకుంటూ సమాధానాలు చెప్పుకోవాలి.

పరిస్థితిని పరిష్కరించుకోవాలంటే అందుకు తొలిమెట్టు ఆలోచనలను అర్థంచేసుకోవడం.

మూల కారణాన్ని గుర్తిస్తే, వాటిని సమూలంగా దూరం చేసుకునే వీలుంటుంది.




## అనుకూల దృక్పథం

ప్రతికూల ఆలోచనలను తక్షణమే పూర్తిగా తొలగించుకోవడం అనేది సాధ్యపడకపోవచ్చును.

అయితే ఈ ఆలోచనల స్థానంలో అనుకూలతలను జొప్పించే దిశగా కృషి సాగించవచ్చు.

సంక్షేమ భావాలు ఏర్పరచుకోవడానికి అనుకూల దృక్పథాన్ని తరచూ సాధనంగా ఉపయోగించుకుంటుండాలి. ఇటువంటి దృక్పథంతో కూడిన ఆలోచనలు, చర్యలు మంచి మూడ్‌ను ఇస్తాయి.అటువంటి మూడ్ ప్రతికూలభావాలను దూరం చేయగలదు.

వాకింగ్, పుస్తకం చదువుకోవడం, వినోదాత్మక సినిమాలు చూడడం, చిన్నచిన్న స్వీయ విజయాలకు ప్రశంసించుకోవడంవంటివి మనస్సును ఆనంద పరిచి, ప్రతికూల ఆలోచనలను తొలగిస్తాయి.

జీవితం అందించిన వరాలపట్ల సర్వదా కృతజ్ఞతలు తెలియజెప్పుకోవాలి.

## ధ్యానం

వ్యతిరేక ఆలోచనలను తొలగించుకోవడానికి ధ్యానం మంచి మార్గం.ఎప్పటికప్పుడు మారిపోతుండే కోతికొమ్మచ్చి ఆటలవంటి అస్థిమిత ఆలోచనలకు అందరం బాధితులమే.

యథేచ్ఛగా, కళ్ళెం లేనట్లు విహరించే ఆలోచనలను ఓ క్రమపద్ధతిలోకి, ప్రయోజనకరంగా మలుచుకోవడానికి ధ్యానం ఉపకరిస్తుంది.

అంతర్గత శాంతి సంతోషానికి ద్వారాలు తెరుస్తుంది. ఆలోచనల ప్రక్రియ స్థిమితంగా సాగి, మనస్సు ప్రతికూలతల నుంచి అనుకూలతలవైపునకు మళ్ళుతుంది.

## శక్తిస్థాయిలు

జీవితంలో ప్రతికూలత అనేది ఏదీ లేదు అన్న ఆశాభావం చెప్పలేనంత శక్తిని ఇస్తుంది.

ఇటువంటి శక్తి నిల్వలను వీలయినంతగా పెంచుకోవాలి. అనుకూల, ప్రతికూలతలు బంధువుల మాదిరి పెనవేసుకుంటాయి.

అయితే దైనందిన జీవితంలో మనను మానసికంగా, ఎమోషనల్‌గా అలసటకు గురిచేసేటువంటి పరిస్థితులను అయినా, వ్యక్తులను అయినా తప్పనిసరిగా దూరంగా వుంచాలి.

ఉప్పు నీటిలో కలుపుకుని స్నానం చేసినా లేదా చేతులను సాధారణ ఉప్పుతో రుద్దుకుని, కడిగేసుకున్నా శారీరక వ్యవస్థలోని అవాంఛిత శక్తి విడుదలయిపోతుంది.

ఆకుపచ్చ, పసుపు, ఆరెంజ్ రంగుల పదార్థాలు తినడంవలన శక్తిని పరిరక్షించుకోవచ్చు. ఈ శక్తి మరింత కాన్ఫిడెంట్‌గా ఉండేందుకు సహకరించి ఎమోషన్లను నియంత్రణలో ఉంచుతుంది.

మంచినీళ్ళు వీలయినంత ఎక్కువగా తాగడం వలన శారీరక విషతుల్యాలు వెలికి వెళ్ళిపోవడమే కాకుండా శక్తి టాక్సిన్లు కూడా వెళ్ళిపోతాయి.

## సామాజిక బంధాలు

అనవసర కారణాలతో ఎవరికివారు ఇతరులతో దూరంగా ఉండిపోతూ, ఒంటరితనాన్ని అనుభవించడమే కాకుండా ఒకరిపై ఒకరు వ్యతిరేకభావాలను పెంచుకుంటారు. ఇది ఎంతమాత్రమూ సమంజస ధోరణి కాదు. మనస్సులోని భావాలను నమ్మకం గల వ్యక్తులతో పంచుకోవాలి.

అది కుటుంబసభ్యులయినా కావచ్చు, స్నేహితులు, కొలీగ్స్ ఎవరయినా కావచ్చు. మనస్సులోని భావాలను అణచిపెట్టేయడంవలప్రతికూలత మరింత పెరిగి తీవ్ర ప్రభావం చూపుతుంది.

మరీ అవసరం అనుకున్నప్పుడు, ప్రతికూలతను ఎదుర్కోలేక సతమతం అవుతున్నప్పుడు మానసిక నిపుణులను కలిసి కౌన్సిలింగ్ తీసుకుంటే మరీ మంచిది.

కె.మనస్విని

సీరియల్

# మనిషిలో మనిషి

ముందు జీపులోంచి దూకి పరుగెత్తుకు వచ్చారు ఎ.ఎస్.పి., ఎస్.పి., ఎస్.ఐ.లు. వ్యాన్ వెనక డోర్ తెరిచారు. లోనకు ఎక్కి సాదూభాయ్ నిర్జీవ శరీరాన్ని చూశారు. అయినా ఆశ.

సంకెళ్ళు తీసేశారు. "హార్ట్ ఎటాక్ అనుకుంటాను. పోనివ్వండిరా. సాదూభాయ్ చావకూడదు. అర్జంటుగా హాస్పిటల్‌కు పోనీయండి" అనరిచాడు.

మరుక్షణం శరవేగంతో అక్కడ్నుంచి కదిలాయి పోలీస్ వాహనాలు.

ఆ రోజు హాస్పిటల్ వద్ద గొప్ప హైడ్రామానే చోటుచేసుకుంది. పోలీసులు తీసుకొచ్చిన సాదూభాయ్ బాడీని పరీక్షించిన డాక్టర్లు, పావుగంట క్రితమే అతను మరణించినట్టు ధృవీకరించారు.

ఆ వార్త వినగానే, పోలీసు వర్గాలకు కాళ్ళకింద భూమి కంపించినట్టైంది. తమ కస్టడీలో ఉండగానే నేరస్తుడు మరణిస్తే వచ్చే సమస్యలేమిటో పోలీసులకు బాగా తెలుసు. బ్లడీ సాదూభాయ్ పుటుక్కున చచ్చి, తమ పీకలమీదకి తెచ్చాడు. సాదూభాయ్ భార్య సుదీప బాగా చదువుకున్న యువతి. అందమైన రాక్షసిలా ఉంది.



E-mail: Suryadevaranovelist@gmail.com

సూర్యదేవర రామ్మోహనరావు

ఏమాత్రం అవకాశం చిక్కినా తమ అంతు చూడకుండా వదలదు. ఆ పరిస్థితి రాకుండా ఉండాలంటే ఏదోటి చేయక తప్పదు. పోలీస్ అధికారుల రిక్వెస్ట్ మీద సాదూభాయ్ శవాన్ని ఐసీలో ఉంచి చికిత్స చేస్తున్నట్టు హడావుడి ఆరంభించారు డాక్టర్లు.

ఈలోపల - కార్తికేయ బల్లి శరీరంలోకి పరకాయ ప్రవేశం చేశాక, పోలీస్ వ్యాన్‌లో ఉండిపోలేదు. వాహనాలు ఆస్పత్రి ఆవరణలో ఆగిన మరుక్షణమే వ్యాన్ లోంచి దూకి పరుగెత్తి మొక్కల వెనక నుంచి దూసుకెళ్ళి ఆస్పత్రి గోడ ఎక్కేసింది.

ఇక పోలీసుల నుంచి ఫోన్ రాగానే, సాదూభాయ్ భార్య సుదీప హతాశురాలయింది. ఒక ఎస్సై సుదీపతో మాట్లాడాడు. అతడు చెప్పింది విని కోపంతో మండిపడింది సుదీప. "నో... నా భర్తకు గుండెపోటు రావటం అబద్ధం మీ పోలీసులే దారిలో చిత్రహింసలు



## జరిగిన కథ (23)

పరకాయ ప్రవేశవిద్యను కార్తికేయకు నేర్పుతాడు మణిసిద్ధుడు. ఆ విద్యతో చచ్చిపడివున్న చిరుతపులి శరీరంలోకి ప్రవేశించి కిష్టప్ప నాయుడు, సాదూభాయ్,అతని మనుషులను వేటాడి చంపుతాడు కార్తికేయ.

ఆ తరువాత సాదూభాయ్ శరీరంలోకి ప్రవేశించి అతడి డ్రైవర్ దీనారామ్ సాయంతోఢిల్లీలో ఉన్న సాదూభాయ్ ఇంటికి వెళ్తాడు కార్తికేయ. అక్కడ సాదూభాయ్ భార్యగా చెప్పబడే సుదీప కార్తికేయను చూసి తన భర్తే అనుకుంటుంది. డ్రైవర్ దీనారాం సాయంతో ఆ ఇంట్లో ఎక్కడెక్కడ ఏముందో తెలుసుకుంటాడు.

సుదీప తన అందాలతో సాదూభాయ్‌ని కవ్విస్తుంది. ఆ రాత్రి ఆమెతో గడుపుతాడు కార్తికేయ. పోలీసులు సుదీప ఇంటికి వచ్చి సాదూభాయ్‌ని అరెస్ట్ చేస్తారు ఓ పాత కేసు నిమిత్తం సాక్ష్యాధారాలు దొరికేసరికి.

సాదూభాయ్ శరీరంలోవున్న కార్తికేయకు ఏం చేయాలో పాలుపోలేదు. పోలీసు వ్యాన్‌లో వెళ్తుండగా తప్పించుకొనేందుకై సాదూభాయ్ శరీరం వదిలి పరకాయ ప్రవేశవిద్యతో ఓ చచ్చిన బల్లి శరీరంలోకి ప్రవేశిస్తాడు కార్తికేయ. ఆ తర్వాత జరిగేది చదవండి.

పెట్టి చంపేసివుంటారు. రాయిలాంటి నా భర్తకు హార్ట్‌ఎటాక్ రావటం ఏమిటి? ఆయనకేమన్నా ఐతే వదలను. మీ అంతు చూస్తాను" అనరిచింది.

అప్పటికప్పుడు బయలుదేరి ఆస్పత్రికి చేరుకుంది. ఆమె వెనకే నలుగురు లాయర్లు కూడా వచ్చారు. ఎవరెంత గొడవచేసినా ఎవరినీ ఐసీయూలోకి అనుమతించలేదు.

హైరానాపడుతున్న డాక్టర్లు పరుగులు తీస్తున్న నర్సులతో హడావుడిగా ఉందక్కడ. కేవలం చలనంలేని సాదూభాయ్ బాడీని గ్లాస్ వెనక బయట నుంచి చూపించారంతే. తనను ఓదార్చాలని చూసిన ఎ.ఎస్.పి. మీద విరుచుకుపడింది సుదీప.

"మీరు మా ఇంటికొచ్చారు. నా భర్తతో మాట్లాడి వెళ్ళిపోతామన్నారు. చీట్ చేసి ఆయన్ని అరెస్ట్ చేశారు. సజీవంగా తిరిగి నా భర్తను నాకు అప్పగించాలి. లేదంటే చూడండి! ఐ విల్ సీ యువర్ ఎండ్!" అంటూ హెచ్చరించింది.

ఇంతలో ఎలా లీకయిందోగాని పోలీసులు తెచ్చేసరికే సాదూభాయ్ చనిపోయాడని, కేవలం శవానికి ట్రీట్‌మెంట్ చేస్తూ డాక్టర్లు హడావుడి చేస్తున్నారని గుసగుసలు ఆస్పత్రి ఆవరణలో షికారు చేయనారంభించాయి. ఈ వార్త చాలా ఆలస్యంగా సుదీప లాయర్ల చెవికి చేరింది.

వాళ్ళు సుదీపకు చెప్పనే చెప్పారు. దాంతో రెచ్చిపోయి పోలీసుల మీద అరవటం ఆరంభించింది సుదీప. ఆస్పత్రి వరండాలో అరుపులు, కేకలు చోటు చేసుకున్నాయి.

అప్పటికి విషయం తెలిసి సాదూభాయ్ మనుషులతోబాటు అతడి ఎక్స్‌పోర్ట్ అండ్‌ఇంపోర్ట్ కంపెనీకి చెందిన వందలాది ఉద్యోగులు ఆస్పత్రికి చేరుకుని ఉన్నారు. పోలీసులు ఆస్పత్రి వర్గాలమీద వాళ్ళంతా గొడవకు దిగారు.

పరిస్థితి ఉద్రిక్తంగా మారటంతో అదనపు పోలీసు బలగాల్ని రప్పించారు. సమస్యకు పరిష్కారం తెలీక పోలీసు ఉన్నతాధికారులు జుట్టు పీక్కుంటున్నారు. ఇదిలా ఉండగా - ఎలా చేరిందో గాంధీ ఆస్పత్రివద్ద గొడవ గురించిన వార్త మీడియా వర్గాలకు తెలిసిపోయింది. ఇక చెప్పాలా నిరంతరం వార్తల కోసం వెంపర్లాడే మీడియాకు గొప్ప ఇష్యూ చిక్కింది.

ఉరుకులు, పరుగులమీద ఆస్పత్రికి చేరుకుని లైవ్ టెలికాస్ట్ ఆరంభించారు. అంతవరకు కొందరికే తెలిసిన సాదూభాయ్ హార్ట్‌ఎటాక్ వ్యవహారంఇప్పుడు దేశమంతా కార్చిచ్చులా వ్యాపించింది.

దాంతో ప్రభుత్వ వర్గాలతోపాటు ప్రజలు కూడా టి.వి.లకు అతుక్కుపోయి ఆస్పత్రి వద్ద పరిస్థితిని వీక్షించసాగారు. ఇంతకీ సాదూభాయ్ బతుకుతాడా లేదాన్న మీమాంసతో ఉత్కంఠభరితులై చూస్తున్నారు. మీడియావాళ్ళు తిన్నగా ఉండరుగదా!

ఓ పక్క సుదీప కన్నీళ్ళతో చెప్పే మాటలు, ఆమె మాటల్ని సమర్థిస్తున్న డ్రైవరు దీనారాం. ఇంటి నౌకర్ల మాటలు, మరోపక్క పోలీసు అధికారుల సమర్థింపు



### స్మూత్‌గా సాగదు

వైఫల్యాలు విజయాల విలువను తెలియజేస్తాయన్నది నిలువెత్తు పాలరాతి బొమ్మ కృతీసనన్ అభిప్రాయం. 'జీవితంలో ఎత్తుపల్లాలు సహజమన్న వాస్తవిక దృక్పథాన్నిస్తాయి. జీవితం ఎప్పుడూ స్మూత్‌గానే వుండదు. అయితే, వ్యక్తిగతంగా విశ్వాసం ఉన్నంతవరకు, సరైన కారణాలతో పనులు చేస్తున్నప్పుడు మంచే జరుగుతుంది.

జయాపజయాలను సులువుగా మర్చిపోయి ముందుకు సాగుతుండాలి. ఈ ప్రక్రియలో ఏం నేర్చుకున్నామన్నది అత్యంత ముఖ్యం.

మనను కిందకు లాగేయడానికి మన చుట్టూ చాలామంది ఉంటుంటారు. నిరుత్సాహపరచడానికి ప్రయత్నిస్తూనేవుంటారు. వీటన్నింటినీ ఫిల్టర్ చేసుకుంటూ ముందుకు వెళ్ళిపోతుండాలి' అంటూ సుదీర్ఘంగా చెప్పుకొచ్చింది కృతి.

మాటలు, ఆస్పత్రి డాక్టర్ల ట్రీట్‌మెంట్ మాటలు ఇలా మార్చి మార్చి చూపిస్తున్నారు.

ఇందులో ఎవరి మాటలు నమ్మాలో, ఎవరి మాటలు నమ్మకూడదో తెలీక టీ.వీ. ప్రేక్షకులు మరింత ఉత్కంఠభరితులు కాసాగారు.

ఈ గందరగోళం మధ్య ఎట్టకేలకు సాయంత్రం నాలుగు గంటలకు సాదూభాయ్ మరణించినట్టు ఆస్పత్రివర్గాలు ప్రకటించాయి.

"సారీ మేడమ్! మా ప్రయత్నం మేం చేశాం. ప్రయోజనం లేకపోయింది. హీ ఈజ్ డెడ్... రేపు పోస్ట్‌మార్టం తర్వాత మీరు బాడీని తీసుకెళ్ళొచ్చు" అంటున్న డాక్టర్ని కోపంతో చెంప పగలగొట్టింది సుదీప.

కళ్ళలో నిప్పులు కురిపిస్తూ "ఇప్పుడొచ్చి చెప్తావేంట్రా. ఆయన ఎప్పుడో పోయాడు. పోలీసుల చేతిలోనే పోయాడు. వాళ్ళే చంపేసి, మీకు అప్పగించారు. శవానికి ట్రీట్‌మెంట్ చేస్తున్నారని బయట నవ్వుకుంటున్నారు.

వినపడ్డం లేదా? శవాలతో వ్యాపారం చేస్తార్రా! నా భర్త నాక్కావాలి. తీసుకురండి. లేదంటే మీ అందర్నీ చంపేస్తాను" అంటూ మతి తప్పినట్టు దుఃఖం, కోపం మిళితమైన గొంతుతో అరుస్తుంటే డాక్టర్లను, సుదీప నుంచి దూరంగా తీసుకుపోయారు పోలీసులు. సాదూభాయ్ మరణవార్త తెలీగానే, సాదూభాయ్ మనుషులు కోపంతో రెచ్చిపోయి దాడికి దిగారు.

ఆస్పత్రి ఫర్నిచర్‌ని ధ్వంసం చేశారు.

పోలీసులు వాళ్ళని బయటికి తరిమారు.

"నా భర్త చనిపోయాడు గదా. నాకు ఆయన డెత్ సర్టిఫికెట్ కావాలి. ఇప్పుడే, ఇక్కడే" అంటూ మరోసారి గొడవకు దిగి పట్టుబట్టింది సుదీప. పోస్ట్‌మార్టం తర్వాత ఇస్తామని ఎవరెంతచెప్పినా శాంతించలేదు.

"ఏమో! రేపు ఆయన శవాన్ని మాయంచేసి మాకేం తెలీదంటే నాకు దారేముందని.

ఇవ్వాలి, ఇచ్చితీరాల్సిందే. లేదంటే ఇక్కడే ప్రాణత్యాగం చేస్తాను" అంటూ మొండికేసింది.

ఎందుకొచ్చిన గొడవ, వదిలితే చాలనుకున్నారు పోలీసులు. వాళ్ళ రిక్వెస్ట్‌తో రూల్స్ పక్కనపెట్టిఅప్పటికప్పుడు సాదూభాయ్ డెత్ సర్టిఫికెట్ తయారుచేసి, జిరాక్స్‌లు తీసి సుదీపతోపాటు, పోలీసులక్కూడా ఇచ్చేసి చేతులు దులుపుకున్నారు డాక్టర్లు.

సుదీప ఏ ఉద్దేశంతో డెత్ సర్టిఫికెట్ అడిగిందో గాని, రేపు ఇదో కొత్త ఇష్యూ అవుతుందని, తమ జుట్టు సర్టిఫికెట్‌తోబాటు, సుదీప చేతిలోపెట్టేశామని పాపం ఆస్పత్రి డాక్టర్లకు ఆ క్షణంలో తెలీదు.

కనుచీకటి పడుతూండగా సాదూభాయ్ శవాన్ని మార్చురీకి తరలించారు. అంతవరకు గొడవపడిన వాళ్ళంతా ఇళ్ళకు తిరుగుముఖం పట్టారు.

టి.వి. న్యూస్‌లో మాత్రం సాదూభాయ్‌కి సంబంధించిన నేరచరిత్ర, ఆస్పత్రి వద్ద కవరేజ్ మొత్తం చిలువలు పలువలతో అనేక కథనాలుగా ప్రసారమవుతూనే ఉంది. అయితే సుదీప ఆరోపిస్తున్నట్టు సాదూభాయ్ పోలీసుల చిత్రహింసలకు చనిపోయాడా లేక నిజంగానే గుండెపోటుతో మరణించాడా అనేది మిలియన్ డాలర్స్ ప్రశ్నగా మిగిలిపోయింది.

రాత్రి తొమ్మిది గంటల సమయం.

ఆస్పత్రి, శవాలనుంచే మార్చురీ బిల్డింగ్ ప్రశాంతంగా ఉంది. లాకర్ బాక్స్‌లు శవాలతో ఫిలప్ అయిపోవటంతో ఖాళీలేక అయిదు శవాలు అక్కడే ముసుగులు కప్పి స్ట్రెచర్‌మీద పడున్నాయి. అందులో ఒక శవం స్మగ్లర్, మాఫియాడాన్ సాదూభాయ్‌ది. ఎ.సి. ఫుల్‌గా ఉంచడంతో చలిగా ఉందక్కడ.

చాలాసేపటికి అక్కడ గోడమీద చేరి తోక అటూ ఇటూ తిప్పుతూ అవకాశం కోసం ఎదురు చూస్తోంది పెద్ద బల్లి. కార్తికేయ పరకాయప్రవేశం చేసిన బల్లి అదే. ఆస్పత్రి చాలా పెద్దది.

మార్చురీ వద్ద నైట్ డ్యూటీలో ఇద్దరు సెంట్రీలు కాపలా ఉంటారు. ఎంతో గుండెనిబ్బరం ధైర్యం ఉన్నవాళ్ళు గాని శవాలకు కాపలా ఉండలేరు.

ఈరోజు కూడా ఇద్దరు కాపలా ఉన్నారు.

రాత్రి తొమ్మిదిగంటల తర్వాతగాని కార్తికేయ ఎదురుచూసిన అవకాశం రాలేదు. నైట్ డ్యూటీ సెంట్రీలు ఇద్దరూ డోర్ సమీపంలోని టేబుల్ వెనక కూచుని, కబుర్లు చెప్పుకుంటూ మందుకొట్టి బిర్యానీ తినే పనిలో పడ్డారు.

సరిగ్గా ఆ టైమ్ చూసి బల్లి శరీరంలోంచి తిరిగి సాదూభాయ్ శరీరంలోకి పరకాయ ప్రవేశం చేశాడు కార్తికేయ. ఎప్పుడైతే కార్తికేయ తప్పుకున్నాడో మరుక్షణం గోడపైనుంచి నిర్జీవంగా దబ్బున కిందపడింది చచ్చిన బల్లి.

ఆ చప్పుడుకే ఒక సెంట్రీ ఉలికిపడి "ఓర్నాయనో! ఆ చప్పుడేందిరా?" అనడిగాడు రెండోవాడ్ని.

వాడి కంగారుచూసి ఫక్కున నవ్వాడు మొదట సెంట్రీ. "ఓరి పిరికి సన్నాసి. ఈమాత్రానికే దయ్యమని ఝడుసుకున్నావా ఏందిరా ఎదవా! అట్టాచూడు చచ్చి కిందపడింది బల్లి" అంటూ వెనక్కి తిరిగి బల్లిని చూపించాడు.

"ఎందుకు చచ్చిందంటావ్?" రెండోవాడి ప్రశ్న.

"ఏమో. ఎల్లి అడిగొచ్చి రేపు చెప్తాలే. అనుమానం సన్నాసి. నేనిక్కడుండగా ఏ దయ్యాలూ, భూతాలు ఇటురావుగాని గ్లాసు ఖాళీచేసి బిర్యానిపొట్లాలువిప్పు" అంటూ కసురుకున్నాడు మొదటి సెంట్రీ. ఈలోపల కార్తికేయ పరకాయ ప్రవేశం చేయగానే సాదూభాయ్ మృతదేహం గుండె తిరిగి కొట్టుకోవటం ఆరంభించింది.

ఆగిపోయిన ఊపిరితిత్తులు తిరిగి గాలి పోసుకోవడం ఆరంభించాయి. నరాల వెంట రక్తప్రసరణ పునరుద్ధరించబడింది. కొద్దిసేపట్లోనే ఒంట్లో వేడిపుట్టి అవయవాల్లో చలనం కలి

మా దేశాన్ని నడిపించుకునే సామర్థ్యం మాకుంది... మేమేం చెయ్యాలో బయటి దేశాలవారు చెప్పాల్సిన పని లేదు.

-సచిన్ టెండూల్కర్, ఎమ్.పి.



గింది. నెమ్మదిగా ముసుగు తొలగించి చూశాడు.

సెంట్రీలిద్దరూ అటు గోడకు తిరిగి కూర్చుని బిర్యానీ తింటున్నారు. శవాన్ని కప్పిన తెల్ల దుప్పటి పక్కన పడేసి చప్పుడు కాకుండా స్ట్రెచర్ దిగాడు.

పిల్లిలా అడుగులో అడుగువేస్తూ డోర్‌వైపు కదిలాడు. డోర్ దాటుతుండగా టేబుల్ మీద ఒక గళ్ళ టవలు మనీపర్సు కనిపించాయి.

తన జేబులో వేలెట్‌తో సహా అన్నీ తీసి సుదీపకు అందజేశారు పోలీసులు. తనకిప్పుడు కొంప చేరుకునే వరకు డబ్బు అవసరం ఉంది.

పర్సుతోబాటు టవలు తీసుకుని బయటికొచ్చేశాడు. వరండా చివరివరకూ నీడలా నిశ్శబ్దంగా కదిలాడు. పర్సు జేబులో వేసుకుని ముఖం తెలీకుండా టవల్ చుట్టుకుని, వేగంగా చెట్ల వెనక చీకట్లలోకి పరుగెత్తాడు.

అటు నుంచి అటే, ఆస్పత్రి గోడదూకి అవతలి వీధిలోకి చేరుకున్నాడు. అప్పటిగ్గాని మనసు కుదుటపడలేదు. తెల్లవారితే ఏమవుతుందో తనకు తెలుసు. మార్చురీనుంచి మాయమైన సాదూభాయ్ శవంకోసం అటు పోలీసులు,ఇటు ఆస్పత్రి వర్గాలు జుట్టు పీక్కుంటాయి. ఈలోపల సుదీప వాళ్ళను ఓ ఆటఆడిస్తుంది. తలచుకుంటేనే నవ్వొస్తోంది కార్తికేయకు.

టీవీవార్తల పుణ్యమాని ప్రజలు తన బాడీని చూసేశారు. వీధిలో తనను చూసి ఎవరన్నా గుర్తుపడితే వ్యూహం బెడిసికొట్టే ప్రమాదం ఉంది.

తెల్లవారేలోపలే తను ఢిల్లీ విడిచిపెట్టాలి. ఆలోచిస్తూ కొంతదూరం నడిచాడు సాదూభాయ్. ఎదురైన ఒక ఖాళీ ఆటోఆపి ఎక్కి కూచున్నాడు.ఇరవైనిమిషాల ప్రయాణం తర్వాత ఆటో తమ వీధి మొగలో కొచ్చి ఆగింది. పర్సులోంచి డబ్బు తీసిచ్చి ఆటోని పంపించేశాడు. పర్సుని పక్కనే డ్రైనేజీలో పారేసి, వడివడిగా సుదీప నిలయం చేరుకున్నాడు.

అప్పటికి రాత్రి పదిగంటలు కావస్తోంది సమయం. లోన పట్టపగల్లా లైట్లు వెలుగుతున్నాయి. సుదీప దుఃఖంతో మెలుకువగానే ఉండివుంటుంది.

శవం మాయమైన సంగతి సెంట్రీలు గమనించక పోవచ్చు. మందుకొట్టి పడుకుంటారుగాబట్టి ఉదయంగాని చూడరు. ఒకవేళ ఇప్పుడే గమనించినా వెదుకులాడుతూంటారుగాని తమ ఇంటివరకూ ఎవరూ రారు. అయినప్పటికీ తను ఎంత త్వరగా బయలుదేరితే అంత మంచిది.

ఆలోచిస్తూనే గేటులోకి తిరిగాడు.

అక్కడ కాపలావున్న నలుగురు దృఢకాయుల్లో ఇద్దరు సడెన్‌గా సాదూభాయ్‌ని చూసి దయ్యమనుకుని భయంతో తెలివితప్పి పడిపోయారు.

ఇద్దరు మాత్రం నమ్మలేనట్టు చూస్తున్నారు.

"యూ ఫూల్స్! భయపడి చావకండిరా.నేను చావలేదు బ్రతికే ఉన్నాను. జాగ్రత్త.ఈ సంగతి ఎవరికీ తెలీకూడదు. గేటు మూసి తాళం వేయండి. ఆ వెధవలిద్దర్నీ కూడా లేపి లోనకురండి" అంటూ హెచ్చరించి వడివడిగా పోర్టికోవైపు నడిచాడు.

సాదూభాయ్ వాక్కు పనివాళ్ళకు వేదవాక్కు. తమ బాస్ బతికే ఉన్నాడని తెలీటంతో వాళ్ళకి ఉత్సాహం వచ్చేసింది. వెంటనే తెలివితప్పిన వాళ్ళని కూడా లేపి పరుగెత్తుకొచ్చారు.

డ్రైవరు దీనారాం పోర్టికోలోనే ఉన్నాడు. పెద్దపెద్ద అంగలతో నడిచివచ్చిన సాదూభాయ్‌ని గుర్తించి కొయ్యబారిపోయాడు. ఇదెలా సాధ్యం! చచ్చినవాడు బ్రతికిరావటం ఏమిటి?తను చూస్తోంది కలా,నిజమా? భయంతో వణికిపోయాడు.

సాదూభాయ్ ఎవరినీ పట్టించుకోలేదు.

నేరుగా లోనకు నడిచాడు.

హాల్లో శోకదేవతలా కూచుని దుఃఖిస్తోంది సుదీప. పనికత్తెలు నలుగురు పక్కనే కూచుని ఆమెను ఓదారుస్తున్నారు. నౌకర్లు దూరంగా నిలబడి బాధగాచూస్తున్నారు. అందరిలో విషాదం గూడుకట్టుకునుంది.

ఆ పరిస్థితిలో సడెన్‌గా లోనకొస్తున్న సాదూభాయ్‌ని చూసి అదిరిపడ్డారంతా.

ఒకరిద్దరు తెలివి తప్పి పడిపోయారు. సుదీప తన కళ్ళను నమ్మలేక చివ్వున లేచి నిలబడింది.

"ఇక ఏడ్చింది చాలు. భయపడకండి. నేను బతికే ఉన్నాను" అంటూ సుదీపను సమీపించాడు సాదూభాయ్. అంతే దుఃఖం, ఆనందం, ఆశ్చర్యం అన్నీ






## హిందీ సినిమానే లక్ష్యం

ఇప్పటిదాకా ఐదు మలయాళ చిత్రాల్లో నటించిన మాళవిక మోహనన్ హిందీ చిత్రాల్లో నటించాలన్న తన కలను నెరవేర్చుకున్నది. ఆమె తొలి హిందీచిత్రం విడుదలకు రెడీ అయిపోయింది. కేరళకు చెందిన మాళవిక ముంబయిలోనే పుట్టి పెరిగింది.

"ఇక నుంచి నేను హిందీ చిత్రాలే చేస్తాను. కొంత విరామం తర్వాతే మలయాళం సినిమాల వైపు చూస్తాను. హిందీ సినిమాలు చేయాలన్నది నా కల. కాబట్టి మళ్ళీ వెనక్కు వెళ్ళను. హిందీ చిత్రపరిశ్రమలోనే నా శక్తిని ఒడ్డి కృషిచేస్తా.

నిజానికి దక్షిణాది తారగా నన్ను పిలిపించుకోవడం ఇష్టంలేదు. నా లక్ష్యం ఎప్పుడూ బాలీవుడ్‌పైనే ఉంది. నేనిక్కడే పెరిగాను కాబట్టి, ఇక్కడి సినిమాలతోనే ఎక్కువ కనెక్ట్ అయ్యా" అంటోంది.

మరి బాలీవుడ్ వద్దంటేనో...?



## ప్రతిభకే పట్టం

క్యాస్టింగ్ కౌచ్ గురించి ఈ మధ్య అందరూ పదేపదే మాట్లాడడాన్ని వయ్యారిభామ రకుల్‌ప్రీత్ సింగ్‌ను కదిలిస్తే, తనకు ఇంతవరకు అటువంటి అనుభవాలు ఎదురవలేదని చెప్పింది.

"అయినా ఓ అమ్మాయి ఏదైనా చేస్తుందని, పిలిచిన చోటకు వస్తుందని ఎవరైనా కోట్లు కోట్లు ఖర్చు పెట్టి సినిమా తీస్తారా? ఓ అమ్మాయి ఏ పని అయినా సులువుగా చేస్తుందని ఆమెతో ఎవ్వరూ సినిమా తియ్యరు. సరైన అవకాశాలు రావడానికి సమయం పట్టినా, ఇక్కడ రాణించాలంటే కావాల్సింది ప్రతిభ. చిత్రపరిశ్రమలోకి రావాలనుకునే అమ్మాయిలకు నేనిచ్చే సలహా ఇదే.

ఎవరి ప్రతిభను వారు నమ్ముకోవాలి మినహా ఇతరత్రా విషయాలవైపునకు దృష్టిసారించకూడదు" అంటూ నవ్వుల వెలుగుపూలు విరజిమ్మింది.

ఉక్కిరిబిక్కిరి చేస్తూండగా అమాంతం మీద వాలి కౌగిలించుకొని ఏడుస్తూ తెలివితప్పింది సుదీప. ఆమెను ఒడిలో కూచోబెట్టుకుని చాలాసేపు సపర్యలు చేశాకగాని స్పృహలోకి రాలేదు సుదీప.

"ఓ మైగాడ్! సాదూ డియర్... నువ్వేనా... నిజంగా నువ్వేనా... థాంక్‌గాడ్. నువ్వు బతికే ఉన్నావ్. చాలు... కాని... కాని ఇదెలా సాధ్యం? డాక్టర్లు నీ డెత్ సర్టిఫికెట్ కూడా ఇష్యూ చేసేశారు" జరిగిందానికి ఉక్కిరిబిక్కిరవుతూనే ఆశ్చర్యంగా అడిగింది సుదీప.

"డోన్ట్‌వర్రీ డాళింగ్. నీ ప్రేమలో తడిసి ముద్దయిన నేను నిన్నొదిలి ఎలా పోగలను. చచ్చినట్టు నటించాను తప్పించుకోడానికి అంతే. అదో కళ. నీకు చెప్పినా అర్థం కాదు లీవిట్. కాని ఇంతటితో అయిపోలేదు. మార్చురీలో శవం మాయంగావటంతో పోలీసులు మళ్ళీ వచ్చే ప్రమాదం ఉంది.

ఈలోపలే నేను వెళ్ళిపోవాలి. నువ్వు కూడా భోంచేసి ఉండవు. ఆకలిగా ఉంది. భోజనం ఏర్పాట్లు చూడు. నేను స్నానం చేసి మార్చురీ కంపు వదిలించుకొస్తాను" అంటూ చకచకా మెట్లెక్కి బెడ్‌రూమ్‌కి వెళ్ళిపోయాడు.

సాదూభాయ్ బ్రతికొచ్చాడంటే... అదీ మరణించిన సుమారు పదిగంటల తర్వాత... సుదీపకే కాదు, ఎవరికీ నమ్మ బుద్ధిగావటంలేదు.

కాని కళ్ళముందు మనిషి కన్పిస్తూంటే నమ్మకుండా ఉండేదెలా? సుదీపకు చాలా ఆనందంగా ఉంది. అదే సమయంలో పరిస్థితి కూడా అర్థమైంది. తన భర్త తిరిగి ఇంటికొచ్చి వెళ్ళిన సంగతి ఎవరికీ బయట తెలీకూడదు.

ప్రాణంపోయినా ఎవరికీ చెప్పమని పనివాళ్ళందరి చేతా మాట తీసుకుంది.అంతేకాదు ఆయన క్షేమంగా బయటికెళ్ళిపోతే తలో లక్ష డబ్బిస్తానంటూ మాట కూడా ఇచ్చింది. అది చాలు. ఇక పనివాళ్ళ నోటికి తాళం పడిపోయినట్టే.

సాదూభాయ్ స్నానంచేసి, బట్టలు మార్చుకుని రెడీ అయ్యాడు. వస్తూన ఎవరూ తనను గుర్తుపట్ట కూడదని మెడకు మెడసొప్పి పట్టీ తగిలించుకున్నాడు. మంకీ క్యాప్ తలకు తొడిగాడు. మఫ్లర్ మెడకు చుట్టుకున్నాడు. అంతలో సుదీప వచ్చింది. వస్తూనే అతడ్ని బిగియార కౌగిలించుకుని ముద్దులిచ్చింది.

"ఏమిటి మనకీ కష్టాలు?" అంటూ వెక్కివెక్కి ఏడ్చింది. లాలనగా ఆమెను ఓదార్చాడు-

"చూడు! ఇలాంటప్పుడే గుండె రాయి చేసుకోవాలి. తప్పదు. ఇప్పుడు నేను చెప్పే మాటలు జాగ్రత్తగా విను. నువ్వు నా ప్రాణమని నీకు తెలుసు.

ఎక్కడున్నా నీ గురించే ఆలోచిస్తూంటాను. నీ సుఖసంతోషాలే కోరతాను. అనవసర టెన్షన్స్‌తో నువ్వు నా గురించి బెంగపెట్టుకోవద్దు.

ఇవాళగాకుంటే రేపు, నేను తప్పించుకున్నట్టు పోలీసులకు తెలీక మానదు. ఇండియాలో అడుగు పెడితే నన్ను అరెస్ట్ చేస్తారు. అందుచేత కొంతకాలం నేను బయటే ఉంటాను. నా ఫోన్‌కోసం కూడా నువ్వు ఎదురుచూడొద్దు. అర్థమైందా?" అన్నాడు.

"అలాగే" అన్నట్టు తలూపింది సుదీప.

"మరో ముఖ్యవిషయం. నేను చేస్తున్న ఇల్లీగల్ బిజినెస్‌లు నువ్వు చేయలేవు. వాటిని క్లోజ్ చేసేసి మాఫియా మనుషుల్ని వదిలించుకో.

కేవలం ఎక్స్‌పోర్ట్ అండ్ ఇంపోర్ట్ బిజినెస్ మాత్రం చూసుకో. నువ్వు నిశ్చింతగా బతకటానికి అదొక్కటే చాలు. నీపేర బ్యాంకులో కోట్లకు కోట్లు డబ్బు ఉంచాను. హ్యాపీగా బ్రతికెయ్. అంతేకాదు... నాపేరు మీదున్న సుమారు పదివేల కోట్ల ఆస్తులు, బ్యాంక్ ఎకౌంట్స్ అన్నీ నీకు ట్రాన్స్‌ఫర్ చేశాను.

నాకోసం ఒక సంవత్సరం చూడు. రాలేదంటే నేనీ లోకంలో లేనని అర్థం. నీ వయసును, సొగసును వృధా చేసుకోకుండా తగినవాడ్ని చూసి పెళ్ళి చేసుకో. నీ సుఖసంతోషాలే నాకు ముఖ్యం..." సాదూభాయ్ అప్పగింతలు చెప్పినట్టు గబగబా చెప్తూంటే, అతడి మాటల్ని అడ్డుకుంది సుదీప.

"లేదు సాదూ డియర్. అలా చెప్పకు. నీకోసం ఎదురుచూస్తూనే ఉంటాను జీవితాంతం. నువ్వు తిరిగిరావాలి, నాకోసం" అంటూ కన్నీళ్ళతో అర్థించింది. నవ్వాడు సాదూభాయ్.

"నేను తిరిగివచ్చినా నువ్వు నన్ను గుర్తుపట్టలేవు. డోన్ట్‌వర్రీ! రావటానికి ట్రై చేస్తాను. మరో ముఖ్య విషయం ఏమంటే ఆస్పత్రిలో శవం కనబడక పెద్ద గోలవుతుంది. పోస్ట్‌మార్టం చేసి శవాన్ని రేపు అప్పగిస్తానన్నారుగా. అది జరగని పని.

నా డెత్‌సర్టిఫికెట్ ఇచ్చి ఆస్పత్రివాళ్ళు తమ పిలక నీ చేతిలో పెట్టేశారు. రచ్చ రచ్చ చేసెయ్. మన లాయర్లను సంప్రదించి ఆస్పత్రిమీద, పోలీసువర్గాల మీద పదికోట్లకు నష్టపరిహారం కేసు వెయ్యి. ఎంత రచ్చ జరగాలంటే ఆ గోలకి ఎవరికీ నేను బతికానేమో నన్న సందేహమే రాకూడదు. మీడియాను వాడుకో. ప్రజల సానుభూతి నీవైపు ఉండేలా చూసుకో..." అన్నాడు సాధూబాయ్.

ఇంకా ఉంది



Courtesy : FEMINA

# శ్రద్ధాకపూర్

ఎప్పటికప్పుడు కొత్త సినిమాలతో కెరీర్‌ను పరుగులు పెట్టిస్తున్నది శ్రద్ధాకపూర్. నాలుగు పెద్ద బ్యానర్ చిత్రాలిప్పుడు చేతిలో వున్నాయి.

షెడ్యూల్స్‌నడుమ కుటుంబసభ్యులతో ఎంజాయ్ చేస్తూ సాగిపోతున్నది. జాగ్రత్తగా కెరీర్ పావులు కదుపుకుంటున్నది. సైనా నెహ్వాల్ బయోపిక్ కోసం కసరత్తులు సరేసరి. రాజ్‌కుమార్ రావ్‌తో హారర్ కామెడీ స్త్రీ సెట్స్‌తో బిజీ.

ఆమె వ్యక్తిగత అభిప్రాయాల్లోకి వెళ్తే...

▸ **నా తదుపరి చిత్రం :** షాహిద్ కపూర్‌తో 'బట్టి గుల్ మీటర్ చాలు

▸ **రాజ్‌కుమార్‌రావ్‌తో పని:** అద్భుతంగా వుంది

▸ **నా కొత్త సినిమా సబ్జెక్టు :** సమకాలీన స్థితికి అద్దం పడుతుంది. ఉత్తరాఖండ్‌కు సంబంధించి సామాజిక సందేశాన్నిస్తుంది

▸ **నా ప్రధాన లక్ష్యం :** కొన్ని మరపురాని చిత్రాల్లో భాగం కావాలన్నది. కొన్ని ఎమోషన్లతో ప్రేక్షకులను స్పందింపజేయాలి, అలరించాలి

▸ **ప్రతి కొత్త సినిమాకోసం :** నా ప్రయత్నాన్ని,కష్టాన్ని రెండింతలు చేయడానికి సిద్ధంగా వుంటుంటా

▸ **నేను ఇప్పటికే పరిశ్రమలో:** నాకంటూ ఓ స్థానాన్ని సృష్టించుకున్నానని తెలుసు. నా అభిమానులు నన్ను ప్రశంసలతో ముంచెత్తుతున్నారు.

అయితే నేను వీటినికాపాడుకోగలగాలి. అందుకు మరింతగా శ్రమించాలి

▸ **నా కలల సాకారంలో :** కొత్తలో సవాళ్ళను ఎదుర్కొన్నాను. చిత్రపరిశ్రమలో ప్రభావవంతమైన వ్యక్తులతో కాని, నేను సామాజిక అనుబంధాలను పెంచుకునే విషయంలో వీక్.

నా గూటిలో నేను నివసించే రకాన్ని. అలా వుంటేనే నాకు ప్రశాంతంగా వుంటుంది. ఇది నన్ను ఏమాత్రం ప్రభావితం చెయ్యదని సేఫ్‌గా చెప్పగలను

▸ **యువతరానికి నేనిచ్చే సలహా :** వ్యక్తిగతాన్ని దృష్టిలో వుంచుకోవడం ముఖ్యం.

స్వంత అభిప్రాయాలు, ఆలోచనల మేరకు జీవితాన్ని సాగిస్తుండాలి. లక్ష్యం నెరవేరాలంటే స్వంత నిబంధనలు పెట్టుకోవడం తప్పనిసరి

▸ **నేను పాటించే సూత్రం :** కళ్ళు నక్షత్రాలపై వుండాలి. కాని కాళ్ళు భూమిపైనే ఉండాలన్న రూజ్‌వెల్ట్ సూత్రాన్ని పాటిస్తా

▸ **పరిశ్రమ వదిలేయాల్సివస్తే :** నిస్సందేహంగా పాటలు పాడుకుంటాను

# ఆరోగ్యం

పీచు, శక్తితో నిండివుండే పండ్లు ఆరోగ్య పూరితమైన చిరుతిండి, సమతులాహారంలో పండ్లు అత్యవసరంకాగా, వాటిలో వందరకాలుంటాయి.

కొన్ని అత్యధిక పోషకాలతో నిండివుండి, ఎక్కువ ప్రయోజనకరంగా ఉంటాయి.

ఇంకొన్ని ప్రత్యేక ట్రీట్స్‌కోసం ఉద్దేశించివుంటాయి. వేటిని తినాలో ఎంచుకోవడం కష్టంగా ఉంటుంది.

ఆరోగ్యపూరితమయిన కొన్ని పండ్ల జాబితా తెలుసుకుంటే ఎంపిక చేసుకోవడం సులువుగా ఉంటుంది. ఆహారంలో వీటిలో ఏవోకవాటిని క్రమం తప్పకుండా భాగం చేసుకున్నట్లయితే పూర్తిస్థాయి ఆరోగ్యం బావుంటుంది.



## రాస్ప్‌బెర్రీలు

అద్భుతమైన రుచి మాత్రమేకాదు - పోషకాలు పుష్కలంగా లభిస్తాయి.

సెలీనియం, పీచు, మాంగనీస్, సి, కె విటమిన్లు లభిస్తూ, జలుబు నుంచి పరిరక్షిస్తాయి.

రాస్ప్ బెర్రీలు రోగనిరోధకవ్యవస్థను బలోపేతం చేస్తాయి. చర్మ ఆరోగ్యాన్ని, జీవక్రియను మెరుగు పరుస్తుంటాయి. శరీరానికి సరైన హైడ్రేషన్ లభించనప్పుడు ఓ గుప్పెడు రాస్ప్‌బెర్రీలు తింటే ఇట్టే గుణం కనపడుతుంది.

## కివీ

ఇవి కూడా ఆరోగ్యపూరితమైన పండ్ల జాబితాలోనివే. పీచుకు, పొటాషియంకు, ఎ,సి,ఇ విటమిన్లకు చక్కని ఆధారం. వీటిలో యాంటీఆక్సిడెంట్స్ అత్యధికంగా ఉంటాయి. అంతర్గత ఆరోగ్యాన్ని మెరుగు పరుస్తూ, ఆ ఫలితాన్ని బాహ్యారూపంలో ప్రదర్శిస్తాయి. గుండె ఆరోగ్యానికి వీటిలోని పొటాషియం ఉపకరిస్తుంది. అంతేకాక రక్తపోటును నియంత్రణలో ఉంచుతుంది.

వర్కవుట్‌కు ముందు ఒక్క ముక్క తిన్నా క్యాలరీలను ఖర్చుచేయడంలో బాగా ఉపకరిస్తుంది.



## గుమ్మడి

వీటిని కూరగాయగా పరిగణిస్తారు కానీ, నిజానికి గుమ్మడి పండ్ల జాబితాలోనిది.

కెరోటినాయిడ్స్‌కు గుమ్మడి మంచి ఆధారం. క్యాన్సర్‌కణాలు పెరగకుండా పోరాడేగుణం గుమ్మడిలో ఉంటుంది. వీటిలోని రసాయనాలు విటమిన్ 'ఎ'గా మారి కళ్ళకు, చర్మానికి, కార్డియో వాస్క్యులర్ పనితీరుకు ఉపకరిస్తాయి.

## అవకాడోలు :

పొటాషియం సమృద్ధిగా లభిస్తుంది. ఫోలిక్ యాసిడ్, కెరోటినాయిడ్లు, విటమిన్ 'బి', 'ఇ' లభిస్తాయి. ఇవి అన్నీ చర్మానికి, శిరోజాలకు ప్రయోజనకరమైనవి. వీటిలో యాంటీ-ఇన్‌ఫ్లమేటరీ గుణాలు ఉంటాయి. ఒత్తిడిని తగ్గిస్తాయి.

అనుకూల జీర్ణక్రియ గుణాలు కలిగివుంటాయి. వీటిలోని ఫోలిక్ యాసిడ్ మహిళలకు మేలయినది. అవకాడోలు ఋతుక్రమంలో వచ్చేటువంటి క్రాంప్స్‌ను తగ్గిస్తాయి. కడుపులోని పిండం ఎదుగుదలలో ఇవి ప్రముఖపాత్ర వహిస్తాయి.

## దానిమ్మ

దానిమ్మలో యాంటీ ఆక్సిడెంట్స్, ఫోలేట్, విటమిన్ 'సి' లభిస్తాయి. కొలెస్ట్రాల్‌ను అదుపులో వుంచి,

గుండెజబ్బుల రిస్కు తగ్గిస్తుంది. సున్నితమైన ఉదరం గలవారికి లేదా జీర్ణక్రియ సజావుగా లేనివారికి దానిమ్మగింజలు మంచి ఆహారం.

తాజా దానిమ్మరసం రోజూ క్రమంతప్పకుండా ఓ గ్లాసు తాగితే ఎంతో ప్రయోజనకరంగా ఉంటుంది. అయితే ఈ దానిమ్మ గింజల్ని యథాతథంగా తినడంవల్ల పీచు ఎక్కువగా లభిస్తుంది.



## బ్లాక్ బెర్రీ

ఇవి నల్లగా వుంటాయి కాబట్టి వీటికి ఈ పేరు వచ్చింది. గుండెకు, చర్మానికి ప్రయోజనకరమైనవి. పీచు సమృద్ధిగా వుండే బ్లాక్‌బెర్రీలలో విటమిన్ 'సి' యాంతోస్యానిన్ లభిస్తాయి.

కళ్ళ ఆరోగ్యాన్ని, రోగనిరోధకవ్యవస్థను పటిష్టపరుస్తాయి. ఇందులో యాంటీ ఇన్‌ఫ్లమేటరీ గుణాలు ఎక్కువగా ఉంటాయి.



## క్రాన్ బెర్రీలు

ఇది తప్పనిసరిగా తినాల్సిన పండు. ఇందులో యాంటీ ఆక్సిడెంట్, సిట్రిక్ యాసిడ్ అధికంగా ఉంటాయి. క్రమంతప్పకుండా క్రాన్‌బెర్రీలు తింటుంటే కిడ్నీల పనితీరు బావుంటుంది.

దంతాలు, గుండె ఆరోగ్యంగా ఉంటాయి. వీటిలో యాంటీ-బ్యాక్టీరియల్ గుణాలు ఎక్కువగా ఉంటాయి కాబట్టి ఇన్‌ఫెక్షన్లు ముఖ్యంగా యూరినరీ ట్రాక్ ఇన్‌ఫెక్షన్ల చికిత్సలో బాగా పనిచేశాయి.

## చెర్రీలు

కేక్స్ వంటి బేకింగ్‌పదార్థాల్లో ఎక్కువగా వాడే పండు. చెర్రీలలో పొటాషియం, మెలటోనిన్, విటమిన్ 'సి' లభిస్తాయి.

యాంటీ-ఇన్‌ఫ్లమేటరీ గుణాలూ వుంటాయి. అధికరక్తపోటుగల వారికి, నిద్రలేమి, ఆర్థ్రైటిస్ గలవారికి ఇవి మంచి ఆహారం.

## యాపిల్

రోజుకో యాపిల్ తినడంవల్ల వైద్యునికి దూరంగా వుండవచ్చునన్న నానుడి ఏనాటి నుంచో ఉంది. వీటిలో డైటరీ పీచు అత్యధికంగా ఉంటుంది. విటమిన్ 'ఎ', 'సి', ఐరన్, క్యాల్షియం లభిస్తాయి.

గుండె, శ్వాససంబంధిత సమస్యలు గలవారికి ఉపకరించడమే కాకుండా, క్రమంతప్పకుండా యాపిల్స్ తినేవారి కొలెస్టరాల్ నియంత్రణలో ఉంటుంది. శరీరంలోని కణాలకు వీటిలోని యాంటీ - ఆక్సిడెంట్స్ పరిరక్షణ ఇస్తాయి.

కె.అనూరాధ

Courtesy : You & I

## పోలికలు వద్దు

తోటి పిల్లలు పరీక్షలు బాగా రాసినా, వారికి ఎక్కువ మార్కులు వచ్చినా పిల్లలు ఫీలయిపోతుంటారు. దీనిని ఈర్ష్య అనో, అసూయ అనో అనకూడదు. పిల్లల్లో ఉండే సహజ నైజం ఇది.

ఇందుకు కొంతమంది తల్లిదండ్రులు కూడా కారణం అవుతుంటారు.

ఎన్నోసార్లు తమ పిల్లల్ని ఇతర పిల్లలతో పోల్చుతుంటారు. పెద్దలు ఇలా పోల్చి మాట్లాడడంవలన పిల్లలూ అదేవిధంగా పోల్చుకోవడాన్ని అటుంచి, ఆత్మన్యూనతకు గురవుతారు. ఈ పోలికలు, పోటీతత్వం కేవలం ఒక్క పరీక్షలకే పరిమితం కాక మిగతా జీవితంపైనా పడుతుంది.

పిల్లలు ఎదిగేకొద్దీ అది అసూయ ధోరణిగానూ మారుతుంది. పిల్లల మానసిక ఎదుగుదల సక్రమంగా సాగాలంటే ఇటువంటి పోలికలు వద్దు.



## అతిపెద్ద అడవి

అమెజాన్ వర్షపు అరణ్యం ప్రపంచంలోకెల్లా పెద్దదని విన్నాంకాని నిజానికి అది ప్రపంచంలోని ఏకైక పెద్ద అరణ్యం కాదు. అటువంటి అరణ్యం రష్యావద్ద ఆర్కిటిక్ సర్కిల్ అనే ప్రదేశంలో ఉంది. ఆ ప్రదేశమంతా కోనిఫర్ అనే చెట్లతో కూడిన అడవులతో నిండి వుంటుంది.దాదాపు పదకొండు వందల మిలియన్ హెక్టార్ల ప్రాంతం ఆ చెట్లతో నిండివుంటుంది. ఈ వైశాల్యం మొత్తం యూరప్‌కంటే పెద్దది.

ప్రపంచంలోని అడవుల్లో నాల్గోవంతు అడవులు అక్కడేఉన్నాయి.ఎంతో పెద్దదైన అమెజాన్ వర్షపు అరణ్యం ఈ అడవిలో మూడోభాగంమాత్రమే.

## శక్తివంతమైన కీటకం

ప్రపంచంలో అత్యంత శక్తివంతమైన కీటకం ఏమిటో తెలుసా?

పేడపురుగు- శక్తిలో తొలిస్థానంలో ఉంటుంది. మనుషులేదైనా బరువు మోయాల్సివస్తే, తమ బరువులోసగం కంటే కొంచెం మోయగల్గుతారు.

అదే పేడ పురుగు తనకంటే వెయ్యిరెట్లకుపైగా ఎక్కువ బరువును మోయగలదు అంటే నమ్మశక్యంగా లేకున్నా నిజం. పేడపురుగు శక్తిపై పరిశోధకులు సైతం ప్రయోగాలుచేసి మరీ గుర్తించారు. వెయ్యికి మించి 1100 రెట్లకుపైగా మోసినట్లు పరిశోధనల్లో తెలుసుకున్నారు. ప్రపంచ వ్యాప్తంగా పేడపురుగులు 500 మిలియన్ల జాతులు వున్నాయి.

## వయస్సుకు తగినట్లు

పన్నెండు, పదమూడేళ్ళ వయసుకు వచ్చేసరికి పిల్లల్లో చాలా మార్పులు వస్తాయి. వాళ్ళలో కలిగే శారీరక, మానసికపరమయిన మార్పులలో భాగంగా నిద్రపట్టకపోవడం ఒకటి.

కాని ఈ వయస్సు పిల్లలకు నిద్ర చాలా అవసరం. చాలినంత నిద్ర పోకపోతే ఇతర సమస్యలు అనేకం తలెత్తుతాయి. ముఖ్యంగా జ్ఞాపకశక్తి తగ్గుతుంది. ఈ వయస్సు పిల్లలు కంటి నిండా నిద్రపోవడంవలన జ్ఞాపకశక్తి పెరుగుతుంది.నిద్ర బాగా తగ్గితే డిప్రెషన్, యాంగ్జైటీవంటి మానసిక సమస్యలకు గురవుతారు కూడా.

నిద్రకు సిద్ధంకావడానికి ముందు టీవీలో ఉద్వేగపరమైన సన్నివేశాల్ని చూడనివ్వకూడదు. కంప్యూటర్, వీడియో గేమ్స్, మొబైల్స్, ల్యాప్‌టాప్‌లు అందుబాటులో ఉంచకూడదు. అలాగే కాఫీ, కూల్‌డ్రింక్స్ తాగనివ్వకూడదు.

పడుకునేముందు గోరువెచ్చని పాలు ఇస్తే ఫలితం కనపడుతుంది.ఇతరత్రా భయాలున్నాయేమో నిశితంగా పరిశీలించి పరిష్కరించాలి.

## పిల్లలకు పోషకాలు

స్కూలుకు హడావిడిగా పరిగెత్తే రోజుల్లో పిల్లల ఆహారంపట్ల పూర్తి శ్రద్ధ చూపడానికి ఒక్కోసారి వీలవదు. సెలవుల్లో పిజ్జాలు, బర్గర్లు, ఐస్‌క్రీమ్‌లు అంటూ హడావిడి చేస్తుంటారు.

అవి ఆరోగ్యానికి హానికరం అని చెప్పినా అర్థంచేసుకునే వయస్సు,ఓపిక వారికి వుండవు. ఈ సీజన్‌లో వారి ఆహారంపట్ల అత్యంత శ్రద్ధ తీసుకోవడం అవసరం. ఫ్లేవర్డ్ మిల్క్, మ్యాంగోవంటి పండ్లతో మిల్క్ షేక్‌లు వీలయినంతగా ఇస్తూవుండాలి.

వారు అడిగే పిజ్జాలు, శాండ్‌విచ్‌లలో పనీర్, తాజా కూరగాయలు, ఛీజ్ వంటివాటిని నింపి ఇవ్వాలి.

ఐస్‌క్రీమ్‌లకోసం అల్లరిచేస్తే ఇంట్లో ఫ్రూట్ పుడ్డింగ్స్, కస్టర్డ్‌లు వంటివి చల్లగా పెట్టొచ్చు. శీతల పానీయాల స్థానంలో పండ్లరసాలివ్వాలి.

## బొమ్మల పజిల్

ఈ బొమ్మలోని వ్యక్తుల వృత్తులను అనుసరించి వారు ధరించాల్సిన టోపీలను గురించండి.




## మంటల్నెలా ఆర్పుతారు?

అగ్నిమాపకదళంవారు మంటల్ని ఏ విధంగా అదుపు చేస్తారు? బాగా నీళ్ళు జల్లేసి మంటల్ని ఆర్పుతారని సాధారణంగా భావిస్తాం. కాని, అన్నింటినీ నీటితోనే ఆర్పరు.

మంట స్వభావాన్నిబట్టి ఆర్పడానికి రకరకాల పదార్థాలు వాడతారు. కాలే వస్తువు వేడిని తగ్గించడం, మండేందుకు కావాల్సిన ఇంధనాన్ని అందకుండా చేయడం, ఆక్సిజన్ అందకుండా చేయడంవంటి చర్యలు చేపడతారు.

కార్బన్ డయాక్సైడ్ సిలిండర్‌ను మంటలు తీవ్రంగా ఉన్నప్పుడు ఉపయోగిస్తారు. దీనివల్ల మంటకు ఆక్సిజన్ అందదు. అలాగే నూనెవల్ల చెలరేగే మంటల్ని నీటితో ఆర్పరు. దీనికి ఫోమ్ డ్రై కెమికల్ పౌడర్ వాడతారు. నూనె మంటల్ని ఆర్పడానికి నీరుజల్లితే బరువువల్ల నీరు అడుగుకుచేరి నూనె పైకి తేలి మంటలు ఆరవు.

# ఆకాశానికి గుంజలు



ఒక ఊళ్ళో భీమన్న అనేవాడు ఒకడు ఉండేవాడు. వాడికి లోకజ్ఞానం బొత్తిగా లేదు. వాడికి పెళ్ళామూ, పిల్లా ఏమీలేదు. కూలిపని చేసి బతుకుతూ ఉండేవాడు. వాడికి బుద్ధిబలం శూన్యమైనా కండబలం ఉండేది.

ఊళ్ళోవాళ్ళు వాణ్ణి ఒట్టి అమాయకుడి కింద జమకట్టేవాళ్ళు. ఒక రాత్రి భీమన్న తిండి తిని, వెన్నెట్లో మంచం వేసుకుని, వెల్లకిలా పడుకుని ఆకాశం కేసి చూశాడు. అకస్మాత్తుగా వాడికొక భయంకరమైన ఊహ తట్టింది.

"ఆకాశం, ప్రపంచానికి దేవుడు వేసిన పందిరి అంటారు గదా! ఎంత చిన్న పందిరికన్నా నాలుగు



గుంజలుంటాయిగదా! ఇంత పెద్ద ఆకాశానికి ఒక్క గుంజైనా లేదే! విరిగిపడితే ఇంకేమైనా ఉందా!"

భీమన్న భయంతో లేచి కూర్చున్నాడు. ఆకాశం విరిగి మీదపడితే తన ప్రాణాలు పోతాయన్న భయం వాణ్ణి బాగా పట్టుకున్నది. ఎవరితోనన్నా చెప్పుకుందామన్నా అందరూ నిద్రపోతున్నారు.

భీమన్న పరిగెత్తుకుంటూ పోయి ఊరి బయట ఉన్న ఊడలమర్రి కింద కూర్చున్నాడు. ఆకాశం పడితే చెట్టుకొమ్మలు అడ్డి, తన ప్రాణాలు కాపాడతాయని వాడి ఉద్దేశ్యం. ఆ రాత్రంతా వాడు ఆ చెట్టు కిందనే జాగారం చేశాడు.

తెల్లవారింది. భీమన్న ఊళ్ళోకి తిరిగివచ్చి, కనిపించిన ప్రతివాడితోనూ, "చిన్న పందిరికే నాలుగు గుంజలుంటే, ఇంత పెద్ద ఆకాశానికి ఎన్ని గుంజలుండాలి? ఒక్కటీలేదే! అది మీద పడితే మనమంతా చచ్చిపోమా? మనమంతా ఆకాశం లేనిచోటికి పోదాం!" అన్నాడు.

"వీడికేదో పిచ్చి పట్టింది!" అని అందరూ నవ్వుకున్నారు. కొందరు, "పోరా పిచ్చికుంకా!" అంటూ మందలించారు. అంతేకాని, భీమన్న మాటలను ఒక్కరూ లక్ష్యపెట్టలేదు. "వీళ్ళే పిచ్చికుంకలు. బతికే యోగ్యతలేక వాళ్ళు నామాట వినకుండా ఉన్నారు. ఒకరితో నాకెందుకు? నేను ఆకాశం లేని చోటుకు పోయి హాయిగా బతుకుతాను" అనుకుని భీమన్న ఆ ఊరి నుంచి బయలుదేరాడు.

ఊరు దాటినాక అడవి వచ్చింది. అడవి దారిన ఒకరూ, ఇద్దరూ భీమన్నకు ఎదురయ్యారు. ఉండబట్టలేక భీమన్న తన భయాన్ని ఒక మనిషికి చెప్పుకున్నాడు.

ఆ మనిషి, "నీకేమన్నా మతిపోయిందా ఏమిటి? ఆకాశానికి గుంజలేమిటి?" అంటూ ముందుకు సాగిపోయాడు.

ఇంత చిన్నవిషయాన్ని కూడా ఎవరూ అర్థం చేసుకోనందుకు చిరాకుపడుతూ భీమన్న ముందుకు సాగాడు.

ఎంతదూరం నడిచినా అడవి తరగటం లేదు. ఎక్కడా ఊరు తగలలేదు. భీమన్న ఒకచోట ఆగి తల ఎత్తి చూస్తే, చెట్లమీదుగా ఆకాశం కనిపించింది. ఆకాశం లేనిచోటు చేరాలంటే ఇంకా నడవాలిలాగున్నది.

చీకటిపడేదాకా నడిచి భీమన్న, ఆ రాత్రి గడపటానికి పెద్ద చెట్టుకిందికి వచ్చాడు, ఆకాశం పడినా చెట్టుకొమ్మలు తన ప్రాణాలను కాపాడతాయనుకుని. ఆ చెట్టుకింద ఒక మనిషి కళ్ళు మూసుకుని కూర్చుని



ఉండి, భీమన్న వచ్చిన అలికిడికి కళ్ళు తెరిచి, అతడి కేసి చూశాడు. ఆయన ఒక యోగి.

భీమన్న ఆయనను చూడగానే "మీరు కూడా ఆకాశం పడుతుందనేనా, ఇంతదూరం వచ్చి ఈ చెట్టుకింద చేరారు? భలే!" అన్నాడు. వాడు పిచ్చివాడని గ్రహించి యోగి చిరునవ్వునవ్వుతూ, "ఆకాశం పడటమేమిటి?" అని అడిగాడు.

"చిన్న పందిరికే నాలుగు గుంజలుంటాయి గదా! ఇంత పెద్ద ఆకాశం గుంజలు లేకుండా ఎంతకాలం పడకుండా ఉంటుందీ?" అన్నాడు భీమన్న.

"అదా నీ అనుమానం? ఆకాశానికి గుంజలు లేకపోవటమేమిటి, నాయనా? ఉన్నాయి! వాటి సంగతి తెల్లవారినాక చెబుతాను. ఈ రాత్రికి పడుకుని నిద్రపో" అన్నాడు యోగి. యోగి మాట నమ్మి భీమన్న ఆ రాత్రి నిశ్చింతగా నిద్రపోయాడు.

తెల్లవారింది. భీమన్న లేవగానే యోగి, "నాయనా, ఆకాశానికి గుంజలు లేవని కదూ, నీ అనుమానం? అది తీరే పద్ధతి నీకు చెబుతాను. ఇటుగా వెళ్ళావంటే ఒక గ్రామం వస్తుంది. ఆ గ్రామంలో ప్రతి ఇంటికీ వెళ్ళి, ఇంట్లోవాళ్ళను నోటికి వచ్చినట్టు తిట్టి, బిచ్చం పెట్టించుకుని తిరిగి రా!" అన్నాడు.

భీమన్న ఆయన చెప్పిన మార్గాన వెళ్ళి, ఊరు చేరుకుని ఒక్కొక్క ఇంటిముందూ ఆగి, ఇంట్లో వాళ్ళను తిడుతూ బిచ్చం పెట్టమని అడగసాగాడు. అందరూ వాణ్ణి కొట్టబోయినవాళ్ళేగాని, ఒక్కరూ బిచ్చం పెట్టలేదు.

తనకు బిచ్చం దొరకదని వాడు నిరాశ చెందుతూ మరొక ఇంటిముందుకువెళ్ళి, బిచ్చం వెయ్యమని అరిచాడు. లోపలి నుంచి జవాబు లేదు.

భీమన్న తిట్లు ప్రారంభించాడు.

ఇంతలో ఒక స్త్రీ దోసిట్లో బియ్యం తీసుకుని పరిగెత్తుకుంటూ వచ్చి, "ఆలస్యమయింది నాయనా! ఆకలితో అలమటించే వాడివి తిట్టావంటే తిట్టవూ?" అంటూ బియ్యం భీమన్న ఒడిలో పోసి, లోపలికి తిరిగి వెళ్ళింది. భీమన్న అమితంగా ఆశ్చర్యపడిపోయాడు. వాడు అరణ్యంలోకి తిరిగి వెళ్ళి, యోగితో జరిగినదంతా చెప్పాడు.

యోగి నవ్వి "చూశావా? నువ్వు తిట్టినా ఆ మహా ఇల్లాలు కోపం తెచ్చుకోకుండా నీకు బిచ్చం పెట్టింది. అటువంటివాళ్ళు నూటికీ, కోటికీ ఒకరున్నా చాలు. వాళ్ళే ఆకాశానికిగుంజలు. పందిరికి నాలుగేగుంజలు, కాని ఆకాశానికి ఇలాంటి గుంజలు ఎన్నో ఉన్నాయి. అందుకే ఆకాశం పడిపోదు" అన్నాడు. భీమన్నకు ఆయన మాటలు అర్థమయ్యాయి.

తన భయాన్ని తీర్చిన ఆ యోగికి సాష్టాంగపడి నమస్కారం చేసి, ఆయనకు శుశ్రూషలు చేస్తూ, భీమన్న ఆ అరణ్యంలోనే ఉండిపోయాడు.

పి.జ్ఞానప్రసూన



# నిదురలో ఎంతో హాయి!




## సమ్మెట ఉమాదేవి

నిద్ర రానివాళ్ళకు అసలు రాకపోవచ్చు. దానికి సవాలక్ష కారణాలు ఉండొచ్చు. కడుపులోకి ఇంత తిండి పడకపోతే ససేమిరా రెప్పవాలదు. రేపటి బతుకు ఎలాసాగుతుందో తెలియనిబెంగఉంటే నిద్ర రాదు.పిల్లలకుచదువో, పెద్దలకువైద్యమో అందించ లేని దౌర్భాగ్యం ఉన్నా కునుకు వచ్చిచావదు.

కూటికి కునుకుకి గొప్ప లింకుంది. కునుకుకు, కుదురైన జీవితానికీ లింకుంది. ఇలా కడుపులో ఒక ముద్ద పడిందంటే చాలు... అలా సీన్ అయిపోగానే తెరపడ్డట్లుగా చాలామందికి కనురెప్పల తెరలు పడి పోతాయి. బొజ్జనిండిందంటే చాలు ఇక బజ్జుందాము అనిపిస్తుంటుంది. అనిపించడమే కాదు మనకు తెలియకుండానే కూర్చున్న కుర్చీల్లోనో, ప్రయాణం చేస్తున్న కార్లోనో, బస్‌లోనో... ఇలా ఎక్కడంటేఅక్కడ కన్నులనిండా కునుకు కులుకుతుంటుంది.

నిదుర ముదిరేవేళ రాజయినా బంటయినా ఒకటే కదా. ఇక మనలనేదో ఉద్ధరిస్తారని ఎంతో ఆశపడి గెలిపిస్తే మాత్రం మన నాయకులు నిద్ర పోకుండా ఉంటారా? అదియున్ అనేక పనుల్లో అలసిసొలసి చట్టసభల్లో కూచున్నాక, పవళించకుండా ఎలా ఉంటారు?

గెలిపించినవాళ్ళే ఈ సంగతి అర్థం చేసుకోవాలికదా... పాపం ఒక్కొక్కరికి ఒక్కో వ్యాపారాత్మక వ్యాపకం. రియల్ ఎస్టేట్లు, హోటళ్ళు, సినిమా నిర్మాణాలు షాపింగ్ కాంప్లెక్స్‌లు, సినిమా థియేటర్లు... ఇన్ని చూసుకుంటూ సమావేశాలకు హాజరవ్వటమే మహా గొప్ప!

ఇక శాసనసభకివచ్చాక చల్లనిగాలీ, మెత్తని సింహాసనాలు, హాయిగా ప్రసంగాలు... ఇలాంటి ఏర్పాట్ల మధ్య నిద్రరాకుండా ఆపడం ఎవరితరం చెప్పండి? అందరి సమస్యలను వారు అర్థం చేసుకోవాలి కానీ, వారి ఇబ్బందిని ఎవరూ అర్థం చేసుకోపోతే ఎలా? సదరు శాసనసభసభ్యులు, సహాయమంత్రి మన మస్తాన్‌రావు ఆలోచనలు కునుకుతీయటానికి ముందుఇలాపరిపరివిధాలుగా చక్రభ్రమిస్తున్నాయి.

ఆయనొక ప్రజాప్రతినిధికంటే ముందు ఆయన బోలెడు వ్యాపారాలు, వ్యవహారాలు నడిపి, గత ఎన్నికల్లో ఏకాయెకీన అసెంబ్లీకి ఎన్నికైపోయాడు.

వ్యాపార లావాదేవీలు, సెటిల్‌మెంట్లు వ్యవహారాల్లో ఒక్కక్షణంకూడా వృథాచేయడు. రోజుకు 18 గంటలు నిద్రపోకుండా, నిద్రపోనీకుండా పనిచేసేరకం.

అసెంబ్లీకి వస్తే తాను చేయటానికి పనేలేనట్టు మనసంతా తేలికైపోయినట్టు భావిస్తుంటాడు. అందుకే ఇలా ఆసీనుడవ్వడమే ఆలస్యంసీన్‌మారిపోయి, కళ్ళమీదికి కునుకు ఇట్టే వచ్చి వాలిపోతుంటుంది. 'అయినా చట్టసభల్లో ఒక్కొక్కరు మైకాసురుల్లా గంటలు గంటలు మాట్లాడుతుంటే ఎంతసేపనివింటారు? అసలే ఏసీ... ఆపైన కదలకుండా కూర్చోవడం. అటుపైన నిండయిన విగ్రహానికి ఇక నిద్ర ముంచుకురమ్మంటే ఎందుకు రాదు?



బ్యాంక్ రుణాలు ఎగ్గొట్టే కొందరివల్ల అధిక సంఖ్యలో నిజాయితీపరులు ఇబ్బందిపడుతున్నారు.

-రామనాథ్ కోవింద్, రాష్ట్రపతి

ఆ పాటికే ఏదో పెద్ద నేరం చేసేసినట్లు ఈ విలేకరులు ఆ కెమెరాలు ఎక్కడ పెట్టి తీస్తారోగాని 'పట్టపగలే చట్టసభల్లో నిద్రిస్తున్న నాయకులు' అంటూ పేపర్లలోనూ, ఛానెళ్ళలోనూ వార్తలు గుప్పిస్తారు.

ఇక వాట్సాప్‌లు, ఫేస్‌బుక్‌లూ వచ్చాక... ఇక ఎన్నెన్ని వీడియోక్లిప్పులూ, ఫార్వార్డ్‌మెసేజ్‌లూ నెట్‌నిండా అలలు అలలుగా అంతటా ప్రవహిస్తున్నాయి. మరీ వాడెవడో గాని గుడిమెట్ల దగ్గర పడుకున్న కుక్కలను, అసెంబ్లీలో పడుకున్న ఎమ్మెల్యేలను పక్కపక్కన పెట్టి వాట్సాప్పుల్లో ఎకసెక్కాలు... ఛీ ఛీ మనిషన్నాకా కాసింతసేపు నిద్రపోడా?

గంటలకు గంటలుపనిచేశాక కూసింత కునుకురాదా? అదీకాక పోయిపోయి ఈ సమావేశాలన్నీ శీతాకాలం పెడతారెందుకో? రాత్రి పీకలదాకా తాగిన మత్తు ఇంకా దిగనే దిగదు. అక్కడికీ అలారం పెట్టుకుని లేచి ఆగమేఘాలమీద బయలుదేరి వస్తూనే ఉంటిమి. కాస్తంత కన్ను అంటుకుంటే కొంపలంటుకున్నట్లు ఓ వార్త

రాసి పారెయ్యాలా?

మస్తాన్‌రావు బుర్రనిండా నిద్ర గురించిన ఆలోచనలే... 'నిధి చాలా సుఖమా నిద్ర చాలా సుఖమా?" అని ఎవరయినా అడిగితే 'ఉండండి కాసేపు పడుకుని లేచాక చెబుతాను' అంటాడు మస్తాన్‌రావ్.

'పోనీలే ఉయ్యాల్లో జోగాడుతున్నట్లే జోగి, కారులో నయినా కాస్సేపు పడుకుందామనకున్నాడు.

'చల్లగాలిలో గతుకురోడ్లలో కారు ప్రయాణం. తీరమెక్కడో గమ్యమేమిటో తెలిసిన యానం' అని ఓసారి పలవరించి చిన్నకునుకులోకి జారాడో లేదో ఒక్కసారి పైకి ఎగిరిపడ్డాడు.

'ఛ... రోడ్లు... పాడురోడ్లు...' అని తిట్టుకోబోయి తానే రోడ్లు భవనాల శాఖ సహాయమంత్రిననిగుర్తొచ్చి, చటుక్కున నాలిక్కరుచుకున్నాడు తిట్టుకునే హాయి కూడా హరించుకుపోయినందుకు బాధపడ్డాడు.

అప్పుడే పెద్ద కుదుపు రావడంతో అతని నాలికలోకి అతని పన్నే దిగబడి... పన్ను కట్టని ధనవంతులకు కొత్త నోటుదెబ్బ తగిలినట్లు తగిలి రక్తం కారింది. 'ఛీ పాడురోడ్లు... రెస్ట్ లేకుండా పోతుంది మళ్ళీ కొన్ని రోజులు విదేశాలకు వెళ్ళి రావాలి' మూతి తుడుచుకుంటూ మూలిగాడు.

కడుపారా టిఫిన్ లాగించి అసెంబ్లీకి వెళ్ళి అలా కూర్చున్నాడో లేదో కాస్సేపటికి మళ్ళీ నిద్ర ముంచుకురాసాగింది. పాపం మస్తాన్‌రావు... పగవాడు కూడా పడరాని కునికిపాట్లు పడసాగాడు.

'ఉద్యోగమన్నాక ఏవో పొరపాట్లు జరుగుతుంటాయి. ఎంసెట్ పేపర్లు ఎలా లీకయ్యాయి? ఎందుకు లీకయ్యాయి? అంటే లీకవుతాయి... పత్రికలవాళ్ళూ, చానెళ్ళవాళ్ళూ చుట్టూ చేరి 'మీరు ఉద్యోగం చేస్తున్నారా? మొద్దు నిద్రపోతున్నారా? అంటే రెండూ చేస్తున్నాం. ఒకవేళ ఒక మనిషికి సహస్ర నేత్రాలున్నా... మనిషయితే ఒక్కడే కదా! అన్నిచోట్లా తానయి పనిచేయలేడు కదా!

అందరూ వ్యాఖ్యానిస్తున్నంత సులువు కాదు ఈ ఉద్యోగం. విద్యాశాఖలో కీలక పదవి నిర్వహిస్తున్నానని కుళ్ళు. చిన్నవంక దొరికితే చాలు అతన్ని సస్పెండ్ చేయాలి... రాజీనామా చేయాలి అని గోలగోల చేస్తుంటారు వెర్రి వెధవలు' లక్ష్మణ్ రావు సణుక్కుంటున్నాడు. "అవునులెండి... పాపం... ఎప్పుడో ఎక్కడో అదాటున నిద్రపట్టేసి ఉంటుంది.

అప్పుడే కాస్తంత ఈ పొరపాటు జరిగింది. అయినా పిల్లలే కదా మళ్ళీ రాసేస్తారులే పరీక్ష. ఈ కాస్త దానికే పేపరోళ్ళు అలా పరాపరా రాసెయ్యడం, ఛానెళ్ళవాళ్ళు ఇలా బిరాబిరా షూట్ చేసెయ్యడమూనూ.. వీళ్ళు మరీనండి" అని ఊరడించినట్టు మాట్లాడింది లీలావతి.

లక్ష్మణ్‌రావుకి తన భార్య తనపై సానుభూతి చూపిస్తోందా? లేక దెప్పుతోందా? తిడుతోందా? అర్థం కాలేదు. అసలు ఆ పేపర్లు లీకయినప్పుడు ఏమి చేస్తున్నారు? అధికారులంతా నిద్రపోతున్నారా? అని దుమ్మెత్తిపోస్తూ విచారణ కమీషన్ వేయాలని చూస్తున్నారట. అదిగో... ఆ విషయం మాట్లాడడానికే ఇప్పుడు లక్ష్మణ్‌రావుకి మంత్రిగారితో మీటింగ్ ఉంది. 'చెట్టు మీద దెయ్యం నాకేమి భయ్యం' అనుకుంటూ బయలుదేరాడు లక్ష్మణ్‌రావు.

కానీ అతగాడికేమో కాస్త ఎక్కువసేపు కూర్చుంటే చాలు, నిద్ర ముంచుకొస్తోంది. 'నిద్రరాకుండా ఉండాలంటే ఏమిచెయ్యాలా?'అని ఆలోచించాడు.చన్నీళ్ళతో ముఖం కడుక్కోవడం, వేడివేడి టీ తాగడం వంటి

## ప్రతిభకు గుర్తింపు

**బా**లీవుడ్‌భామ అనుష్కా శర్మ కెరీర్‌లో 'జాతీయ రహదారి'ని అద్భుతంగానిర్మించుకున్నది.నటనలో తిరుగులేని తారగా గుర్తింపు పొంది, పిన్న వయసులోనే 'క్లీన్ స్టేట్ ఫిలింస్' పేరిట స్వంత బ్యానర్ స్థాపించి అనేక మంచి సినిమాలను నిర్మిస్తున్నది.

నటిగా,నిర్మాతగా గుర్తింపు పొందుతున్న అనుష్కా శర్మకు ఈ ఏడాది గొప్ప గౌరవందక్కింది. 'దాదా సాహెబ్ ఫాల్కె ఎక్స్‌లెన్స్ అవార్డ్' అందుకోబోతున్నది. ఎన్నో అర్థవంతమైన, వినోదాత్మక సినిమాలను ప్రేక్షకులకు అందించినందుకుగాను ఆమెను ఈ అవార్డుకు ఎంపిక చేశారు.

ప్రస్తుతం ఆమె సూయిధాగా. జీరో సినిమాల్లో నటిస్తున్నది. మూడు చిత్రాల నిర్మాణానికి సిద్ధం అవుతున్నది అనుష్కా శర్మ.

రకరకాల మార్గాలద్వారా నిద్ర ఆపుకోవడానికి ప్రయత్నిస్తూ ఎఫ్.ఎమ్ రేడియోలో పాటలు వినసాగాడు.

**సుం**దర్రావు ఆ కుర్చీలో చాలా అసౌకర్యంగా కూచున్నాడు. అదేమిటోవద్దన్నా పొడుచుకువచ్చే పొట్టా, అదుపు తప్పి పెరుగుతున్న బరువూ... చేస్తున్న పోలీస్‌ఆఫీసర్‌ఉద్యోగానికీకాస్త ఇబ్బందిగానేఉంది.

అయ్యప్పస్వామికి కాళ్ళ చుట్టూ పట్టు పట్టీ కట్టుకున్నట్లు, శివుడి మెడలో సర్పంచుట్టుకున్నట్లు... పొట్టను బిగించి బెల్లీ కనపడకుండా బెల్ట్ కట్టుకుంటూనే ఉన్నాడు. శరీరం పెరిగినకొద్దీ ఆకలి కూడా పెరుగుతుంది. అందునా పోలీసోళ్ళు వచ్చారంటే హోటళ్ళలో ఫ్రీ టిఫిన్లు, బండ్లపై ఫ్రీ. పండ్లూ, థియేటర్లలో ఫ్రీ సినిమాలు, తిండ్లూ... ఇక ఒళ్ళు పెరగడమంటే ఎందుకు పెరగదు?

గడియ గడియకు ఏదో ఒకటి తినడం అలవాటయ్యాక ఆకలి పెరగమంటే ఎందుకు పెరగదు? అదీకాక నడకేది? ఎక్కడికైనా వెళ్ళాలంటే జీపేనాయే. వెళ్ళినదగ్గరనుండి కాళ్ళు జాపుకుని కూర్చోవడమేనాయె. వ్యవహారమంతా ఫోన్లలోనే నడుస్తుందాయే! ఇక వ్యాయామమెక్కడ?

ఇక ఖాళీగా కూర్చునేసరికి ముంచుకొచ్చే నిద్రే నిద్రే! ఏదయినా కేసొస్తే... 'సాక్ష్యం ఉందా? ఈ కేసు మా పరిధిలోదికాదు..సరే, రిపోర్టుఇచ్చి నాలుగు రోజుల తరువాత రండి' లాంటి బోలెడన్ని జవాబులు తనకింది ఉద్యోగులు చెప్పనే చెబుతారు.

కానీ ఎంత ఖాళీగా కూర్చుంటే మాత్రం పై అధి



కారిని తనే సబార్డినేట్స్ ముందు కునికిపాట్లు పడడం బాగుండదు కదా! ఎలా మరి?" అనుకుంటూ మత్తు కళ్ళతో సెల్‌ఫోన్‌లో రేడియో ఆన్ చేశాడు.

**అ**సెంబ్లీలో విరామసమయం. టీ తాగి వచ్చి కూర్చున్న మస్తాన్‌రావ్, ఎమ్మెల్యే పరాంకుశరావ్ వీపు పరపరా గోక్కోవడం చూశాడు.

"ఏంటీ వీపు గోక్కుంటున్నావా పరాంకుశం?" ఆశ్చర్యంగా అడిగాడు మస్తాన్‌రావ్.

"అదేమిటి నీకు వీపు లేదా? దానికెపుడూ దురద కలగదా? నువ్వెప్పుడూ గోక్కోవా?" అరిచాడు.

"అయ్యో ప్రతిపక్షంవాడని మరిచి అడిగానే..." అనుకుని అంతలోనే అమితంగా ఒళ్ళు మండినవాడయి... "గోక్కో గోక్కో... నువ్వలా గోక్కుంటుంటే ఏ క్యూఛానెల్‌వాడో, నై ఛానల్‌వాడో కవర్‌చేస్తాడు.

ప్రజలంతా తినడానికి తిండిలేక తాగడానికి నీళ్ళులేక అల్లాడుతుంటే ఈ ఎమ్మెల్యే మాత్రం అక్రమసంపాదన బాగా తిని, ఏపుగా గోళ్ళు పెంచుకుని, చట్టసభల్లో కూర్చుని, గోళ్ళు కొరుక్కోవడమేకాక, కొరుక్కోగా మిగిలిన గోళ్ళతో వీపు కూడా గోక్కుంటున్నాడు' అని న్యూస్‌రీడరమ్మ మహా సొంపుగా చదువుతుండగా... నువ్వు వీపు గోక్కునేరీలు రోజూరోజంతా రివ్వురివ్వున తిప్పుతారు. తిక్క కుదురుతుంది" అన్నాడు.

"ఏంటి ఏంటి... నేను అక్రమ సంపాదన తింటున్నానా? ఏ వెధవ అంటాడామాట? నేను అక్రమ సంపాదన తింటున్నానని ఎవరయినా రుజువు చేస్తే వెంటనే ఈ పదవికి రాజీనామా చేస్తాను.

అయినా ఎమ్మెల్యే అయినంత మాత్రాన వీపు



గోక్కోకూడదా? నా వీపు నేను గోక్కుంటుంటే ప్రజా హితమైన పనులుచేయడం లేదంటారా? అంటే గంటగంటకు వెళ్ళి ఎవరివీపయినా..."

"ఇంక ఆపు బాబు... నేరకపోయి నీతో పెట్టుకున్నాను. వెళ్ళి నా సీట్లో నేను కూర్చుంటాను..." వేగంగా వెళ్ళి తన సీట్లో కూర్చుని మొబైల్లో రేడియో ఆన్ చేసుకుని హియర్ ఫోన్స్ పెట్టుకున్నాడు. అంతే, ఆకాశవాణిలో అశరీరవాణి వినపడసాగింది.

"ఇప్పుడు చేపలు, వాటి జీవనవిధానం గురించి తెలుసుకుందాం. నీటిలో నివసించే జీవుల్లో ప్రధానమయినవి చేపలు. చేపలు మొప్పలతో శ్వాసిస్తాయి. కళ్ళు తెరిచి నిద్రిస్తాయి'

"ఛీ ఛీ ఎప్పుడైనా రేడియో వింధామని అనుకుంటే చాలు 'పందుల పెంపకం', 'చీడ పురుగుల నివారణ' ఇవే వస్తాయి అనుకుని విసుక్కోబోయి... ఎందుకో విన్న విషయాన్ని ఓసారి రివైండ్ చేసుకున్నాడు.

రేడియోలో కూడా అవేమాటలు మళ్ళీ వినిపించసాగాయి. "చేపల గురించి వింటూంటే చిత్రంగా ఉందికదూ... నిజంగానే చేపలు మొప్పలతో శ్వాసిస్తాయి. కళ్ళుతెరిచి నిద్రిస్తాయి" ఇంకా ఏదేదో చెబుతున్నదామె. మస్తాన్‌రావు చెవుల్లో మళ్ళీ మళ్ళీ అవే మాటలు వినపడసాగాయి.

ఇక్కడ తనకే కాదు, అక్కడ లక్ష్మణ్‌రావుకి, సుందర్రావ్‌కి, శోభన్‌బాబు త్రిపద డైలాగ్ 'రాధా..రాధా...రాధా' లా 'చేపలు కళ్ళు తెరిచి నిద్రిస్తాయి.

'కళ్ళు తెరిచి నిద్రిస్తాయి' 'కళ్ళు తెరిచి నిద్రిస్తాయి' అని వినిపించసాగాయి.

ఆ వెంటనే ఒక వ్యాపార ప్రకటన. 'ఒక

## మంచి అవకాశాలు

ఒకే ఒక్క సినిమాతో, ఘాటు, హాటు ముద్దులతో ముచ్చట్లు చెప్పిన షాలినీపాండేకు తెలుగు, తమిళ పరిశ్రమల్లో అవకాశాలు బాగా వస్తున్నాయట. అంతేకాదు- ఏకంగా మహేష్‌బాబుతో కలసి నటించగల ఛాన్స్‌కొట్టేసిందని వినికిడి.

మహేష్ 25వ సినిమా కోసం ఇప్పటికే పూజా హెగ్డెను ఎంపిక చేశారు.రెండో హీరోయిన్‌గా షాలినీ పాండెకు దర్శకుడు ఓటేశాడన్నది వార్త. అమాయకంగా కనపడుతూనే కొంచెమైనా సందేహించక ముద్దుల జడివాన కురిపించిన ఈ పిల్ల ముందడుగులు ఎలా ఉంటాయో చూడాలి మరి!

ఐడియా మీ జీవితాన్నే మార్చేస్తుంది...' చెవుల్లో గింగురుమంది. అంతే, క్షణాల్లో ఆ మాటలు ఈ ముగ్గురిపై విపరీత మైన ప్రభావాన్ని చూపాయి.

"అవునూ... మనంకూడా చేపవలె కళ్ళు తెరిచి నిద్రపోవడానికి ప్రయత్నిస్తేనో" అన్న ఆలోచన ఫ్లాష్‌లా వెలిగి, వేవేల సూర్యుడిలా ప్రచండంగా ప్రకాశించసాగింది.

"ఈ ఆలోచన జీవితాన్నే మార్చేస్తుందేమో! అవును కదూ... కళ్ళు తెరిచి నిద్రపోతే అసలెవరూ నిద్రపోతున్నట్లు కనిపెట్టలేరు. హాయిగా అయిదేళ్ళ పాటు యధేచ్ఛగా అసెంబ్లీలో పడుకోవచ్చు" అనుకున్నాడు మస్తాన్‌రావు.

ఒక నిర్ణయానికి వచ్చిన వాడయి సమావేశం ప్రారంభం అయిన దగ్గరనుండి కళ్ళు తెరిచి నిద్రించడం ప్రాక్టీస్ చేయసాగాడు.

ఇంచుమించు ఇదే ఆలోచనతో ఉన్న ఉన్నతవిద్యా శాఖాధికారి లక్ష్మణ్‌రావు... "హాయిగా కళ్ళు తెరిచి పడుకోవడం సాధన చేస్తే... మళ్ళీ ఏడాదినాటికి చూసుకోవచ్చు" అనుకున్నాడు.

తక్షణమే 'కళ్ళుతెరిచిపడుకునే చేపకు వందనం... అభివందనం'అనుకుంటూ తన కళ్ళు తెరిచి నిద్రించడానికి ప్రయత్నించసాగాడు.

ఇక పోలీస్ ఆఫీసర్ సుందర్రావు కూడా డిటో డిటో. ఇలా కళ్ళుతెరిచి పడుకుంటే తానసలు పడుకున్నట్టు ఎవరికీతెలియదు చట్టాన్ని కాపాడడానికి నిద్ర కూడా పోడని' పేరుకూడా వస్తుంది.

ఈలోగా ఏ నిర్భయ, అభయ సుభయలాంటి కేసులెన్ని వచ్చినా సరే... 'చట్టం తన పని తాను చేసుకుపోతుంది' అని డైలాగ్ కొట్టి...



స్వచ్ఛంద సేవలు చేస్తున్న సల్మాన్‌ఖాన్‌కి శిక్షనుండి ఉపశమనం లభించివుంటే బాగుండేది.

-జయాబచ్చన్, ఎమ్.పి.

సబార్డినేట్స్ ముందు 'బేఫిరం'గా కాదుకాదు, 'భే ఫికర్'గా కళ్ళు తెరిచి నిద్రపోవచ్చు. అలా సుందరమైన పగటి కలలుకంటూ సుందర్రావు కళ్ళు తెరిచి నిద్రపోవడం సాధన చేయసాగాడు...

ఇప్పుడు మస్తాన్‌రావ్ నిశ్చింతగా సభకు వెళుతున్నాడు. కంటినిండా నిద్రపోతున్నాడు.

ఈ సీటు గెలవడానికి ఖర్చుచేసిన కోట్ల రూపాయలను కోటి విధానాల ద్వారా సంపాదించుకుంటూ... హాయిగా అసెంబ్లీ సమావేశాలప్పుడు కళ్ళు తెరిచి కంటినిండా నిద్రపోతున్నాడు.

అంతకుముందే నక్క నుంచి జిత్తులు కుయుక్తులు, పందికొక్కునుంచి బొక్కుట, గబ్బిలము నుంచి (సీటు) పట్టుకుని వేలాడుట, పాము నుంచి విషము కక్కుట,

పులినుంచి క్రూరంగా ఉండుటా నేర్చుకున్న మస్తాన్‌రావ్ ఇప్పుడు చేపలనుండి కళ్ళు తెరిచి నిద్రించడం నేర్చుకున్న వాడయి...

"కలలు గనే వేళ ఇదే కన్నయ్యా... నిదురలో ఎంతో హాయి మస్తానయ్యా... కలతమాని ఐదేళ్ళు నిదురపోవయ్యా" అని శబ్దం రాకుండా నిశ్శబ్దంగా పాడుకుంటున్నాడు.

అనతికాలంలోనే మస్తాన్‌రావు, సుందర్రావు, లక్ష్మణరావు వంటి అనేకమంది 'నేను ఎదుగుతున్నాగా మమ్మీ' అన్నట్లుగా ఎదిగిపోయారు.

చివరకు కూర్చున్నచోట మాత్రం కళ్ళు తెరిచి నిద్రపోయేవాళ్ళు కాస్తా ఇప్పుడు నడుస్తూ, మాట్లాడుతూ, తిరుగుతూ కూడా నిద్రపోయేంతగా ఎదిగిపోయారు.

ఫీజు రియంబర్స్‌మెంట్ కోసం, పోస్టుల కోసం పోరాడుతున్న విద్యార్థులపై తమ కళ్ళముందే లాఠీ చార్జి చేస్తుంటే వాళ్ళు హాహాకారాలు పెడుతున్నా వినిపించుకోకుండా అక్కడే నుంచునివారికి తెలియకుండా నిద్రపోతున్నారు.

"అర్హులైన మాకు పోస్టింగ్స్ ఇవ్వకుంటే మేము బతికేదెలా అని నిరుద్యోగులు ఘోషిస్తున్నా" ఎదురుగా తిరుగుతూనే నిద్రిస్తున్నారు.

"నాసిరకం విత్తనాలు, నకిలీ ఎరువులతో తీవ్రంగా పంట నష్టపోయి రైతులు పురుగుమందు తాగి మరణిస్తున్నారని తెలిసినా..."

అక్కడే తిరుగుతూ నిద్రిస్తున్నారు. "అమ్మాయిల మీద అత్యాచారాలు ఎక్కువయి అరాచకం పెరిగిపోయిందని" తల్లిదండ్రులు, సామాజిక కార్యకర్తలు మొరపెట్టుకుంటూ ఉద్యమిస్తున్నా... నడుస్తూ నిద్రిస్తున్నారు, నవ్వుతూ నిద్రిస్తున్నారు.

పడుకుని, లేచి, తిరుగుతూ, కూర్చుని, తింటూ తాగుతూ నిద్రిస్తున్నారు. బహుశా విశ్వంలో ఏ జంతువూ నిదురించని రీతిలో ఎంతో హాయి అనుకుంటూ వారంతా నిదురిస్తూనే ఉన్నారు"

# పవర్ ఆఫ్ స్మైల్



Courtesy : VANITHA

నవ్వు మానవజాతికే ప్రత్యేకమైన గొప్పవరం. నవ్వు మన ఆలోచనలో ఒక భాగం, ఆలోచనకు ఒక రూపం. జరుగుతున్న సంఘటనలకు మన నిశ్శబ్ద ప్రతిచర్య నవ్వు. అలా అని అన్ని నవ్వులను విషయగ్రహణానికి గుర్తింపు చిహ్నంగా అంటే తెలిసి జరిగే ప్రక్రియగా చెప్పలేం.

నవ్వు కావాలని నవ్వచ్చు, అనుకోకుండా నవ్వచ్చు. నవ్వుకు తనదైన శక్తి వుంది. వివిధరకాల సంఘటనలలో దాని శక్తి మనకు తెలుస్తూవుంటుంది.

**భాషల అడ్డుగోడలను దాటి :** సామరస్యంతో సాగిపోయే, సంఘటనల్లో నవ్వు గొప్పతనం మనకు తెలుస్తుంది. నవ్వు సానుకూల దృక్పథాన్ని పెంచుతుంది. మనస్సుకు ఆహ్లాదాన్ని ఇస్తుంది. మానవ సంబంధాలకు వన్నెతెస్తుంది.

మన అనుభూతిని వ్యక్తం చేయటానికి వాడగలిగే అతిసామాన్యమైన స్థితి నవ్వు.

భాషయొక్క అవసరాన్ని వెనక బెంచీలలోకి నెట్టివేసి ముందు బెంచిలో ఠీవిగా కూర్చుంటుంది నవ్వు. పదాల ప్రమేయం లేకుండా పెదవి విప్పవలసిన అవసరం లేకుండా, అతిశక్తివంతంగా భావాన్ని, అనుభూతిని ఎదుటివారికి చేర్చగలిగేది నవ్వు.

**అనేక అనుభూతులకు రూపం :** నవ్వు నానా విధాలు, అమాయకపు నవ్వు, మాయచేసే నవ్వు, కోపాన్ని దాచుకునే నవ్వు, లోపల ఏముందో తెలియని నవ్వు, అర్థంలేని నవ్వు, ఇబ్బంది నవ్వు, వ్యంగ్య నవ్వు, ముందస్తునవ్వు, తొందరపాటు నవ్వు, ఆశించే నవ్వు, స్నేహపూరిత చిరునవ్వు, ఉల్లాసంతో నవ్వు, విసుగును కప్పివుంచే నవ్వు.

ఇలా పేర్లు చెప్పుకుంటూపోతే సముద్రమంతుంటాయి. ప్రతి అనుభూతికీ కూడా నవ్వురూపాన్ని ఇస్తుంది. కొత్తశిశువు బోసినవ్వులా, ముందుగానే మొదలవుతుంది. సంఘంలో మెసిలేటప్పుడు పెదవులపై పూచేటటువంటి నవ్వు, లోకంతో తన అనుబంధాన్ని మెరుగుపరుచుకోవాలనే ఆకాంక్షను అందంగా తెలియజేస్తుంది.

**అనుబంధాలకు మరింత బలం :** చిన్నపిల్లలు, పెద్దవాళ్ళ ప్రపంచంలో అడుగుపెట్టి అనుబంధాలను పెంచుకునేటప్పుడు వారి జ్ఞానం, భాషపై పట్టు, వ్యక్తిగతంగా సహకరిస్తాయి.

పిల్లలు తమ తమ భావనలకు అనుగుణంగా ముందుకు సాగుతూ అనుబంధాలను మెరుగుపరుచుకోవటంలో ప్రగతిని సాధిస్తారు.

ఇక్కడ ఓ చిన్నారి చిరునవ్వు పెద్దవారికంటే భిన్నంగా, ఎంతో ప్రత్యేకంగా వుంటుంది.

అన్ని వయస్సులవారిపై వివిధ బౌద్ధిక స్థాయిలలో వున్న వ్యక్తులపై, అందరిపై కూడా నవ్వు తన ప్రభావాన్ని చూపిస్తుంది. ప్రతి విషయంలోను సానుకూలతను పెంచుతుంది. శారీరక, మానసిక, ఆరోగ్యానికి ఊతమిస్తుంది నవ్వు.

**సహకారాన్ని అందిస్తూ :** ప్రతి మనిషికీ నవ్వు ఏ సమయంలో ఐనా అందుబాటులోనే వుంటుంది. మనుష్యుల మధ్య అంతరాలను తగ్గించేందుకు, మనస్సుల మధ్య ఖాళీలను పూరించేందుకు చిరునవ్వు ఎల్లప్పుడూ సిద్ధంగా వుంటుంది.

వ్యక్తిగతంగా, దిశానిర్దేశం చేస్తుంది.అలాగే చుట్టూ వున్న ప్రపంచంతో అనుసంధానం చేస్తుంది.

నిత్యజీవితంలో మనం ఏ పని చేస్తున్నా నవ్వు మనకు నమ్మకస్తుడైన సహాయకుడిగా వుంటుంది. మనం మన జీవితంలో నవ్వును సమయానుకూలంగా, తగు మోతాదులో ఎన్నోసార్లు వాడివుంటాం.

అలాగే మనసారా ఎంతగా, ఎంతసేపు నవ్వామో తెలియకుండా సమయాన్ని గడిపివుంటాం.నవ్వులోకానికి, మనకి మధ్య స్నేహవారధి, మన అనుభూతులకు అందమైన ప్రతినిధి. మనసారా నవ్వేద్దాం.మనస్సులను, మనుష్యులను కలిపేద్దాం, గెలిచేద్దాం.

**నవ్వితే నొప్పి హుష్ :** శరీరంలో ఎక్కడైనా నొప్పిగా ఉంటే ఏడుపు వస్తుంది కాని నవ్వు వస్తుందా రాదు. కాని నవ్వితే నొప్పి తగ్గుతుందంటున్నారు నిపుణులు. శరీరంలో ఎక్కడైనా బాధగా ఉన్నప్పుడు కామెడీ సీరియల్ చూడాలని లేదా హాస్య పుస్తకాలు చదవాలని ఏ లాఫింగ్ క్లబ్‌కో వెళ్ళాలని ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ శాస్త్రవేత్తలు తెలిపారు.

నవ్వినప్పుడు కేంద్ర నాడీవ్యవస్థలో విడుదలయ్యే ఎండార్ఫిన్లు మెదడంతా పాకి నొప్పిని భరించగల శక్తిని పెంచుతాయని వారు వివరించారు.

# తండ్రీ! నిన్ను దలంచి...

## ఆడెప్ల శివకుమార్



"నాలుగు కోట్ల కాంట్రాక్టులు చేజారి పోతూవుంటే ఏం చేస్తున్నారయ్యా మీరంతా గాడిదలు కాస్తున్నారా?"

మేనేజర్ తలవంచుకుని మౌనంగా నిలబడ్డాడు.

పావుగంటసేపు చెడామడా తిట్టాక బీపీ కొంచెం తగ్గింది. మా ఆవిడ కాఫీ తీసుకురావటం చూసి "సరే ఆ ఇరిగేషన్ కాంట్రా క్టయినా సరిగ్గా తగలబెట్టండి" అన్నాను కోపంగా. వినయంగా నమస్కరించి మేనేజర్ వెళ్ళిపోయాడు.

"పాపం ఎందుకండీ అనవసరంగా మేనేజర్ గారిని తిడుతున్నారు ఎవరు తక్కువ కోట్ చేస్తే వాళ్ళకే కదా కాంట్రాక్ట్ దక్కేది ఆ మాత్రం మీకు తెలీదా?" అంది మా ఆవిడ కాఫీ కప్ అందిస్తూ.

"తెలుసు కానీ ఎవడో ఒకడ్ని తిట్టకపోతే నా బీపీ ఎలా తగ్గేది?" చిరాకుగా కాఫీ సిప్ చేస్తూ అన్నాను.

"ప్రశాంతంగా మెడిటేషన్ చేసుకోవచ్చు కదా?"

"నావల్లకానిపనులు చెప్పి నన్ను భయపెట్టమాకు" అని ఇంకా ఏదో చెప్పబోతుండగా నా మొబైల్ మ్రోగింది. ఫోన్ ఎత్తి "హలో..." అన్నాను విసుగ్గా.

"బాబుగోరూ నమస్కారం..పెద్దయ్యగారు ఎండ దెబ్బకొట్టిపొలంలో కళ్ళు తిరిగిపడిపోయారు..." అవతలనుంచివిన్పించిన వార్త వినగానే నా చిరాకు, అసహనం మరింతగా పెరిగాయి "ఇప్పుడెలా ఉన్నాడు?" అని ప్రశ్నించాను అంతే అసహనంగా.

"కొంచెం పర్లేదండయ్యా ఆర్ఎమ్‌పీ డాక్టర్‌గోరొచ్చి చూసిపోయారు..."

"సరేకొంచెంకనిపెట్టుకునుండి అవసరం అయితే ఫోన్ చెయ్యి..."అంటూ ఫోన్ పెట్టేశాను.

"ఏమయ్యిందండీ?" మా ఆవిడ కంగారుగా అడిగింది. నేను నిర్లక్ష్యంగా మొబైల్ టీపాయ్‌మీద పడేసి తాపీగా కాఫీ తాగటం మొదలుపెట్టాను.

"మీ మామగారు ఉన్న రెండెకరాల పొలంలో వ్యవసాయం చేసి నన్ను అమెరికా ప్రెసిడెంట్‌ను చేసేద్దామని చూస్తూవుంటాడు కదా వడ దెబ్బ కొట్టి పొలంలో పడిపోయాడట..."

"అయ్యో, ఇప్పుడెలా ఉన్నారు?" మరింత కంగారుగా అడిగింది నా భార్య.

"ఎలా ఉంటాడు నన్ను చంపుకుని తింటూ నిక్షేపంగా ఉన్నాడు... ఆ దరిద్రపు ఊరొదిలిపెట్టమని చెపితే చచ్చినా వినడు. ఊళ్ళోవాళ్ళంతా నన్ను తండ్రిని పట్టించుకోని నీచుడిగా తిట్టుకోవాలనేది ఆయన పథకం. జన్మలో మారడు..."

"అత్తయ్యగారు పోయాక మావయ్యగారు బాగా క్రుంగిపోయారు. మనమే ఆయన్ని జాగ్రత్తగా చూసుకోవాలి కదండీ" అంది నా భార్య హితబోధ చేస్తున్నట్లుగా". ఎవరిమీదో తెలీని కోపం, కసి మళ్ళీ దాన్ని ప్రదర్శించలేని నిస్సహాయత... నా మానసిక పరిస్థితికి కారణం ఉంది... నా సుపుత్రుడే నా ఆందోళనకు, అశాంతికి కేంద్రబిందువు...

"వారం రోజుల్లో వాడు ఇంటికి వస్తున్నాడు. వాడికి ఇష్టమైన పిండివంటలూ, పచ్చళ్ళు అన్నీ రెడీ చేశావా? ఫ్రిజ్‌లోంచి తీసి ఓవెన్‌లో వేడిచేసుకుని తినీతినీ వాడి జిహ్వ చచ్చిపోయివుంటుంది"

మా ఆవిడ నావైపు ఆశ్చర్యంగా చూసింది. "వాడు వస్తున్నది అండమాన్‌నుంచి కాదండీ అమెరికా. అక్కడ దొరకని ఫుడ్ అంటూ ఉండదు, మీరు కంగారుపడి నన్ను టెన్షన్ పెట్టమాకండి" అంది నవ్వుతూ.

"నువ్వు చెప్పేది నిజమే... కాకపోతే అమ్మ చేతి వంట తాలూకు కమ్మదనం ఎక్కడ దొరుకుతుంది చెప్పు" అన్నాను. మాకు ఒక్కడే కొడుకు మోహన్‌కృష్ణ ఇంజనీరింగ్ పూర్తైనాక బిజినెస్సులు చూసుకుంటాడేమోననుకున్నానుకానీ అమెరికా వెళ్తాననేసరికి-

"అక్కడకెళ్ళి జాబ్ చేయాల్సిన ఖర్మ నీకేంటి? మన ఆఫీసుల్లోనే చాలామంది ఇంజనీర్లు పనిచేస్తున్నారు. నువ్వొచ్చి మన వ్యాపారాలు చూసుకుంటే రెండేళ్ళు తిరిగేసరికల్లా మన ఆస్తులు రెట్టింపవుతాయి" నచ్చచెప్పే ప్రయత్నం చేశాను.

'వాడు ఎవరైనా పేదింటి అమ్మాయిని ప్రేమించి పెళ్ళిచేసుకుంటే?' అనే ఆలోచన వచ్చినప్పుడల్లానేను అతలాకుతలం అయిపోయేవాడిని.

కానీ నేను భయపడినట్లుగా జరగలేదు. బాగా డబ్బున్న కోటీశ్వరుడి కూతురినే మా ఇంటికోడలిగా తెచ్చుకున్నా. అదే ఇప్పుడు నా కొంపమీదకు తెచ్చింది.



జాతీయ పార్టీలతో అభివృద్ధి సాధ్యంకాదు... ప్రాంతీయ పార్టీలదే అభివృద్ధిలో కీలక స్థానం.
-దేవెగౌడ, మాజీ ప్రధాని

"సార్ ఈవెనింగ్ ముఖ్యమైన అపాయింట్‌మెంట్ ఉంది..." అన్నాడు. "క్యాన్సిల్ ఇట్...".

"డెలిగేట్స్ చైనానుంచి వస్తున్నారు సార్. మూడు నెలలక్రితం ఫిక్స్ అయిన ప్రోగ్రామ్..." సెక్రటరీ నసుగుతూ అన్నాడు.

"నా కొడుకు అమెరికా నుంచి వస్తున్నాడయ్యా, వాడిని రిసీవ్ చేసుకోవటానికి ఎయిర్‌పోర్ట్‌కి వెళ్ళాలి. దానికంటే నాకు ముఖ్యమయిన అపాయింట్‌మెంట్ ఏదీలేదు" నిష్కర్షగా చెప్పేసరికి సెక్రటరీ తలాడించి నా ఛాంబర్‌లోంచి బయటకెళ్ళిపోయాడు.

ఎయిర్‌పోర్ట్ చాలా సందడిగా ఉంది. నేనూ, మా ఆవిడ గంటముందే వచ్చి వెయిట్ చేయటం ప్రారంభించాం. ముంబైనుంచి రావాల్సిన ఫ్లైట్ వచ్చింది. కానీ నా కొడుకుమాత్రం రాలేదు. చికాగోలో వాడు పనిచేస్తున్న కంపెనీకి ఫోన్ చేశాను.

అవతలవాళ్ళు చెప్పిన వార్త విని నాకు మతిపోయినంత పనయ్యింది. "ఏమయ్యిందండీ?" ఫోన్ కట్ చేసి సూట్ పాకెట్‌లో పెట్టుకుంటుంటే మా ఆవిడ ఆందోళనగా నావైపు చూస్తూ అడిగింది.

"నీ కొడుకు ఇండియా వచ్చి వారంరోజులు అయ్యిందంట" అన్నాను.

"వారంరోజులైందా? మరి ఎక్కడ వున్నట్లు వాడు?" నా భార్య మరింత ఆందోళనగా అడిగింది. నేను సమాధానం చెప్పకుండా ఎయిర్‌పోర్ట్‌లోంచి బైటకు నడిచాను. కోట్లు లాభంవచ్చే బిజినెస్ మీటింగ్ క్యాన్సిల్ చేసు



Courtesy : INFINITHOUGHTS

కుని వాడిని చూడాలన్న ఆతృతతో పరిగెత్తుకొచ్చాను. వాడేం చేశాడు? ఎప్పుడో వారం రోజులక్రితం ఇండియాలో దిగినవాడు కనీసం మాటమాత్రంగా అయినా విషయం చెప్పకుండా ఎక్కడో తిరుగుతున్నాడు.

నాల్గురోజులతర్వాత డైనింగ్ టేబుల్‌దగ్గర ప్లేట్లో చేయిపెట్టి అస్థిమితంగా అన్నం కలుపుతున్న నన్ను చూసి మా ఆవిడ చెప్పింది- "మీరేం కంగారుపడకండి. మీ ముద్దులకొడుకుగారు సింగపూర్‌లో ఉన్నారు"

"సింగపూర్‌లోనా?" నేను ఎంతో ఆశ్చర్యంగా నా భార్యవైపు చూస్తూ అడిగాను.

"అవును, వాళ్ళ అత్త, మావగార్లను తీసుకుని మీ పుత్రరత్నంగారు సింగపూర్ షాపింగుకి వెళ్ళాడు"

"నీకెలా తెలుసు?"

"సౌభాగ్య తెల్సుకదా, దాని కూతురు సింగపూర్‌లో ఓ బ్యాంకులో పనిచేస్తుంది. సింగపూర్‌లో షాపింగ్ చేస్తూ కన్పించాడట.ఇది ఉండబట్టలేక 'నువ్వు మోహన్ కదూ' అనడిగితే కొంచెం కంగారుపడ్డా ఆ తరువాత ఏదో కాన్ఫరెన్సు పనిమీద సింగపూర్ వచ్చానని చెప్పాడంట, వెంటవున్న అత్తామావల్ని చూసేసరికి దానికి విషయం అర్థమయి నాకు ఫోన్‌చేసి చెప్పింది రెండు రోజులక్రితం"

వారంరోజుల క్రితమే ఇండియాలో దిగిన వాడు తల్లీదండ్రిని పలకరించకుండా కనీసం ఓ ఫోన్‌కూడా చేయకుండా అత్తామావలను వెంటేసుకుని సింగపూర్‌షాపింగ్ కెళ్ళాడు. తనకోసం తండ్రి ఎంత విలవిలలాడుతూవుంటాడో ఆమాత్రం అర్థంచేసుకునే మనస్సు కూడా వాడికి లేకపోయిందా?

వాడి మావగారికి వెయ్యికోట్ల ఆస్తి ఉండవచ్చు, నాకు అందులో పదోవంతు ఆస్తే ఉండచ్చు. అంత మాత్రాన తండ్రికి ఇచ్చే గౌరవం ఇదేనా?

"ఇండియా ఎప్పుడొచ్చి సెటిల్ అవుతావ్?"

"ఇండియాలో ఏముంది?" నిర్లక్ష్యంగా అన్నాడు.

"అంటే పర్మినెంట్‌గా అమెరికాలోనే ఉండిపోతావా?" తెలీకుండానే నా గొంతు దుఃఖంతో వణికింది. సమాధానం చెప్పకుండా నా పుత్రరత్నం సోఫాలోంచి పైకి లేచి వాడి రూమ్‌లోకి వెళ్ళిపోయాడు. రెండోరోజు నేను ఆఫీస్‌నుంచి ఇంటికొచ్చేసరికి వాడు కన్పించలేదు.

"వెండుగాడేడి?" అంటూ నా భార్యను అడిగాను.

"ఏమోనండీ... మధ్యాహ్నం బయటికి వెళ్ళాడు. ఇంతవరకూ రాలేదు..." అంది.

నేను కోపంతో మా ఆవిడమీద ఎగిరాను, "నీకు అసలు బాధ్యత లేకుండా పోయింది... మధ్యాహ్నం వెళ్ళినవాడు ఇంతవరకూ రాక పోతే ఏం చేస్తున్నావ్, అవతల వాడు భోజనం చేశాడో లేదో కనుక్కున్నావా...?" అన్నాను కోపంగా.

"వాడసలు నాతో సరిగ్గా మాట్లాడితేగా? వంద ప్రశ్నలడిగితే ఒక్కమాట మాట్లాడతాడు. కోడలొచ్చిందన్న మాటేకానీ ఏ రోజూ రెండు రోజులు ఇక్కడ ఉన్నది లేదు. వాళ్ళ అమ్మగారింట్లోనే ఉంటుంది. వీడు కూడా అక్కడికే వెళ్ళుంటాడు..."

నేను మొబైల్‌కి ఫోన్ చేశాను. స్విచ్ఛాఫ్ వచ్చింది... రాత్రి ఎనిమిదిగంటలవరకూ ట్రై చేస్తూనేవున్నాను. కానీ మొబైల్ ఆఫ్‌లోనే ఉంది.

ఇక తప్పనిసరై ఇష్టం లేకపోయినా మా వియ్యంకుడికి ఫోన్ చేశాను. "వాళ్ళమ్మ కంగారుపడుతోంది వీడెక్కడ?" అంటూ అడిగాను ఆయన్ని.

"అరె... మీకు తెలీదా ఈవెనింగ్ ఫ్లయిట్‌కి యు.ఎస్. వెళ్ళిపోయారు కదా...!" నా వియ్యంకుడు తాపీగా చెప్పాడు.

"ఏంటీ?" దాదాపుగా అరుస్తున్నట్లుగా అడిగాను. "మాకు చెప్పాపెట్టకుండా అమెరికా వెళ్ళిపోయాడా?"

"ఏదో అర్జంటు పని తగిలినట్లుంది హడావిడిగా బయలుదేరిపోయారు..నాకు వేరే ఫోనొస్తుంది. మీకు మళ్ళీ కాల్ చేస్తాను" అంటూ వియ్యంకుడు నా ఫోన్ కట్ చేశాడు. ఆ రాత్రి భోజనం చేయకుండా పడుకున్నాను. నిద్రపట్టి చావటంలేదు... మనస్సంతా భారంగా, బరువుగా ఉంది.

అసలు తల్లిదండ్రులపట్ల బాధ్యత సంగతి సరే, కనీసం మమకారం కూడా లేకుండా పోయిందా నా కొడుక్కి? నేను అస్థిమితంగా బెడ్‌మీద అటూ ఇటూ కదలడాన్ని గమనించిన మా ఆవిడ "ఎందుకండీ అనవసరంగా టెన్షన్ పడతారు. ప్రశాంతంగా నిద్రపోండి" అంది ఓదారుస్తున్నట్లుగా.

మరో వారంరోజులు గడిచిపోయాయి...

ఆ రోజు తెల్లవారుఝామునే సిటీకి దూరంగా ఉన్న చిలుకూరు బాలాజీ టెంపుల్‌కి బయలుదేరాం. ప్రభాతకాలపు వాతావరణం ప్రశాంతంగా ఉంది.

దేవాలయంలోకి ప్రవేశించి ధ్వజస్తంభానికి నమస్కారం చేసినతరువాత మనస్సుని వీలయినంత ప్రశాంతంగా ఉంచుకునేందుకు ప్రయత్నిస్తూ ప్రదక్షిణలు చేయటం మొదలుపెట్టాను.

నేను ఏడో ప్రదక్షిణం పూర్తిచేస్తుండగా అప్పుడు కన్పించాడు నా కొడుకు.

భార్య, అత్తమామలను వెంటేసుకుని నవ్వుతూ గుడి లోపలకు ప్రవేశిస్తున్నాడు.

ఒక్కసారిగా నాకు లోకం చీకటయిపోయినట్లుగా స్తంభించింది. వారంరోజుల క్రితమే అమెరికా వెళ్ళిపోయాడని చెప్పిన వాడు ఇంకా ఇక్కడే ఉన్నాడు.

తల్లిదండ్రులను పట్టించుకోకుండా అత్తమామలతో విహారయాత్రలు చేస్తున్నాడు. కనీసం వారం రోజులుగా ఒక్కటంటే ఒక్క ఫోన్ కూడా చేయలేదు. ఎంతయినా వాడు నా కొడుకు కదా, షార్ప్‌గానే ఉంటాడు.

మనదేశ రాజకీయ నాయకులు విశ్వసనీయతకు సంబంధించి తీవ్ర సంక్షోభం ఎదుర్కొంటున్నారు.
-రాజ్‌నాథ్‌సింగ్, కేంద్రమంత్రి





## ఉత్తమ ప్రేమలేఖ

హీరోయిన్లకు అడపాదడపా ప్రేమలేఖలందు తూనే వుంటాయి. వాటిలో కొన్నింటిని చూడనే చూడరు. చూసినా అస్సలు పట్టించుకోరు. అందు కున్న ప్రేమలేఖల్లో విభిన్నమైనవీ వుంటుంటాయి. అటువంటి ప్రేమలేఖ ఒకటి తాప్సీకి అందిందట. నచ్చిన ప్రేమలేఖను తాప్సీ సోషల్ మీడియాలో అభిమానులతో పంచుకున్నది.

'మద్యం తాగను, మాంసాహారం తినను, నిజా యితీపరుడిని, ప్రేమను నిరూపించుకోవడానికి ఎటువంటి పరీక్షలకు అయినా సిద్ధం, ఏం చేయ డానికైనా రెడీ, నా మనస్సంతా నువ్వే నిండిపోయావు' అంటూ రాసిన ప్రేమలేఖ తనకెంతో నచ్చిందని చెప్పింది. తనకు నచ్చినవాటిలో ఇది ఉత్తమ ప్రేమ లేఖ అంటూ కితాబు ఇచ్చింది.

వాడుకూడా నన్ను చూశాడు. వాడి ముఖంలో మార బోయే రంగులను చూద్దామని నేను గమనిస్తుండగా క్షణాల్లో సర్దుకుని మమ్మల్ని చూడనట్లుగా తల తిప్పేసుకుని ప్రదక్షిణలుచేయుటం మొదలుపెట్టాడు. అప్పుడు గుండెల్లో ఎక్కడో కలుక్కుమంది.

'రేయ్ పండూ!' నాలోని తండ్రి హీనస్వరంతో వాడిని పిలిచింది. వాడు పట్టించుకోకుండా ప్రదక్షిణపు మలుపులో కనుమరుగయ్యాడు. హఠా త్తుగా నా శరీరం కంపించింది.

పుత్రవాత్సల్యంతో కొట్టుకుంటున్న నా గుండె ఒక్కసారిగా సమ్మె చేస్తున్నట్లుగా ఆగినట్లుంది. విప రీతమైన నొప్పి... గుండెల్లో దడ... కళ్ళముందు నల్లటి చీకటి వలయాలు చుట్టుముట్టాయి. ఆ తరు వాత ఏం జరిగిందో నాకు తెలీదు.

నేను కళ్ళు తెరవగానే బోసినవ్వుతో ఒక ముఖం కనిపించింది... ముందటి నాలుగు పళ్ళు ఊడిపోయినట్లున్నాయి... ముడతలుపడ్డ ముఖం, వృద్ధాప్యం చుట్టు ముట్టిన నీరసం. కానీ కళ్ళనిండా అపా రంగా వర్షిస్తున్న దయా, ప్రేమా... "ఏరా అబ్బాయ్... ఇప్పుడెలా ఉంది?"

మా నాన్నను చూసి నీరసంగా తలాడిం చాను. "పెద్ద ప్రమాదం తప్పిందిరా... డాక్టరుగారు ఆపరేషన్ చేశారు. ఇప్పుడంతా సర్దుకుందిలే... ఆ వెంకన్నబాబే కాపాడాడు" మా నాన్న నాన్‌స్టాప్‌గా ఏదో చెబుతున్నాడు.

నేను తల త్రిప్పి అటూ ఇటూ చూశాను. మా ఆవిడ కన్పించింది కానీ నా సుపుత్రుడి జాడ ఎక్కడా లేదు. 'పండు' నా పెదవులు నీరసంగా గొణిగాయి. "మీరు స్ట్రోక్ వచ్చి గుడిలో పడిపోయాక హాస్పిటల్లో జాయిన్‌చేసి రెండో రోజు అమెరికా వెళ్ళిపోయాడండీ" అంది మా ఆవిడ నావైపు జాలిగా చూస్తూ.

ఆహా, ఎంతటి దయామయుడు? ఎంతటి కర్తవ్య నిష్ఠ? డాలర్ల వేటలో వెనుకపడకుండా ఉండేందుకు అమెరికా వెళ్ళిపోయాడన్నమాట. నాలుగు రోజుల తర్వాత హాస్పిటల్లోంచి డిశ్చార్జ్ అయ్యాను.

ఐసీయూలో ఉన్నంతకాలం మా నాన్న అనుక్షణం నన్ను కనిపెట్టుకునేవుండేవాడు... రాత్రిళ్ళు వెళ్ళి లాబీలో పడుకునేవాడు కానీ ఇంటికిమాత్రం వెళ్ళే వాడు కాదని మా ఆవిడ చెప్పింది. డిశ్చార్జ్ అయి ఇంటికొచ్చినా నా నీరసం, దిగులు తగ్గలేదు...

"ఒరేయ్ అబ్బాయ్ ఏంట్రా ఇది... జీవితమన్నాక ఢక్కామొక్కీలు తినాలి ఓపిక ఉన్నంతవరకూ ఈదు తూనే ఉండాలి... ఈదీఈదీ అలసిపోయి దమ్మొస్తే కొంచెం ఆగి ప్రాణం తేరుకున్నాక మళ్ళీ ఈదాలి. అంతేకానీ అరవై ఏళ్ళుకూడా రాకుండానే కళ్ళుతేలేసి పడిపోతే ఎట్టారా అబ్బాయ్?" మా నాన్న నవ్వుతూ నాకు ధైర్యం చెప్పాడు.

ఎనభై ఏళ్ళ తండ్రికి అరవై ఏళ్ళ నేను ఇంకా పసిబాలుడిమాదిరిగానే కన్పిస్తున్న ట్లుంది ఇరవైనాలుగు గంటలూ నా చుట్టూతే తిరుగు తున్నాడు. వేళకు తింటున్నానా లేదా మందులు వేసుకునేదాకా ప్రాణం తీస్తున్నాడు.

నెలరోజులతర్వాత నేను తేరుకున్నాక తిరిగి పల్లె టూరికి బయలుదేరాడు. మా నాన్న.

"మళ్ళీ వ్యవసాయం, ఊరికి పోతానంటే కాళ్ళిరగ్గొట్టి మూలన కూర్చోబెడతాను. ఎనభైఏళ్ళు వచ్చాయి... ఇంకా బాలాకుమారుడిని అనుకుంటున్నావా? నీకు ఏదయినా అయితే అంత దూరం పరిగెత్తుకుంటూ రావాలా?

అంతగా నీకు వ్యవసాయం చేసుకోవాలంటే మన ఫార్మ్‌హౌస్‌లో ఇష్టమయిన పంటలు వేసుకుంటావో, మొక్కలే పెంచుకుంటావో నీ ఇష్టం... నువ్వుమాత్రం ఇకనుంచీ ఇక్కడే ఉంటున్నావ్..." అని నేను కోపం నటిస్తూ మా నాన్నమీద ఎగిరాను.

నా కోపాన్ని చూస్తూ మా నాన్న నిర్మలంగా నవ్వాడు. "సర్లేరా అబ్బాయ్ నువ్వెట్లా అంటే అట్టాగే చేద్దాం బీపీ తెచ్చుకోమాకు..." అన్నాడు.

ఆయన అటుతిరిగి కళ్ళు తుడుచుకోవటం నేను చూళ్ళేదనుకున్నాడు పాపం పిచ్చోడు. నాకు ఇప్పుడు అర్థమవుతోంది. నా బిడ్డకోసం నేను ఎలాగ అల్లాడి పోతున్నానో ఆయన కూడా తన కొడుకుకోసం పరి తపించిపోయే ఉండివుంటాడు కదా!

పుత్రవాత్సల్యంతో అంధుడినయిపోయానుకానీ నాకూ ఓ తండ్రి బతికివున్నాడన్న విషయం మర్చి పోయిన మూర్ఖుడిని నేను.

నేను నిస్సందేహంగా మంచి తండ్రినికానీ మంచి కొడుకుని అన్పించుకోవాల్సిన బాధ్యత కూడా నా మీద ఉందికదా!

ప్రస్తుతం నేను నా తండ్రిపట్ల నా బాధ్యతను అత్యంత ఆనందంగా నిర్వహిస్తూ సంతృప్తి పొందు తున్నాను. ఒకప్పుడు నా కొడుకు కోసం నేను నిరం తరం దుఃఖిస్తూండేవాడిని. కానీ ఇప్పుడు నా తండ్రి దుఃఖానికి నేను కారణం కావటం నాకు ఇష్టం లేదు. మా నాన్న చెప్పింది నిజమే...

జీవితం మనకు ఎన్నో వరాలు ఇస్తుంది. వాటిని నిర్లక్ష్యం చేసి లేనిదానికోసం ఏడుస్తూంటాం.

కూసింత మనస్సు తెరిచి చూస్తే మనకు కావా ల్సింది అంతా మన కళ్ళముందే ఉంటుంది.

ఇంత కాలానికి మా నాన్న వస్తేకానీ నా కళ్ళూ, మనస్సూ తెరుచుకోలేదు.

నాకు హార్ట్ ఎటాక్ వచ్చినా నా కొడుకు పట్టించు కోకుండా అమెరికా వెళ్ళిపోయాడని దుఃఖించిన నేను ఒకప్పుడు మా నాన్న కళ్ళుతిరిగి పొలంలో పడిపోతే చేసిందేమిటి?

ఈ రోజు నాకు తండ్రి గొప్పతనం తెలిసి వచ్చింది. ఏదో ఒకరోజు నా కొడుక్కి కూడా తల్లిదండ్రుల మమకారం ఏమిటో అర్థమవు తుందేమో, అప్పటిదాకా నేను బతికుంటే అదృష్టవంతుడి కిందే లెక్క.



**అభివృద్ధి లక్ష్యాలకు ఉగ్రవాదం అవరోధంగా మారింది. దానిని తుదముట్టించాల్సిందే.**
-సుష్మాస్వరాజ్, కేంద్రమంత్రి

# నేనెవరో తెలుసా!

లండన్ నగరంలోని థేమ్స్ నది ఒడ్డున వున్న పార్క్‌ల్లో పలువురు ప్రముఖుల విగ్రహాలు కనిపిస్తాయి. అందులో ఇంగ్లండ్‌కి చెందిన వారినేకాక ఇతరదేశాలకు చెందిన నేతలవీవుంటాయి. ఆ ప్రదేశంలో విగ్రహం ఏర్పాటు అంటే అది ఆ వ్యక్తికి ఇచ్చిన గొప్ప గౌరవం అంటుంది ప్రపంచం.

అటువంటి విగ్రహాల సరసన రెండు, మూడేళ్ళ క్రితం ఒక భారతీయ సంఘసంస్కర్త విగ్రహం చేరింది. ఛాతివరకే వుండే ఆ విగ్రహం ప్రధాని నరేంద్రమోడీ చేతులమీదుగా ఆవిష్కరణ జరిగింది.

నేటి ప్రధాని ఆవిష్కరించారంటే అది స్వతంత్ర పోరాటంలో పాల్గొన్న నేతదని అనుకునే అవకాశముంది. కాని ఆయన ఈ తరంవాడు కాదు.

అలాగని జాతీయస్థాయిలో అందరికీ తెలిసినవాడు కాదు. కాని ఆయన బోధనలు అన్ని కాలాలకు చెందుతాయి. ముఖ్యంగా భారతీయ సమాజానికి అవసరమైనవి.భారతీయ సమాజంలోని విశిష్టత తన తప్పులను తాను తెలుసుకుని సంస్కరించుకోవటం. ప్రజలు ధర్మం తప్పి సంకుచిత భావాలను పెంచుకుంటున్నప్పుడు ప్రజలలో నుండే ఒక సంస్కర్త పుట్టుకువచ్చాడు.

తన బోధనలతో దారితప్పిన సమాజానికి కొత్త దారి చూపాడు.జీవితం ఎలా గడపాలో,సాటివారిని ఎలా గౌరవించాలో, అనవసరపు విభేదాలనుండిఎలా బయటపడాలో వారు ఆచరించి చూపారు.

నాటి సామాజిక రుగ్మతలమీద ధిక్కారస్వరం వినిపించినవారెందరో వున్నారు.

ఆదిశంకరులు,రామానుజాచార్యులు ఆ కోవకు చెందిన సంస్కర్తలే. వారు తాము కొత్తమతం బోధిస్తున్నామని చెప్పుకోలేదు. సమాజంలో వున్న లోపాలను, వ్యక్తుల మధ్య వున్న విభేదాలను పరిష్కరించేందుకు వచ్చామనే చెప్పారు.

ఆ సంస్కర్తపరంపరనే నేడు అధికులు ఇష్టంగా ఆరాధించే షిర్డీసాయివరకు కొనసాగించారు. భగవంతుని దృష్టిలో మనుషులంతా ఒక్కటే. ఇతర భేదాలన్నీ మనుషులు స్వార్థంతో సృష్టించుకున్నవేనని, ఆ భేదాలు మరచిపోయి ధర్మమార్గంలో జీవించమని బోధించిన ఒక మహాపురుషుడి పేరున ఇప్పుడు రాజకీయం నడపబోతున్నారు.

ఆ మహాసంస్కర్త 12వ శతాబ్దపువాడు. పుట్టింది ఒక సాంప్రదాయకుటుంబంలో.చదివింది వేద విద్య. పెరిగింది ఆధ్యాత్మిక చింతనలో. ఆ తర్వాతికాలంలో కవి అయ్యాడు.

తనకున్న సహజ పాండిత్యంతో ప్రజలకు మేలుచేసే వచనాలను చెప్పాడు.

ఆ తర్వాత తాను పుట్టి, పెరిగిన ప్రాంత మహారాజు కోరిక మీద ఆ రాజ్యానికి మంత్రి అయ్యాడు.

తన జీవితమంతా ప్రజా సంక్షేమంకోసం కృషి చేశాడు. ఆర్థికపరంగా ప్రజల అవసరాలు తీర్చటమే కాదు,

ఆధ్యాత్మికపరంగాకూడా వారికి దారిచూపాలని రాజుకు నచ్చచెప్పి 'అనుభవ మండపాల'ను ఆ రాజ్యంలో నిర్మించాడు. 'అనుభవ మండపం' అంటే సర్వసుఖాలు అనుభవించే చోటు కాదు.

తమ ఆధ్యాత్మిక అనుభవాలను వ్యక్తీకరించేందుకు, నలుగురితో పంచుకునేందుకు తగిన వేదిక. ఈ వేదిక అందరిదీ. ఇందులో కుల, మత భేదాలు లేవు. స్త్రీ, పురుషులందరూ ఆహ్వానితులే. ఆయన చెప్పిన తరతమ భేదాలు లేని సమాజం ఆశించేవారంతా అనుచరులుగా తయారయ్యారు.

నాడు సమాజంలో వున్న పలు అంశాలమీద,పూజా విధానాలమీద బాల్యంనుండి తన తండ్రితో చర్చించేవాడు.ఆ చర్చలద్వారా పలు విషయాలు తెలుసుకుని, నాటికి అనుసరిస్తున్న విధానాలను తప్పు పట్టాడు. వేదాల అధ్యయనం అనవసరం అన్నాడు.

ఒకవేళ అవసరం అనుకుంటే అవి అందరికీ అందుబాటులో వుండాలన్నాడు. ఆధ్యాత్మిక సంపద ప్రజలభాషలో వుండాలన్నాడు. అందుకే ఆయన సంస్కృతం వదిలి కన్నడను తన ఆలోచనలను పంచేందుకు వినియోగించాడు.

భగవంతుడు నిర్గుణరూపుడు. ఆయన ఒక్కరే. పలురకాల రూపాలుగా ఆయన్ని పూజించటం అనవసరం. ఆ నిర్గుణరూపంగా ఒక శిలను స్వీకరించాడు. అది శివలింగరూపం. ఆ నిర్గుణరూపంమీద దృష్టి కలిగివుండండి. దానిని పూజించండి.

భక్తి మార్గమే సరైనది. మీరు అంగీకరించిన ఆ శిలారూపం మెడలో ధరించండి. నిత్యం అది మీ వెంట వుంటుంది. మీరు చేసే ప్రతిపనినీ బాధ్యత వహించాల్సివుంటుందన్న విషయం శిలారూపంలోని ఆ భగవంతుడు హెచ్చరిస్తాడు. ధర్మమార్గం తప్పక నడిపిస్తాడు. దేవాలయాలు అనవసరం.

దైవమే నీ వెంట వుంటాడు. ధర్మమార్గంలో నడిచే ప్రతి మనిషీ దేవుడే అంటూ ఒకకొత్త జీవనమార్గం చూపించాడు.

నాడు హైందవ సమాజంలో వున్న భేదాలన్నింటినీ తొలగించేందుకు ఆయన ఎన్నుకున్న సన్మార్గం అది.

ఆయన బోధనలకు, భాషాభేదాలకు అతీతంగా దక్షిణాది మొత్తం ప్రభావితమయింది. ఎందరో ఆయన మార్గంలో మెడలో లింగధారణ చేశారు. ఆ శివలింగానికి నైవేద్యం తర్వాతే ఏదైనా తీసుకునేవారు. మెడలో రుద్రాక్షమాల, దానికి శివలింగాన్ని కలిగిన ధరిణ ఆయన అనుచరులకు తప్పనిసరి.వాస్తవానికి ఆయన కొత్తగా చెప్పిన మార్గం కాదని, ఒకనాడున్న వీరశైవతత్వాన్నే ఆయన సరికొత్తబాణీలో చెప్పాడు అంటారు పరిశోధకులు.

ఆ సమాజ సంస్కర్త మీద తొలి కవిత్వం చెప్పింది తెలుగువాడే. 17వ శతాబ్దంలో రాయబడిన ఆ గ్రంథమే ఇప్పుడు ఆయన శిష్యులందరూ పఠిస్తుంటారు. కృష్ణానదికి ఉపనది అయిన మాలప్రభ సంగమించే ప్రదేశంలో ఆయన ఎదిగాడు.

చదువుకున్నది అక్కడి దేవాలయంలో. దాదాపు పుష్కరకాలం అధ్యయనం తర్వాతనాడు ఆరాజ్యానికి మంత్రిగా వున్నవ్యక్తికి అల్లుడు అయ్యాడు.ప్రారంభంలో ఆ రాజు ఖజానా లెక్కలు చూశాడు.

మామగారి మరణం తర్వాత తానే మంత్రి అయ్యాడు. అప్పటికే కుల విభేదాలను నిరసించిన ఆయన తన సోదరిని ఆ రాజుగారికిచ్చి వివాహం చేశాడు. తాను నమ్మిన శైవ సిద్ధాంతం ప్రజలలోకితీసుకు వెళ్ళేందుకు శైవసాధువులైన జంగమదేవరలను ప్రోత్సహించాడు.

మహామండపాలలో ఆధ్యాత్మికచర్చలకు సుదూర ప్రాంతాలనుండి పెద్దలు వచ్చేవారు.

ఆధ్యాత్మిక, సామాజిక, ఆర్థిక సంస్కరణల గురించి జరిపిన చర్చలనుండి వెలువడిన పరిష్కార మార్గాలను తన పాలనలో అమలుచేసేవాడు.

కైలాసం చేరటం జీవిత లక్ష్యం కావాలి. అందుకోసం ధర్మమార్గంలో ప్రయాణం చేయాలన్నది ఆయన బోధన. అయితే నేడు ఆ చారిత్రక పురుషుడి పేరున రాజకీయం నడిపే ప్రయత్నం జరుగుతోంది. హిందూసమాజాన్ని సంస్కరించే యత్నం ఆయన చేస్తే ఆయనది అసలు హిందూమతమే కాదని,

ఆయన అనుచరులదంతా భిన్నమైన మతమని, వారిని అల్పసంఖ్యాక వర్గాలవారిగా గుర్తించాలంటూ రాజకీయపార్టీ ఒకటి ప్రయత్నిస్తున్నది.

సంఘసంస్కర్తలు సమాజాన్ని ఏకంచేసేందుకు తమవంతు కృషిని ప్రతి శతాబ్దంలో చేశారుకాని ఇప్పుడు వారి పేరుమీద సమాజం చీల్చే కుట్ర పన్నుతున్నారు. ఇది నిజంగా విచారకరం.

నిన్న మొన్నటివరకు ఆయన బోధనలగురించే కన్నడదేశమంతా గొప్పగా చెప్పుకునేది.

ఇప్పుడు పెట్టిన రాజకీయచిచ్చుతో ఆయన పేరు చిక్కుకోవటం బాధాకరం. ఇంతకీ...

*1. ఆ సంస్కర్త పేరేమిటి?*

*2. ఆయన అనుచరులను ఏమంటారు?*

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇన్‌లాండ్ కవర్‌పై రాసి స్వాతి చిరునామాకు 28 ఏప్రిల్ 2018 తేదీలోగా పంపించండి. కరెక్టు సమాధానాలు రాసినవారిలో లాటరీ పద్ధతిద్వారా ఒకరిని విజేతగా ఎంపిక చేసి ₹ 500/- నగదు బహుమతిని అందజేస్తాం.

13.4.2018 సంచికలో ప్రచురించబడిన 'నేనెవరో తెలుసా!' శీర్షిక సమాధానాలు:
1. కాళోజీ నారాయణరావు,2.మణికొండ
₹ 500/- బహుమతి పొందిన విజేత :
ఎస్.రాజు, ఇంటి నెం. 39-61-28,
బాపూజీ నగర్, పార్కురోడ్
కర్నూలు 518 001

# నిద్రకు, బరువుకు లింకు

నిద్రకూ, బరువుకూ లంకె ఉందా? అంటే ఉందన్నదే సమాధానం. నిద్ర చాలినంత పోకపోతే బరువు పెరుగుతారన్నది నిజం. తక్కువ నిద్ర పోతున్నప్పుడు బరువు పెరగడానికి అనేక కారణాలు దారితీస్తుంటాయి. శరీరం చక్కెర వంటి శక్తిని ఇచ్చే పదార్థాలను కోరుకుంటుంది.

కనుక, అవసరం అయినదానికంటే మించి మెలుకువగా ఉన్నంతసేపూ ఏదో ఒకటి తినేస్తుంటారు. దీనివల్ల బరువు పెరిగిపోతారు.

అంతేకాకుండా జీవక్రియ రేటును ప్రభావితం చేసేటువంటి కొన్ని హార్మోన్‌లను శరీరం విడుదల చేస్తుంటుంది.

ఘ్రెలిన్, లెప్టిన్ హార్మోన్‌లు ఆకలిని, సంతృప్తి కలిగిన భావాన్ని క్రమబద్ధీకరిస్తుంటాయి.

చాలినంత నిద్ర పోనప్పుడు ఈ హార్మోన్‌లు ప్రభావితం అవుతాయి.

శరీరం ఆకలిని ఉద్దీప్తం చేస్తుంది. దీనివలన తక్కువ నిద్రపోయేవాళ్ళు తినాలన్న తమ కోరికను తక్షణం తీర్చుకునేందుకుగాను అనారోగ్యకర పదార్థాలవైపునకు ఆకర్షితులవుతుంటారు.

బరువు పెరగడానికి, ఆహారపు అలవాట్లకు, నిద్రలేమికి నడుమ గల సంబంధాలపై విస్తృత అధ్యయనాలు నిర్వహించారు.

తరచూ తగినంత నిద్రపోకపోతే స్త్రీ, పురుషులు ఇద్దరిలోనూ క్యాలరీల మోతాదు బాగా పెరిగిపోతుందని గుర్తించారు.

## ఎన్ని గంటలు?

ప్రతిరోజూ రాత్రివేళ ఎన్ని గంటలు నిద్రపోవాలి? ఎక్కువమంది పెద్దవారికి ఐదునుంచి ఏడుగంటల సమయం నిద్ర అత్యవసరం అనేది చాలామంది నిపుణుల అభిప్రాయం.

కాని, అనేకమంది ఈ కొద్దిగంటల్ని కూడా ఇతరత్రా కార్యక్రమాలకు కేటాయించి నిద్రని త్యాగం చేస్తుంటారు. నిద్రకు కేటాయించరు.

ఐదుగంటలకంటే తక్కువ నిద్ర, తొమ్మిదిగంటల కంటే ఎక్కువ నిద్ర బరువు పెరగడానికి దారితీస్తాయని అధ్యయనాలు పేర్కొంటున్నాయి.

చక్కగా, చాలినంత నిద్రపోతుంటే అది ఆరోగ్యంపై, బరువుపై అద్భుతాలు చేస్తుంది.

చక్కని నిద్ర తర్వాత శరీరానికి మంచి శక్తి లభిస్తుంది. శరీరం ఎక్కువ క్యాలరీలను ఖర్చు చేయగలదు. ఆరోగ్యవంతమయిన జీవక్రియ రేటు కొవ్వును కరిగిస్తుంది.

రాత్రివేళ ప్రశాంతముగా నిద్రించినప్పుడు మెదడు చురుకుదనం కూడా పెరుగుతుంది. హార్మోన్ స్థాయిలు సమతౌల్యంగా వుంటాయి.

దీనివలన అనవసరమైన చిరుతిండ్లవైపునకు మనస్సు మళ్ళదు. ఆరోగ్యపూరితమయిన ప్రత్యామ్నాయాలపైనే దృష్టి వుంటుంది.

ఆరోగ్యపూరిత ఆహారం తింటూ, ప్రతిరోజూ రాత్రివేళ ఐదునుంచి ఎనిమిదిగంటల మధ్య నిద్రపోయేలా జాగ్రత్త వహిస్తుండాలి.

వీటికి జతగా వ్యాయామాలు కూడా చేస్తుంటే బరువు బెడద ఉండదు.

Courtesy : B+ve

సీరియల్

# వేట

పుట్టగంటి గోపీకృష్ణ



అదే సమయంలో ఒక వ్యక్తి మనాలీలోనిహోటల్లో సి.సి. టి.వి. ఫుటేజ్ సేకరిస్తున్నాడు.

అతను సేకరిస్తున్న ఫుటేజ్‌లో అవినాష్ హోటల్‌లోకి ఎంటరవటం, లాబీలో నడుచుకుంటూ వినోద్‌నాయక్ రూము వైపు వెళ్ళటం, దొంగ కీతో తలుపుతీసి ఆ రూములోకి ప్రవేశించటం, తరువాత హోటల్ ఎంట్రన్స్ దగ్గర వినోద్ నాయక్‌ని కారులో ఎక్కించుకుని తనే డ్రైవ్ చేసుకుంటూ తీసుకెళ్ళటం అన్నీ కూడా రికార్డయ్యాయి.

ఆ తరువాత అతను కూడా కులూ రోడ్డులో ప్రయాణించాడు. కారు లోయలో పడిపోయిన ప్రదేశానికి వచ్చి ఆ పరిసరాలను, లోయలో పడి తగల పడుతున్న కారునూ షూట్ చేశాడు. మొత్తం ఫుటేజ్ తీసుకుని తన గమ్యం వైపు బయలుదేరాడు.

వెంకటేష్ హైదరాబాద్‌లో మీడియం తరహా బిల్డర్. ఇప్పటివరకు పదిహేను నుండి ఇరవై ప్లాటులు ఉండే మూడు వెంచర్లు వేసి తనకు తాను బిగ్ లీగ్ లోకి వచ్చేశాననుకునే బిల్డర్.

అతను రెండేళ్ళ క్రితం మియాపూర్ ఏరియాలో రెండు ఎకరాల స్థలంలో నూట యాభై లగ్జరీ ప్లాట్లు కట్టాలని నిర్ణయించుకున్నాడు. ఆ స్థలానికి సంబంధించిన యజమానులతో పార్ట్‌నర్ షిప్ బేసిస్ మీద ఎగ్రిమెంట్ కుదుర్చుకున్నాడు.

ప్లాన్ అప్రూవ్ చేయించి, బ్రోచర్లు వేయించి, కస్టమర్లను సమీకరించి.. పెద్ద ఎత్తున కన్‌స్ట్రక్షన్ మొదలు పెట్టాడు. అలాంటి సమయంలో అతని దారికి అడ్డు వచ్చాడు బిక్కు.

బిక్కు మియాపూర్ ఏరియాలో లోకల్ గూండా. బిల్డర్ల దగ్గర, చిన్నవ్యాపారుల దగ్గర మామూళ్ళు వసూలు చేస్తూ ఉంటాడు. అందరినీ అడిగినట్లే వెంకటేష్‌ని కూడా మామూలు అడిగాడు బిక్కు.

ఇలాంటి చిన్న చిన్న వ్యవహారాలు త్వరగా సెటిల్ చేసుకోవాలని తెలిసినవాడు వెంకటేష్. అందుకే స్వయంగా బిక్కుతో సమావేశమయ్యాడు. ఇద్దరి మధ్య పది లక్షలకు బేరం కుదిరింది.

అయితే అంత మొత్తం ఒక్కసారి ఇవ్వలేననీ, ఇప్పుడు జరుగుతున్న ప్రాజెక్టు రెండు సంవత్సరాలు నడిచే ప్రాజెక్టు కాబట్టి వారానికి పదివేల చొప్పున ఇస్తానని ఒప్పుకున్నాడు వెంకటేష్. చాలా వారాలు పేమెంట్ రెగ్యులర్‌గా ఇచ్చాడు. అయితే ఒక వారం బిక్కు మనిషి వచ్చిన సమయానికి వెంకటేష్ దగ్గర

5

## జరిగిన కథ

గుజరాత్‌లో బాంబు పేలుళ్ళకు పాల్పడిన ఉగ్రవాదుల బృందం, వారి లీడర్ ఖలీఫాతో పాటు మోరే దగ్గర మయన్మార్ సరిహద్దులు దాటబోతున్నారని ఇంటెలిజెన్స్ రిపోర్ట్ వచ్చే సరికి వారిని వేటాడతాడు అవినాష్.

అక్కడున్న లోకల్ ఎమ్ఎల్ఏ, ఉగ్రవాది ఖలీఫా పారిపోవడానికి సాయపడుతుండగా మొత్తం అందర్నీ కాల్చేస్తాడు. దాంతో తమ ఆర్డర్స్ లక్ష్యపెట్టలేదని కమాండో అధికారిగా వున్నతనని ట్రాన్స్‌ఫర్‌చేస్తారు పైఅధికారులు.

జరిగిన సంఘటనను ధర్మేంద్ర దృష్టికి తీసుకువస్తాడతను. కొన్నివందలమందిని చంపడానికిఅడ్డంవస్తున్నాడని ఓ ఎమ్.ఎల్.ఎ.ని చంపావు. ఇప్పుడు కొన్ని లక్షలమందిని న్యూక్లియర్ బాంబుతో చంపబోయిన ఉగ్రవాదులను నీవు చంపాలంటూ ఓ ఎస్సైన్‌మెంట్‌ని అవినాష్‌కి అప్పగిస్తాడు ధర్మేంద్ర.

అనుమానితులలో వినోద్‌నాయక్ కోసం సెర్చింగ్ మొదలెడతాడు అవినాష్.

వినోద్ నాయక్ మనాలీలోని ఓ రిసార్ట్ లాబీలో వుంటాడు. తన ఇంటికి పోలీసులు వచ్చారని తెలిసి తనెంత ప్రమాదంలో వున్నాడో అర్థంచేసుకుంటాడతను.

వినోద్ నాయక్‌ని కలిసి అతన్ని బెదిరించి న్యూక్లియర్ బాంబ్‌తయారుచేయడంలో మిగిలిన సూత్రధారుల సమాచారం తెలుసు కుని కులు దగ్గర వున్న ఓ లోయలోకి వినోద్‌నాయక్‌ని కారుతో సహా తోసేసి అక్కణ్ణుంచి బైక్‌మీద బయల్దేరతాడు అవినాష్. ఇక చదవండి.



డబ్బు లేకపోయింది. "ఏదో అప్పు ఉన్నట్లు వారం వారం ఏందిబే ఈ లొల్లి. పైసల్లేవ్ ఛల్..." అంటూ వచ్చిన వ్యక్తి మీద విసుక్కున్నాడు వెంకటేష్.

వాడు ఒకటికి నాలుగు చేర్చి బిక్కుకు చెప్పాడు. విషయం తేల్చుకోవటానికి స్వయంగా బిక్కు రంగంలోకి దిగాడు. ఆ రాత్రి వస్తున్నానని వెంకటేష్‌కి ఫోన్ చేశాడు. వెంకటేష్ కూడా ఏదో ఆవేశంలో అరిచాడు తప్ప, బిక్కుతో తగాదా పెట్టుకునే యోచన లేదు. అందుకే, "రా భయ్యా! మందుకొడుతూ మాట్లాడుకుందాం..." అన్నాడు.

బిక్కు వచ్చేటప్పటికి ఇంకా వెంకటేష్ కన్‌స్ట్రక్షన్ జరుగుతున్న సైట్ దగ్గరే ఉన్నాడు. అంత పెద్ద భవనానికి కావలసిన భారీ పిల్లర్లకు అవసరమైన ఇనుప చువ్వలు గుంటల్లో రెడీ అయ్యాయి. కాంక్రీట్ మిక్స్ చేసి ఆ గుంటల్లోపొయ్యటమే మిగిలి ఉంది. ఆ పని మరుసటిరోజుకు పెట్టుకున్నారు.

లేబర్‌అందరికీ పేమెంట్ ఇచ్చి పంపించేటప్పటికి రాత్రి తొమ్మిదయింది.

ఆఖరుగా మొబైల్ కాంక్రీట్ బ్యాచ్ మిక్సింగ్ యూనిట్ అతను వచ్చి నిలబడ్డాడు.

"ఏమిటి?" చేతులు కట్టుకుని నిలబడిన అతని వైపు చూసి అడిగాడు వెంకటేష్.

"కొద్దిగా అడ్వాన్స్ ఇస్తే..."

టేబుల్ సొరుగు లాగి చూశాడు వెంకటేష్. వంద రూపాయల కట్ట ఒకటే ఉంది. అది వీడికి ఇస్తే మళ్ళీ బిక్కుకు ఇవ్వటానికి ఏమీ ఉండవు.

"ఇవాళ్టికి సర్దుకో. రేపు ఇస్తాను..."

"పోనీ ఒక వెయ్యి ఇవ్వన్నా, కొద్దిగా అవసరం ఉంది" అతన్ని సరిగ్గా చూసుకోకపోతే రేపు పనికి ఇబ్బంది అవుతుంది. అందుకే మొండిగా కుదరదు అని చెప్పలేకపోయాడు.

"కాసేపు ఆగు. ఎలాగోలా ఎడ్జస్ట్ చేసి ఇస్తాను" అని అతనికి చెప్పి, తన ఆఫీసు రూములోకి నడిచాడతను. టెంపరరీగా సిమెంట్ ఇటుకలు పెట్టి ఒక ఆఫీసు రూములాంటిది సైటులో కట్టారు.

దాంట్లో ఒక చిన్న టేబుల్, దానిమీద ఒక సీసా, గ్లాసులు ఉన్నాయి. టేబుల్‌కి అటూ ఇటూ రెండు చైర్లు వేసి ఉన్నాయి.

ఇంతలో బయట జీపు ఆగిన శబ్దం వినిపించింది. కిటికీలోనుండి బయటకు చూస్తే, బిక్కు జీపు దిగి వస్తూ కనిపించాడు. వస్తోంది మందు కొట్టటానికి కాబట్టి పక్కన అనుచరులు ఎవరూ లేరు.

ఇద్దరూ కూర్చున్నాక మందు సీసా ఓపెన్ చేశాడు వెంకటేష్. చెరో రెండు పెగ్గులు పూర్తిచేసేదాకా ఎవరూ అసలు విషయం మాట్లాడుకోలేదు. ఏదో పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు.

కొద్దిగా మందు మత్తు ఎక్కాక, "ఏంది భయ్! మావాడిని భయపెట్టినావంటనే" అన్నాడు బిక్కు.

"ఏదో టెన్షన్లో ఉండి అన్నాలే! ఏమీ అనుకోకు" సర్ది చెప్తూ అన్నాడు వెంకటేష్.

"ఎంత టెన్షన్లో ఉంటే మాత్రం నా ఇజ్జత్ కూడా చూడాలిగా... నోటికి వచ్చింది వాగితేఎట్ట?"

"ఏం చెయ్యమంటావ్ భాయ్. తెల్లారి పిల్లర్లు పోసే పని పెట్టుకున్నాను.

అడ్వాన్స్ కోసం కాంక్రీట్ కుర్రాడు బయట నిలబడి ఉన్నాడు. వాడికి ఇవ్వటానికి జేబులో వెయ్యి లేదు. నా బాధల సంగతి నీకేం తెలుసు?"

"కొంపతీసి ఇప్పుడు నాకు ఇవ్వటానికి డబ్బుల్లేవంటావా ఏంటి?" అన్నాడు బిక్కు.

"అదేం లేదులే..." అంటూ టేబుల్ సొరుగునుండి పదివేల కట్ట ఒకటి తీసి బిక్కూకి ఇచ్చాడు.

దానితో సంతృప్తి చెందాడు బిక్కు. లేచి బయటకు నడిచాడు. తను కూడా అతనితో నడుస్తూ బయటకు వచ్చాడు వెంకటేష్.

దారిలో పిల్లర్లు పోయటానికి లోతుగా తవ్విన గుంతలను దగ్గరకు వెళ్ళి చూస్తూ, "పిల్లర్లు పోసేది రేపేనా?" అన్నాడు బిక్కు. లూజుగా ఉన్న మట్టి కాళ్ళకింద నుండి జారుతోంది.

"మరీ దగ్గరకు వెళ్ళకు. ప్రమాదం..." అని వెంకటేష్ అంటూనే ఉన్నాడు. ఇంతలో జర్రున జారి గుంటలో పడిపోయాడు బిక్కు.

"అరెరె..." అంటూ గుంట చివరకు వచ్చి, 'బిక్కు, బిక్కూ..." అంటూ పిలిచాడు.

కింద గుంటలో పడిన బిక్కు నుండి సమాధానం రాలేదు. అతను లేచి నిలబడే ప్రయత్నం కూడా చెయ్యటం లేదు. కాంక్రీట్ మిక్సింగ్ కుర్రాడు జరిగింది చూసినట్లున్నాడు. బ్యాటరీ లైట్ తీసుకుని వచ్చాడు.

గుంటలోని బిక్కుమీదకి బ్యాటరీ లైట్ వేసి చూశారు. కింద పడిన బిక్కు మెడలో నుండి బయటకు పొడుచుకువచ్చిన ఇనుపచువ్వ ఎర్రగా కనిపించింది. అతని ప్రాణం పోయిందన్నట్లు అప్పటిదాకా కొట్టుకుంటున్న అతని శరీరం చలనం లేకుండా ఆగిపోయింది.

వెంకటేష్ స్థాణువులా నిలబడిపోయాడు. కొన్ని క్షణాలు ఏం చేయాలో అర్థం కాలేదు. నెమ్మదిగా



## పక్కా ప్రణాళికతో

హీరోయిన్ స్థాయి శాశ్వతం కాదన్న వాస్తవాన్ని బాగా జీర్ణించుకున్న తారలు అనేకమంది తమ స్థాయి తగ్గకుండా ఇతరత్రా వ్యాపారాలు చేయడాన్ని కొనసాగిస్తున్నారు.

తాము కాచి వడపోసిన చిత్రరంగం అయితే మరింత సేఫ్ అనుకునేవారూ లేకపోలేదు. ఇప్పుడదే ఆలోచనలో పడింది దీపికా పడుకొనె. కొత్తగా ఓ నిర్మాణసంస్థను ప్రారంభించాలని భావిస్తున్నది.

"నిర్మాణ సంస్థను స్థాపించాలన్న ఆసక్తి వుంది. ఓసారి మొదలుపెట్టేశాక చాలా జాగ్రత్తలు తీసుకోవాల్సివుంటుంది. నేను నటించే సినిమాల్లో నా విజన్‌ను చూపించే అవకాశం వుండదు.

అదే నేను నిర్మించే సినిమాలకు నా దృష్టిని తెరపై చూపే అవకాశం వుంటుంది. అందుకే పూర్తి ప్రణాళికతో నిర్మాతగా మారుతున్నాను" అని తెలిపింది దీపికా పడుకొనె.

తేరుకుని "ఇదేంట్రా, ఇలా జరిగింది?" అన్నాడు పక్కన ఉన్న కుర్రాడితో.

వాడేం మాట్లాడలేదు.

తల పట్టుకుని కూలబడిపోయాడు వెంకటేష్. "ఇక్కడ వాడిని చూసి వాడంతట వాడు చచ్చాడన్నా ఎవరూ నమ్మరుకదరా! నేనే చంపాననుకుంటారు"

"పోలీసులయితే ముందు నిన్నే లోపల వేస్తారు" మరింత భయపెడ్తూ అన్నాడు కాంక్రీట్ కుర్రాడు.

పోలీసులను తలచుకోగానే వెన్నులో నుండి వణుకు వచ్చింది వెంకటేష్‌కి. ఇది మర్డర్ కాకపోయినా, దీనిని మర్డర్ కింద చూపించి తన దగ్గర నుండి లక్షలు వసూలు చేస్తారు.

"శవాన్ని ఎత్తి కాంక్రీట్ మిక్సర్‌లో వెయ్యన్నా. ఎవడికీ తెలియదు" సలహా చెప్పాడు కుర్రాడు.

"వాడి అనుచరులు ఊరుకుంటారట్రా?" అన్నాడు వెంకటేష్.

"చూసినవాళ్ళు ఎవరూ లేరుకదన్నా. జీపుతీసుకెళ్ళి దూరంగా వదిలేద్దాం. అసలు వాడు పోయాక కొసరు వాళ్ళకి భయపడేది ఏముంటుంది?" అన్నాడు బిక్కు.

"అంతేనంటావా?"

"భయపడకన్నా! నేను నీ పక్కన ఉంటాను. నన్ను నువ్వు చూసుకో..."

"నువ్వు ఈ సాయం చెయ్యరా. ఇక నుండి నిన్ను నేనే ఉద్యోగంలో పెట్టుకుంటాను. నీకు ఏ బాధా లేకుండా నేను చూసుకుంటాను"

ఆ తరువాత ఇద్దరూ కలిసి అతి కష్టంమీద గుంటలోనుండి బిక్కుని బయటకుతీశారు. ఆ శవాన్ని నెమ్మదిగా పైకిచేర్చి కాంక్రీట్‌బ్యాచ్ మిక్సర్‌లో వేశారు. అంత టెన్షన్లోనూ శవం జేబులోని పదివేలు వెనక్కి తీసుకోవటం మరచిపోలేదు వెంకటేష్.

"ఉదయాన్నే కాంక్రీట్ కలుపుతాం. ఈ శవం అందులో కలిసిపోతుంది. తరువాత పిల్లర్లలోకి వెళ్ళిపోతుంది. ఎవడికీ అనుమానం రాదు. శవంలేదు కాబట్టి పోలీసులు కూడా ఏమీ చెయ్యలేరు" అని బ్యాచ్ మిక్సింగ్ వాడు చెప్పిన మాటలు నిజమే అనిపించాయి వెంకటేష్‌కి.

ఆ తరువాత సైట్ ఎదురుగా ఉన్న జీపును తీసుకెళ్ళి ఊరు బయట ఒక పక్కకు తీసి ఆపి వెనక్కి వచ్చేశారు. ఎవరికీ అనుమానం రాకుండా మరుసటి రోజు బిక్కు శవం కాంక్రీటులో కలిసిపోయింది.

బిక్కు అనుచరులు కూడా వెంకటేష్‌కి బిక్కుకి హాని చేసే ధైర్యం ఉందని అనుకోకపోవటంతో అతని మీద ఎక్కువ అనుమానం రాలేదు.

బిక్కు రైవల్ గ్రూపుకు చెందినవారు అవకాశం చూసి బిక్కుని కిడ్నాప్ చేసి ఉంటారని అతని అనుచరులు అనుకున్నారు.

బిక్కు భార్య పోలీసులకు ఫిర్యాదు చేసింది. ఎవరి మీదయినా అనుమానం ఉందా? అని అడిగారు పోలీసులు. బిక్కు రైవల్ గ్రూపు పేరు చెప్పింది ఆమె. వాళ్ళు పోలీసులకు ఎలానూ దొరకరు.

ఎంక్వయిరీలో భాగంగా ఒకటి రెండుసార్లు పోలీసులు వెంకటేష్ దగ్గరకు కూడా వచ్చారు. ఆ రోజు రాత్రి తామిద్దరం కలిసి మందు కొట్టిన మాట నిజమే కానీ, తరువాత అతను ఎటు వెళ్ళాడో తనకు తెలియదని పోలీసులకు చెప్పాడు వెంకటేష్.

నెమ్మదిగా ఆ గొడవ మరుగునపడిపోయింది. కాంక్రీట్ బ్యాచ్ మిక్సర్ కుర్రాడు ఇప్పుడు ఆ ఉద్యోగం మానేసి వెంకటేష్ దగ్గర సెటిలయ్యాడు.

అతన్ని వెంకటేష్ బాగానే చూసుకుంటున్నాడు.

అలా పెద్ద ప్రమాదం తప్పిందని వెంకటేష్ రిలాక్సవబోతుంటే ఒకరోజు పోస్టులో అతనికి ఒక కవర్ వచ్చింది. దాంట్లో ఒక డి.వి.డి ఉంది.

దానితోపాటు ఎలాంటి లెటరూ లేదు. డి.వి.డి మీద 'జస్ట్ ప్లే' అని రాసి ఉంది.

దానిని లాప్‌టాప్‌లో పెట్టి ప్లేచేశాడు వెంకటేష్.

ఆ రోజు గుంటలో పడి చనిపోయిన బిక్కు శవాన్ని బయటకు తియ్యటం, దాన్ని కాంక్రీట్ బ్యాచ్ మిక్సర్లో వెయ్యటం, రోడ్డుమీద జీపును డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళి ఊరు బయట వదిలిరావటం... అన్నీ స్పష్టంగా రికార్డయి ఉన్నాయి.

తాను చూస్తోంది కలో, నిజమో అర్థం కానట్లు బిగుసుకుపోయాడు అతను.

ఆ వీడియో ఎవరు తీశారో, ఎలా తీశారో తెలియలేదు. కనీసం ఎందుకు తీశారో కూడా తెలియలేదు. డబ్బు డిమాండ్ చేస్తూ లెటర్‌వస్తుందేమో అని కొన్ని రోజులు ఎదురుచూశాడు.

కానీ ఎలాంటి లెటరూ రాలేదు.

అతని టెన్షన్ పీక్‌కు చేరుకుంటున్న దశలో ఒక ఫోన్ వచ్చింది. "డి.వి.డి. క్వాలిటీ బాగుందా?" అని అడిగాడు ఫోన్ చేసిన వ్యక్తి.

"ఎవరు నువ్వు?" భయాన్ని అణచుకుంటూ అడిగాడు వెంకటేష్.

"అది తప్పు ప్రశ్న. నీకు ఏం కావాలి? అని అడగాలి..." నవ్వుతూ అంది అవతలి కంఠం.

"నువ్వు చెప్పినట్లు నేను ఎందుకు చేయాలి? నేను ఎవరినీ మర్డర్ చేయలేదు. ఆ రోజు జరిగింది చిన్న యాక్సిడెంట్"

"కానీ... పోయింది మనిషి ప్రాణం. అది నిజంగా యాక్సిడెంట్ అయితే అంత రిస్క్ తీసుకుని శవాన్ని ఎందుకు మాయం చేశావ్? ఎంక్వయిరీలో పోలీసులకు అబద్ధాలు ఎందుకు చెప్పావ్?"



మేం చైనాతో వాణిజ్య యుద్ధం చెయ్యటంలేదు... గతంలోనే మా పాలకుల చేతకానితనంవల్ల ఆ యుద్ధంలో ఓడిపోయాం.' -డొనాల్డ్ ట్రంప్, అమెరికా అధ్యక్షుడు

"సరే...! ఇవన్నీ అనవసరం. నీకు ఎంత కావాలో చెప్పు. ఇవ్వగలిగిన ఎమౌంట్ అయితే ఇస్తాను. ఇవ్వ లేకపోతే జైలుకు పోయి కూర్చుంటాను"

"నువ్వు ఏమీ ఇవ్వనవరం లేదు. ఒక చిన్న పని చేసిపెడితే చాలు"

"ఏం పని?"

"అవసరమయినపుడు చెప్తాను. నువ్వు చేయగలిగిన పనేలే. భయపడకు" అంటుండగా అటువైపు లైన్ కట్ అయింది.

తరువాత అతనికి మరికొన్ని కన్‌స్ట్రక్షన్స్‌వచ్చాయి. ఒక ఇంగ్లీష్ పేపర్ పేరు చెప్పి దానిలోని ఆదివారం ఎడిషన్‌లో ప్రతివారం ఒక ప్రకటన కోసం చూడమన్నారు. అతనికి ఒక నాలుగంకెల కోడ్ ఇచ్చారు. పాతకార్లు అమ్మబడును అని వేసే ఆ ప్రకటనలో అతనికి ఇచ్చిన కోడ్ కనపడిన మరుక్షణం అతను ప్రకటనలోని ఫోన్ నెంబరును సంప్రదించాలి.

వెంకటేష్ ఆ పని ఏదో తెలుసుకుని, వాళ్ళు అడిగినవిధంగా చేస్తే, త్వరగా ఈ పీడకల నుండి బయటపడవచ్చనుకునేవాడు. కానీ ఎన్ని రోజులు ఎదురుచూసినా ఆ పని ఏంటో ఎవరూచెప్పలేదు.

ఇదేమైనా ప్రాక్టికల్ జోకేమో అని అతను అనుకోబోతుంటే, ఎట్టకేలకు ఒక ఆదివారం ఇంగ్లీష్‌పేపర్లో అతనికి కావలసిన ప్రకటన పడింది.

వెంటనే అతను ప్రకటనలో ఇచ్చిన ఫోన్ నెంబరును సంప్రదించాడు. అక్కడ నుండి అందిన సూచనల ప్రకారం బేగం బజారులో షాపుకు వెళ్ళాడు.

అతని చేతికి ఆ షాపులో ఒక కవర్ దొరికింది. దాంట్లో అతను చేయవలసిన పనివివరాలు ఉన్నాయి. జాగ్రత్తగా దాచిపెట్టిన ఒక వస్తువును ఢిల్లీలోని ఒక అడ్రసుకు చేర్చాలి.

అంతే అతను చేయవలసింది. అతనికి అందిన కవరులో లెటరుతోపాటు ఒక బ్యాంకు లాకర్ కీ కూడా ఉంది. అది హైదరాబాద్‌లోని ఒక ప్రైవేట్ బ్యాంకు లాకర్ కీ.

అంత చిన్నపనికి అంత బిల్డప్ ఎందుకో వెంకటేష్‌కి అర్థం కాలేదు. బహుశా ఆ ప్యాకెట్లో ఏ డ్రగ్సో ఉండి ఉంటాయనుకున్నాడు వెంకటేష్. అయినా భయపడి ఉపయోగం లేదు కాబట్టి, ఆ కీ తీసుకుని బ్యాంకుకు వెళ్ళి లాకర్‌లోని ప్యాకెట్ తీసుకున్నాడు. అయితే అతను ఊహించినదానికంటే చాలా చిన్న ప్యాకెట్ అది. బరువు మాత్రం బానే ఉంది.

దాన్ని తీసుకుని ఢిల్లీ చేరుకున్నాడు. తరువాత చేరుకోమన్న సమయానికి ఆ వస్తువును తీసుకుని వినోద్ నాయక్ సెంట్ హౌస్ చేరుకున్నాడు. అక్కడ తనలా మరో నలుగురు కూడా అదేరోజు వేరేవేరే సామాను తీసుకువచ్చారు. వాటన్నిటినీ వినోద్ నాయక్ అసెంబుల్ చేస్తుంటే తెలిసింది అది ఒక న్యూక్లియర్ బాంబ్ అని.

దాన్ని అసెంబుల్ చేసిన వినోద్ నాయక్ తెల్లవారుజాము నాలుగింటికి పేలేలా అమర్చి అందరినీ ఎవరిదారిన వారిని వెళ్ళిపొమ్మన్నాడు.

ముందు ఢిల్లీనుండి బయటపడాలి కాబట్టి, వెంకటేష్ ఒక ట్యాక్సీ మాట్లాడుకుని ఢిల్లీ నుండి ఆగ్రా చేరుకున్నాడు. అక్కడ హైదరాబాద్ వెళ్ళే ట్రెన్ ఎక్కి కూర్చున్నాడు.

అయితే అతను ఊహించిన పేలుడు ఎన్నటికీ జరగలేదు. దానితో అతనికి ఇదంతా ఒక ప్రాక్టికల్ జోక్ అన్న భావం పెరిగిపోయింది. వెంకటేష్ ఎక్కిన ట్రెన్ హైదరాబాద్‌లో ఆగే సమయానికి అవినాష్ హైదరాబాద్ విమానం ఎక్కుతున్నాడు.

లక్ష్మి ఎస్సైగా చేరి ఆరునెలలయింది.

చిన్నప్పట్నుంచి సినిమాల్లో హీరోలు వేసే పోలీసు క్యారెక్టర్లు చూసి, తను కూడా అలా వీరోచితంగా విలన్ల భరతం పట్టాలని డిసైడయింది ఆమె.

ఆమె అదృష్టం కొద్దీ ఎస్సై పోస్టు సంపాదించటం వరకు అనుకున్నది సాధించగలిగింది. ఆ తరువాత ఉద్యోగంలో ఎదురయిన అనుభవాలు చాలా రొటీన్‌గా, నిరాసక్తంగా ఉన్నాయి.

రాజకీయనాయకులకు సెక్యూరిటీ ఇవ్వటం, పబ్లిక్ మీటింగుల దగ్గర క్రౌడ్ కంట్రోల్ చెయ్యటం తప్ప ఆమె గొప్ప పనులేం చేయలేదు.

ఖాళీగా ఉన్నపుడు ఆ స్టేషన్లో అపరిష్కృతంగా ఉన్న కేసుల ఫైళ్ళను ముందేసుకుని చదువుతూ ఉండేది. వాటిలో ఆమెను ఆకర్షించింది బిక్కు కేసు.

ఘటన జరిగి ఇన్ని రోజులయినా ఏ మాత్రం క్లూ దొరకకపోవటం, కనీసం శవం ఆచూకీ కూడా తెలియకపోవటం ఆమెలో కుతూహలాన్ని కలిగించింది. ఆ ఫైలులో ఉన్న వివరాలనుబట్టి బిక్కు కనిపించకుండాపోయిన ముందు రాత్రి వెంకటేష్ అనే బిల్డర్ని కలుసుకున్నాడు. ఆ వెంకటేష్‌ని పోలీసులు సరిగ్గా విచారించలేదని ఆమెకు అనిపించింది.

డ్యూటీ లేకుండా ఖాళీగా ఉన్న సమయంలో ఒకసారి ఆ వెంకటేష్‌ని కలిసి ఆ రోజు ఏం జరిగిందో మరోసారి విచారించాలని అనుకుంది ఆమె.

వినోద్ నాయక్ చెప్పిన వివరాలను బట్టి తనకు కావలసిన వ్యక్తి హైదరాబాద్ నగరానికి చెందినవాడని అర్థం చేసుకున్నాడు అవినాష్. రాష్ట్రం విడిపోవటం వలన రియల్ ఎస్టేట్ దెబ్బ తిన్న నగరం అంటే హైదరాబాద్ అని తెలుసుకోవటానికి పెద్ద తెలివితేటలు అవసరం లేకపోయాయి.

నగరంలో దిగటంతోనే గూగుల్‌మ్యాపులో ఐనాక్స్ మల్టీప్లెక్సులు ఎక్కడ ఉన్నాయో వెతికాడు.

సిటీ సెంటర్లో ఉన్న వాటిని వదిలి కొద్దిగా బయట ఉన్న మల్టీప్లెక్సులకు దగ్గర్లో ఏవైనా మల్టీ స్పెషాలిటీ హాస్పిటల్ ఉందేమో చూశాడు.

రెండూ కొద్ది దూరంలో పక్కపక్కన ఉన్న ఒక ఏరియా కనిపించింది.

అక్కడకు చేరుకుని కన్‌స్ట్రక్షన్‌లో ఉన్న అపార్ట్‌మెంటు బిల్డింగులను వెతికాడు.

**ఇతరులకు చేసిన మంచి కొంచెమైనా సరే, అది మన అంతర్గతశక్తిని మేల్కొలుపుతుంది. కనీసం పరుల హితాన్ని తలచినా అది క్రమంగా సింహసదృశమైన బలంతో నింపుతుంది.**



## చదువుకోవడానికే

సినిమాలకోసం చదువును పక్కనపెట్టేసేవారే ఎక్కువగా తారసపడుతుంటారు కాని, నివేదా థామస్ మాత్రం చదువుకోసం సినిమాలను పక్కన పెట్టేసింది. 'నిన్ను కోరి'లో నటనకు మంచి మార్కులు పొంది, 'జై లవకుశ'లో అలరించిన నివేద ఈ ఏడాదిగా ఒక్క సినిమాకు కూడా సంతకాలు చెయ్యలేదు.

ఇందుకు కారణం చదువు పూర్తిచేయడం కోసమేనని చెప్తోంది. "నా తదుపరి సినిమా ఏంటని అందరూ అడుగుతున్నారు. త్వరలోనే చెప్తా.

'జై లవకుశ' తర్వాత నా గ్రాడ్యుయేషన్ చివరి సెమిస్టర్ పూర్తిచేశాను. ఈ విరామంలో చాలా స్క్రిప్ట్‌లు చదివాను. త్వరలోనే వివరాలు చెప్తా" అంటున్న మలయాళీ కుట్టి చెన్నై ఎస్ఆర్ఎమ్‌లో ఆర్కిటెక్చర్‌లో గ్రాడ్యుయేషన్ చేసింది.

అలాంటి సైట్ కనిపిస్తే దాని దగ్గరకు నడిచి వాచ్‌మాన్‌ను, "మీ సేట్ ఉన్నాడా?" అని అడిగేవాడు.

"సేటంటే?" అని ఎదురుప్రశ్న వచ్చేది.

"ఆయన పేరు మరచిపోయాను. బుగ్గమీద నల్లమచ్చ ఉంటుంది చూడూ... ఆయన" అని సమాధానం కోసం చూసేవాడు.

"అలాంటి సేటు ఎవరూ లేరు..." అని సమాధానం వస్తే మరొక సైటు దగ్గరకు వెళ్తున్నాడు.

చివరకు ఒక సైటు దగ్గర ఉన్న వాచ్‌మాన్, "ఎవరు వెంకటేష్ సారా?" అన్నాడు.

"అవును" ఠక్కున చెప్పాడు అవినాష్.

"సార్ ఏదో ఊరు పోయి వచ్చిండు. రాత్రికి వస్తడు..." చెప్పాడతను.

"రాత్రికి అంటే, ఎన్నింటికి వస్తాడు?"

"ఏడు, ఏడున్నరకు వస్తడు. పదింటిదాకా ఉంటడు..." అన్నాడు అవినాష్.

"సార్ ఇల్లెక్కడ?"

శ్రీనగర్ కాలనీలో ఉన్న వెంకటేష్ ఇంటి అడ్రస్ ఇచ్చాడు ఆ వాచ్‌మాన్.

కాసేపు ఆలోచించాడు అవినాష్.

వెంకటేష్ ఇంటికి వెళ్ళటంకంటే సైటు దగ్గరయితేనే తను అనుకున్న పని చేయటానికి అనువుగా ఉంటుందని నిర్ణయించుకున్నాడు.

బయట తిరిగి, రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో తిరిగి సైటు దగ్గరకు వచ్చాడు అవినాష్. ఆఫీసు రూమ్‌లో లైటు వెలుగుతోంది. దానిముందు రెండు మూడు బైకులు ఆపి ఉన్నాయి.

అందరూ వెళ్ళిపోయే వరకు వేచి ఉండటంతప్ప తను చేయగలిగింది ఏమీ లేకపోవటంతో చీకట్లో నిలబడి ఉన్నాడు అవినాష్.

"ఏయ్! ఇక్కడ ఏం చేస్తున్నావ్?" అన్న అదిలింపువినబడి ఆలోచనల్లోనుండి బయటకువచ్చాడుఅతను.

ఆ మాట వినిపించిన వైపు చూస్తే అందంగా ఉన్న ఒక అమ్మాయి కనిపించింది. అప్పుడే తను కూడా తన మొదటి కేసు ప్రైవేటు పరిశోధన కోసం అటుగా వచ్చింది లక్ష్మి.




"ఏం? ఇక్కడ నిలబడకూడదా?" ఆ అమ్మాయి పోలీస్‌డిపార్ట్‌మెంటని తెలియక అన్నాడు అవినాష్.

"ఏం పనిమీద నిలబడ్డావని అడుగుతున్నాను" అంది లక్ష్మి.

"నీకెందుకమ్మాయ్. నీ దారిన నువ్వు వుళ్ళు..." ఇదెక్కడి గోల అన్నట్లు విసుగ్గా అన్నాడు అవినాష్.

"ఇదే నా దారి. నేనెవరనుకుంటున్నావ్? పోలీస్" పోకిరిలోమహేష్‌బాబులా అంది.

"నేన్నమ్మను"

"ఇదుగో నా ఐడీ..." అంటూ తన ఐడి తీసి చూపించింది.

"అవునా..." అంటూ ఆశ్చర్యపోయినట్లు అన్నాడు అవినాష్.

"అయితే నీదీ నాదీ ఒకటే కులం. నేనూ పోలీసునే" అని అన్నాడు.

"ఏ స్టేషన్?"

"ఈ ఊరు కాదు. ఢిల్లీ..." తను కూడా తన ఐడీని చూపిస్తూ అన్నాడు అవినాష్.

ఆ ఐడీని జాగ్రత్తగా పరిశీలించి వెనక్కి ఇచ్చింది లక్ష్మి.

"అక్కడనుండి ఇక్కడకు ఎందుకు వచ్చావ్?" అని అడిగింది లక్ష్మి.

"ఎంక్వయిరీ కోసం. వెంకటేష్ అనే అతనితో మాట్లాడాలి. సమయం కోసం చూస్తూ ఇక్కడ ఉన్నాను. మరి నువ్వు?"

"నేనూ అతని కోసమే వచ్చాను. ఒక మర్డర్ కేసు ఎంక్వయిరీ చెయ్యాలి. అది సరే కానీ, ఢిల్లీ నుండి అతని కోసం వచ్చేటంత నేరం ఏం చేశాడబ్బా?"

"దేశ ద్రోహం"

"అవునా? వీడికంత సీనుందా?" వాళ్ళమాటల మధ్య వెంకటేష్ ఆఫీసుదగ్గర హడావుడి తగ్గింది.

"ముందు నువ్వు వెళ్ళి నీ ఎంక్వయిరీ కంప్లీట్ చేసుకో" ఆఫరిచ్చాడు అవినాష్.

"దూరంనుండి వచ్చావ్. ముందు నువ్వే వెళ్ళు" అంది లక్ష్మి.

"లేడీస్ ఫస్ట్. ముందు నువ్వే వెళ్ళు"

"సరే, అయితే.... నేనే వెళ్తాను" అంటూ వెంకటేష్ ఆఫీసువైపు నడిచింది. ఒక పావు గంట తర్వాత వెనక్కి వచ్చింది.

"ఎనీ గుడ్‌న్యూస్?" అడిగాడు అవినాష్.

"అస్సలు ఒప్పుకోలేదు. ఆ హత్యకీ తనకీ సంబంధం లేదంటున్నాడు"

"వాడు అలా అనక ఎలా అంటాడు. మరి నువ్వేం చెయ్యాలనుకుంటున్నావ్?"

"మళ్ళీ రేపు వస్తాను. వాడు ఒప్పుకునేదాకా రోజూ వస్తాను" అంటూ అతనికి బై చెప్పి వెళ్ళిపోయింది లక్ష్మి.






ఆమె వెళ్తున్నవైపు దీర్ఘంగా చూసి, వెంకటేష్ ఆఫీసు లోపలకు నడిచాడు అవినాష్.

వినోద్ నాయక్ చెప్పినట్లు వెంకటేష్‌ని దూరం నుండి చూసినా అతని బుగ్గమీద ఉన్న నల్లమచ్చ కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది.

"ఏం కావాలి?" నమ్రతగా అడిగాడు వెంకటేష్అవినాష్‌ని చూసి. ఫ్లాట్ కొనటానికి వచ్చి ఉంటాడని అనుకున్నాడతను. అతని ప్రశ్నకు సమాధానం చెప్పకుండా, "రెండు టీ తెప్పిస్తారా?" అని అడిగాడు అవినాష్.

ఇంకా ఉంది



నేను నడిచిన దారివల్ల నన్ను చాలామంది అసహ్యించుకున్నారు... ఆ దారిలో నా పిల్లలు వెళ్ళకూడదన్నది నా కోరిక.
-సన్నీలియోన్, నటి

Whats App

దయచేసి దీనిని మీ ఇంట్లో ప్రాక్టీస్ చేయకండి. ఇది కేవలం ప్రొఫెషనల్స్ మాత్రమే చేయగలరు.

మీరు భర్త అయితే,
మీ పెంపుడు కుక్కను ఒక గదిలో, మీ భార్యను వేరే గదిలో పెట్టి తాళం వేయండి.
మూడు గంటలతరువాత తలుపు తీయండి.
కుక్క మిమ్మల్ని చూడగానే విపరీతంగా తోక వూపుతుంది, సంతోషం పట్టలేక.
భార్య మాత్రం మిమ్మల్ని దాదాపు చంపినంత పని చేస్తుంది.

భార్య కంటికొసల్లోని కన్నీటిచుక్కను వేలితో తీసి, సముద్రంలోకి విసిరి ప్రేమగా చెప్పాడు భర్త- "ఈ కన్నీటి చుక్కను సముద్రం నుండి ఎప్పటివరకు వెదికి పట్టుకోలేవో అంతవరకు"

వింటున్న సముద్రుడికి కూడా కన్నీరు వచ్చేసింది. ఏడుస్తూ బిగ్గరగా అన్నాడు-
"ఎక్కడనుండి వస్తాయిరా, ఇలాంటి ఆలోచనలు మీకు, పెళ్ళాలకు సోపురాసి, పెయింట్ కొట్టే మీ ఐడియాలకో నమస్కారంరా బాబోయ్!"

ఓ అరవై ఏళ్ళ సినీనటి, టీ షర్ట్ వేసుకొని బీచ్‌లో నడుస్తోంది. ఆమె టీ షర్ట్ వెనకాల ఇలా రాసివుంది-
"నా వయస్సు 16, నా అనుభవం 44 ఏళ్ళు"

నేడు టీవీలలో సీరియల్స్ చూసి ఏడ్చే ఆడవాళ్ళ కంటే తమ పెళ్ళి వీడియో చూసి ఏడ్చే మగవాళ్ళు ఎక్కువయ్యారు సమాజంలో.



మీరు భార్య అయితే,
మీ భర్తను ఒక గదిలో, కుక్కను ఓ గదిలో పెట్టి తాళం వేయండి.
మూడుగంటలతర్వాత తాళం తీయండి.
కుక్క మిమ్మల్ని చూడగానే విపరీతంగా తోక ఊపుతూ దగ్గరకొస్తుంది, సంతోషం పట్టలేక.
కానీ, భర్త...?
ఎన్నడూ లేనంత హాయిగా, నిశ్చింతగా, ప్రశాంతంగా... నిద్రపోతూవుంటాడు.

బందరు బీచ్‌లో భార్యాభర్తలు కూర్చొనివున్నారు. భార్య మనసులో పాత జ్ఞాపకాలు మెదిలి, భర్తను ఆరాధనగా చూస్తూ అడిగింది-
"ఏవండీ! ఎంత కాలంవరకు నన్ను ఇలా ప్రేమిస్తూనేవుంటారు?" అని.

భార్య : "ఏమండీ, నేను మీ మనసులో ఉండిపోతానండీ, ఎప్పటికీ!"
భర్త: అలాగే ఉండు, కానీ అక్కడ వేరే ఆడవాళ్ళు కూడా ఉన్నారు. వాళ్ళతో గొడవపడకు.

కాలేజీ జీవితం జియో సిమ్‌లాంటిది. లోకమంతా మన చేతిలోనే ఉంటుంది.
బ్రహ్మచారి జీవితం ఎయిర్‌టెల్‌లాంటిది. ఇంత స్వేచ్ఛ ఎక్కడా ఉండదు.
ఎంగేజ్‌మెంట్‌కు ముందు జీవితం ఐడియాలాంటిది. జీవితాన్నే మార్చేస్తుంది.
పెళ్ళయ్యాక వొడా ఫోన్, ఎక్కడికి వెళ్ళినా నెట్‌వర్క్ ఫాలో అవుతుంది.
పిల్లలు పుట్టాక బిఎస్ఎన్ఎల్ లాంటిది, అన్ని లైన్లు బిజీగా ఉంటాయి.

బార్బర్ మనోజ్‌కుమార్ మంత్రులకు, ప్రధానికి హెయిర్‌కట్ చేయటానికి నియమించబడ్డాడు. ఒకరోజు పొద్దున-
ఆర్థికమంత్రి జైట్లీకి కటింగ్ చేస్తూ, "అయ్యా! స్విస్‌బ్యాంకు ఖాతాల వ్యవహారం ఏమైంది" అని అడిగాడు.
జైట్లీ: "కటింగ్ చేయటానికి వచ్చావా? నన్ను ప్రశ్నలేయటానికి వచ్చావా? వచ్చిన పని చూసుకు పో" అని కోపంగా అరిచాడు.
మరునాడు ప్రధాని మోడీకి హెయిర్ కట్ చేయటానికి వెళ్ళాడు.
కటింగ్‌చేస్తూ ప్రధానిని ఓ ప్రశ్న వేశాడు మనోజ్. "సార్, బ్లాక్‌మనీని వెనక్కి తీసుకొస్తానన్నారు కదా?" అని.
మోడీ అరిచారు- "నన్నెందుకు ఈ ప్రశ్న వేస్తున్నావు" అని.
ఈ విషయాలు విన్న సిబిఐవారు మనోజ్‌ను పిలిచి ఎంక్వైరీ మొదలుపెట్టారు.
"నువ్వు కేజ్రీవాల్ ఏజెంట్‌వా?"
"లేదు సార్"
"లాలూ డబ్బులిచ్చాడా నీకు?"
"లేదు సార్"
"విజయ్‌మాల్యా నీకు స్విస్ బ్యాంకు ఎకౌంట్ తెరుస్తానన్నాడా?"
"ఆయనెవరో తెలీదు సార్"
"అన్నాహజారే దగ్గర పనిచేస్తున్నావా?"
"లేదు సార్"
"మరి హెయిర్ కట్ చేసేటపుడు పిచ్చి పిచ్చి ప్రశ్నలెందుకేశావు?"
"అదా సార్, నేను ఇలా పిచ్చిప్రశ్నలు అడగ్గానే, వారి జుట్టు నిక్కబొడుచుకుంటోంది. దాంతో నాకు కటింగ్ చేయటం తేలికవుతోంది. అందుకే అడిగా సార్"
దీన్నే తెలివిగా వ్యాపారం చేసుకోవటం అంటారు. ◆

బీరువా సమస్యలు :
ఆడవారు బీరువా తెరవగానే వారికి రెండు సమస్యలు ఎదురవుతాయి. అవి :
1) బీరువాలో కొత్త బట్టలు లేకపోవటం.
2) బట్టలుపెట్టటానికి బీరువా సరిపోకపోవటం.

కోర్టులో జడ్జ్: "నువ్వు కారు వేగంగా నడపలేదని ఆధారాలేవన్నా ఉన్నాయా?"
నిందితుడు : "నా దగ్గరేం లేవయ్యా! నేను మా అత్తగారింటి నుండి మా ఆవిడను తెచ్చుకోవటానికి వెళుతున్నాను"
జడ్జి : "పో, కేసు డిస్మిస్ చేశాను"



Courtesy : SANANDA

# పిల్లలకు గాయాలైతే

సంవత్సరం లేదా అంతకన్నా తక్కువ వయసున్న పిల్లలలో సంభవిస్తున్న మరణాలకు కారణం రోగాలు కాదు ఆ వయసులో వారికి తగులుతున్న గాయాలు ముఖ్య కారణం అంటారు వైద్యులు. వయసు పెరుగుతుంటే ఏదో ఒక రకమైన గాయాలకు గురవుతుంటారు. వీటిలో కొన్ని ప్రాణాంతక గాయాలవుతుంటాయి.

పిల్లలు ఎదగటంలో సహజంగా జరిగే ప్రమాదాలు కొన్ని. పసిపిల్లలుగా వున్నప్పుడు పొరపాటున మంచం లేదా ఉయ్యాలలో నుండి జారిపడతారు. నడిచే వయసులో మెట్లమీదనుండి కిందపడవచ్చు.

ఆ వయసులో వారిలో సహజంగా వుండే ఆసక్తి వారిని మంటలవైపు నడిపిస్తుంటుంది.

ప్రమాదం అనే విషయం తెలియని వయసులో ఎలక్ట్రికల్ షాక్‌కి గురయ్యేవారుంటారు.

ఒక వయసులో పిల్లలలో ఉత్సాహం, శక్తి ఎక్కువగా వుంటుంది. ఏదో ఒకటి ఎక్కుతూ దిగుతూ వుంటారు. గెంతులు వేస్తారు. చూసుకోకుండా పరిగెడుతుంటారు. ఇటువంటి సమయంలో కిందపడినందున శరీరానికి గాయాలవుతుంటాయి.

కాళ్ళు, చేతులు విరగవచ్చు, తల గోడకు తగిలి ఇబ్బందులు ఏర్పడవచ్చు. ఇరుకైన ఇళ్ళు, ఇంటిలో వుండే పలురకాల సామాగ్రి, ఫర్నీచర్, ఇతర పదునైన వస్తువులు ఏవైనా తగిలి గాయాలవుతుంటాయి.

స్కూల్‌కి వెళ్ళే వయసులో మరో రకం గాయాలవుతుంటాయి. పిల్లలు ఆటల్లో భాగంగా ఒకరినొకరు నెట్టుకుంటారు.పడకూడని భంగిమలో పడి గాయాలు అవుతాయి. ఆ వయసులో సైకిళ్ళు తొక్కటం మొదలుపెట్టి, సరైన భద్రతాచర్యలు పాటించక గాయాలకు గురవుతారు.

మరికొంచెం ఎదిగి టీనేజ్‌లోకి రాగానే సాహసాలు మొదలుపెడతారు. అతివేగంగా బండి నడపటం, రోడ్డుమీద వాహనాలతో విన్యాసాలు, ఈత కొట్టటం, చెట్టు ఎక్కటం ఎత్తుమీదినుండి దూకటం వంటి పనులుచేసి తీవ్రగాయాలకు గురవుతారు.

## టీనేజ్‌లో

మింగకూడని వస్తువులను మింగటం పాకే వయ సులో జరుగుతుంది. ఇంట్లో వున్న డబ్బాలలోని యాసిడ్స్ తాగుతుంటారు. ప్లాస్టిక్ కవర్లు ముఖానికి వేసుకుని,ఊపిరాడక ఉక్కిరిబిక్కిరి అవుతారు. ఆట వస్తువులలో పదునుగా వున్నవాటితో ఆడే ఆటలు గాయాలను చేస్తాయి.

వాహనాలమీద పిల్లలను తీసుకువెళ్ళేటప్పుడు చాలా జాగ్రత్తగా వుండాలి. బైక్‌మీద వెళుతూ ఒళ్ళో నుండి పిల్లలను జారవిడుచుకున్న తల్లులు, కారులో ప్రయాణం చేస్తున్నప్పుడు,పిల్లలను జాగ్రత్తగా చూసుకోని తండ్రులు తమ పిల్లల భవిష్యత్తుతో చెలగాటమాడుతున్నట్టే. వాహన డ్రైవర్ సడన్‌గా బ్రేక్‌వేస్తే పిల్లల తల వెళ్ళి దేనికో ఒకదానికి తగులుతాయి.

ఆ విధంగా తలకు గాయం అవవచ్చు. ఏదైనా వస్తువు మీదపడినప్పుడు ఆ ఒత్తిడికి శరీరపు లోపలి అంగాలకు దెబ్బ తగలవచ్చును. ఇటువంటి గాయాల వల్ల దీర్ఘకాలిక ఇబ్బందులు ఏర్పడతాయి.

ఆ గాయాల ప్రభావం శాశ్వతంగా నిలిచిపోయే ప్రమాదముంటుంది. చిన్నతనంలో తగిలిన గాయాల వల్ల అవిటితనం వస్తే అది పిల్లలకు, వారి తల్లిదండ్రులకు కూడా జీవితాంతం విషాదమే.

పిల్లలను జాగ్రత్తగా చూసుకోకూడదు అని ఏ తల్లిదండ్రులూ అనుకోరు. కాని కొన్ని సందర్భాలలో అనుకోని సంఘటనలు జరుగుతుంటాయి.పిల్లల ప్రవర్తనలోనూ కొన్ని సహజమైనవి.

తమ చుట్టూ వున్నవాటిని పూర్తిగా అర్థంచేసుకోలేని వయసు, ప్రమాదాల ఫలితాలను అంచనా వేయగలిగిన స్థాయి లేకపోవటం అనేదానివల్ల పిల్లలు గాయాలపాలవుతుంటారు.కొంతమంది పిల్లలు పెద్దల మాట వినరు. చెయ్యిపట్టుకుని నడవక, వారిష్టం వచ్చినట్టు నడిచేందుకు, ప్రవర్తించేందుకు ప్రయత్నించి ప్రమాదాలను కొనితెచ్చుకుంటారు.

హైస్కూల్ స్థాయిలో నలుగురిలో మెప్పుకోసం ప్రదర్శించే హీరోయిజం ప్రమాదాలలోకి నెడుతున్నది. ఇటీవలికాలంలో ఇంటర్మీడియేట్ వయసులోనే సిగరెట్, మత్తు పానీయాలు, డ్రగ్స్ అలవాటు పిల్లలలో కనిపిస్తున్నది. ఇవన్నీ దీర్ఘకాలం ప్రభావంచూపే అనారోగ్యకర అంశాలు. మానసికంగా, శారీరకంగా పలు రకాలుగా ఇబ్బం దులకు గురవుతారు పిల్లలు.

శరీరంలోని ఏ అంగం మీదైనా దీర్ఘకాల ప్రభావం చూపే అవకాశముందికాబట్టి పిల్లలకు తగిలే గాయాలు, అందుకు దారితీసే పరిస్థితులను గమనించి తగిన జాగ్రత్తలు తీసుకోవటం అవసరం.

## కీలక అంగాలకు

ఆటలు ఆడే సమయంలో కళ్ళకు గాయమయ్యే ప్రమాదం అధికం. పిల్లల ఆటలో భాగం మట్టిని



విసురుకోవటం. అలా ఒకరు చల్లిన మట్టి మిగిలిన పిల్లల కళ్ళలో పడవచ్చు.

కత్తులు, చాకులు వంటి పదునైన వస్తువులతో ఆడుకుంటూ పొరపాటున కంటికి తగిలించుకోవటం లేదా గుచ్చుకోవటం చేస్తారు. చిన్నవయసులో బాణం వెయ్యటమనేది బాగా నచ్చేఆట.అలా విసిరిన బాణం కంటిలో తగిలితే ప్రమాదం జరుగుతుంది.

బలంగా బంతి తగిలినా, రాళ్ళు తగిలినా కంటి చూపు మీద ప్రభావం వుంటుంది. పిడికిళ్ళతో గుద్దుకునే ఆట పిల్లలు ఆడుతుంటారు.

ఆ పిడికిలి దెబ్బ కంటిమీద పడినప్పుడు కన్ను దెబ్బతింటుంది. కంటిచూపు మందగించినా, ఒక కంటిచూపు వికారంగా తయారైనా అది శాశ్వతమైన అసౌకర్యం, అందవిహీనం. అటువంటి జీవితాన్ని ఎవరూ ఊహించరు.

అటువంటి ఆటలలో బయటకు కనిపించకుండా తగిలే గాయం మూత్రపిండాలకు తగిలే గాయాలు. ఆటలలో గజ్జలలో, వృషణాలమీద బంతి తగులుతుంది. దీనివలన మగపిల్లలలో పురుషాంగానికి దెబ్బ తగులుతుంది. వాహనాలను చిన్నవయసులోనే ఇస్తున్నారు తల్లిదండ్రులు. వాహనాల ప్రమాదంలో టీనేజర్స్‌దే పైచేయి. తమకు దెబ్బ తగులుతుందని గాని, ఎదుటి వారికి గాయాలు చేస్తామని కాని వారు ఆలోచించటంలేదు.

వేగంగా బండి నడిపి యాక్సిడెంట్ చేసి కాళ్ళు, చేతులు విరగగొట్టుకుంటున్నారు.ఆ వయసులో జరిగిన ప్రమాదాలవల్ల నడక మారిపోతుంది.చేతుల రూపంలో తేడా వస్తుంది.బరువులు మొయ్యలేరు. సాధారణ జీవితాన్ని గడపలేని పరిస్థితి వారిది.


Courtesy : AROGYA SANJIVANI

ఆ ప్రమాదాలవల్ల, దీర్ఘకాలిక ఇబ్బందులవల్ల వివాహానికి పనికిరాకుండా పోతున్నవారున్నారు. సరైన సంబంధాలు దొరకక రాజీపడాల్సివస్తుంది. ఆ గాయాలు మానసికసమస్యలను తెస్తాయి.డిప్రెషన్‌కు గురవుతారు.

## పెద్దల స్పందన

**పి**ల్లలకు నేర్పాల్సిన జాగ్రత్తలు తప్పకుండ చెప్పాలి. అతిముద్దు చేసి వారి ప్రవర్తన దారితప్పేలా చేయవద్దు. వాహనాలు ఇవ్వటం మంచిది కాదు. వారికి తెలియని వయసులో పూర్తి బాధ్యత పెద్దలదే.

అన్ని జాగ్రత్తలు తీసుకున్నా ఎప్పుడో ఒకసారి, ఎవరో ఒకరు కాల ప్రభావం చూపించే ప్రమాదాలలో ఇరుక్కోవటం జరుగుతూనే వుంటుంది. బోర్‌బావులు వాడకంలో లేనివిమూసి వుంచాలన్న హెచ్చరిక చేస్తున్నా నిర్లక్ష్యంచేసి,పిల్లలు ఆ బోర్ బావిలో పడినతర్వాత కన్నీరు మున్నీరయ్యే తల్లిదండ్రులను చూస్తూనేవున్నాం.


Courtesy : VANITHA

వారిని రక్షించేందుకు చేసే యత్నాలు గమనించే వుంటారు. అటువంటి ప్రమాదాలు జరిగినప్పుడు తక్షణం స్పందించాలి. కాని అతిగా స్పందించకూడదు. ప్రమాదం తర్వాత ప్రతిక్షణం విలువైనదే. అనవసరంగా చుట్టూ చేరి ప్రమాదంలో చిక్కుకున్నవారిని రక్షించే బృందాల పనికి అడ్డ తగలకూడదు.

సరైన పద్ధతిలో స్పందించలేనివారు పిల్లలను లేపే యత్నం చెయ్యటంవల్ల వారి గాయాలను మరింత తీవ్రం చేసినవారవుతారు. గాయపడిన పిల్లలను ముందుగా గమనించండి. గాయం తలకు తగిలిందా, ఎముకలు విరిగాయా వంటి వాటిని గమనించి ఆ తర్వాత పిల్లలను ఎలా వైద్యుడి దగ్గరకు తీసుకువెళ్ళాలో నిర్ణయించుకోవాలి. అందుకోసం వైద్యశాస్త్రం సూచించే సూచనలు పాటించండి.

పిల్లవాడు స్పృహలో వున్నాడా! వుంటే మాట్లాడుతున్నాడా! బాధకు మూలగటంవంటి స్పందనలు చూపుతున్నాడా! లేక ఎటువంటి స్పందనలు చూపటం లేదా! అనేది గమనించాలి. గాయపడిన వారికి గాలి, వెలుతురు తగిలేలా చూడండి.

శ్వాసక్రియ జరుగుతున్నదా, గుండె కొట్టుకుంటున్నదా వంటి బాహ్య అవకాశాలను గమనించండి. రక్తస్రావం అవుతుంటే ముందుగా దానిని ఆపేందుకు తగిన యత్నం చెయ్యండి.

మురికి చేతులతో కాక శుభ్రమైన చేతులతో పిల్లల గాయాలను తాకండి. వారి శరీరంలో ఏదైనా వస్తువులు గుచ్చుకుంటే వాటిని బలవంతంగా బయటకు లాగే యత్నం చెయ్యవద్దు. కాలు, చెయ్యి కదిలించి వారి స్పందన ఎలా వున్నది అర్థంచేసుకోండి. బాధ చెప్పలేని పరిస్థితిలో వున్నప్పుడు వారి శరీరానికి మరింత గాయం తగిలిన స్థితిలో వారిని వీలైనంత త్వరగా ఆసుపత్రికి తీసుకువెళ్ళాలి.

పిల్లలను పెద్దలు తమ శరీరానికి దగ్గరిగా తీసుకుని పట్టుకుంటే వారికి భద్రతాభావం కలుగుతుంది. వారికి ఇష్టమైన పాట పాడితే నొప్పిని భరించగలుగుతారు. ఇంటి దగ్గర ఆటల్లో గాయం అయినప్పుడు, పిల్లలను షాక్‌లోనుండి బయటకు తెచ్చే యత్నం చెయ్యాలి. నీరు ఇవ్వండి.

మీరు వెంట వున్నారన్న భరోసా ఇవ్వండి. అన్ని చేసినా సరిగ్గా స్పందించక, తల వేళాడేస్తున్నా, కళ్ళు తేలవేస్తున్నా అంతర్గత గాయం అయివుంటుందని గ్రహించి ఆసుపత్రికి తరలించండి.

తలకు దెబ్బ బయటకు కనిపించదు. కాని లోపలి మెదడుకు దెబ్బ తగిలితే పిల్లలు వాంతి చేసుకుంటారు. అలాంటి ఇబ్బంది కనిపించగానే ఆసుపత్రికి తీసుకువెళ్ళటం అవసరం. చిన్న గాయమే కదా అని నిర్లక్ష్యం చెయ్యవద్దు. బాల్యంలో తగిలిన దెబ్బలు అప్పుడు వెంటనే ప్రభావం చూపకపోయినా దీర్ఘకాలంలో చూపుతాయి.

కొన్ని గాయాలవల్ల సమస్య దీర్ఘకాలం నిలిచివుంటుంది. పిల్లల భద్రత కోరుకునే పెద్దలు ఒక వయసు వరకు ప్రతిక్షణం పిల్లలమీద, వారి ఆటలమీద ఒక కన్నువేసి వుంచాల్సిందే. పిల్లల ఆటలకు అనువైన వాతావరణం కల్పించండి. ఇరుకు గదుల్లో ఆడుకోనివ్వవద్దు. పదునైన ఆటవస్తువులు ఇవ్వవద్దు.

ప్రమాదకర ఘన, ద్రవ పదార్థాలను పిల్లలకు అందుబాటులో వుంచవద్దు. సైకిల్ నేర్చుకునే సమయంలో, స్కేటింగ్ చేస్తున్నా తలకు హెల్మెట్ పెట్టుకునే అలవాటు చేయండి. దీనివలన దీర్ఘకాల నష్టాలను నివారించటమేకాదు, ఆరోగ్యకరంగా, చక్కని శరీరంతో ఎదుగుతున్న పిల్లలను చూసి గర్వించే తల్లిదండ్రులవుతారు.

**టి.నీలిమ**

# వారఫలం

ఏప్రిల్ 19 నుండి 25, 2018 వరకు

పిడపర్తి వీరేశ్వరశాస్త్రి, పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి
సెల్ : 94921 56064



## మేషం

అశ్విని, భరణి, కృత్తిక 1పా. ప్రణాళికా బద్ధంగా వ్యవహరించుకోగలరు. ఆదాయాలు మీ ఊహలకు, అవసరాలకు సరిపడునట్లుంటాయి. సంతానపు అవసరాలు తీర్చుటకు ప్రాధాన్యతనీయగలరు. సంప్రదింపులకు తగినట్లుగా వ్యవహరించుకోలేకపోతారు. వృత్తి, ఉద్యోగములందు కొన్ని అదనపు బాధ్యతల్ని స్వీకరించవలసిరావచ్చును. అధికారులతో సంయమనములతో సాగండి. వీరికి శుక్ర, శని, ఆది వారములు అనువైనవి.



## వృషభం

కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా. ఖర్చులు కొన్ని అదనంగా ఏర్పడి అత్యసరమైనవిగా తోచగలవు. శ్రమలు వున్నా సంతోషాన్ని పొందగలరు. వ్యక్తిగత విమర్శలకు దూరంగా ఉండండి. పనులు మందకొడిగా సాగినా ఫలవంతం కాగలవు. కుటుంబమున సహకారములు ఉత్సాహాన్ని ఇస్తాయి. నూతనమైన పనులను చేపట్టేటప్పుడు బహుముఖ ఆలోచనలు అవసరం. వీరికి గురు, ఆది, సోమ వారములు అనువైనవి.



## మిథునం

మిథునం: మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా. వివాదాలు ఏర్పరచేవాటికి, సాహస కార్యములకు దూరముగా ఉండండి. అవసరాలు తీర్చుకొనేటట్లు ఆదాయాలు ఉంటాయి. కుటుంబ వ్యక్తులతో సంప్రదింపుల విధానములతో సాగండి. పరిచయస్థులచే ప్రయోజనములు ఏర్పరచుకోగలరు. రావలసిన వాటిని సౌమ్యంగా వసూలు చేసుకోండి. మీ పనులను ఇతరులకు అప్పగించక స్వయంగా చూసుకోండి. శుక్ర, శని, బుధ వారములు అనువైనవి.



## కర్కాటకం

పునర్వసు 4వపా, పుష్యమి, ఆశ్లేష. ముఖ్యమనుకొన్న పనిని పూర్తిచేసుకోగల్గుతారు. సలహాలు, సంప్రదింపులతో వేగవంతంగా వ్యవహరించుకోగలరు. ఖర్చులు మీకు తగినట్లుగా ఉంటాయి. ఆరోగ్యం విషయంలో మంచి మార్పులు ఏర్పడతాయి. ఆత్మీయులతో ఉత్సాహాలు పంచుకోగలరు. వ్యక్తిగతంగా కొన్ని ఇబ్బందుల్ని దూరంచేసుకోగలరు. అధికారిక బాధ్యతలేర్పడే సూచనలున్నాయి. వీరికి గురు, ఆది, సోమ వారాలు అనువైనవి.



## సింహం

మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వపా. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలందు మీదైన తరహాలో వ్యవహరించుకోగలరు.అధికారిక హోదాలు ఏర్పడుట, పెద్దవారితో సంబంధాలు ఏర్పడుట ఉంటాయి. కొత్తవైన పనులను చేపట్టుటకు యోచించగలరు. కుటుంబంలో ఏకపక్షంగా వ్యవహరించుకోకండి. శుభకార్యములలో పాల్గొనగలరు. చేబదుళ్ళు ఇచ్చుట మంచిది కాదు. వీరికి గురు, శుక్ర, శని, బుధ వారములు అనువైనవి.



## కన్య

ఉత్తరఫల్గుని 2, 3, 4పా, హస్త, చిత్త 1, 2పా. ప్రత్యర్థులువంటివారితో మెలకువలు అవసరం. ఖర్చులు ఆదాయాలను మించే సూచనలున్నాయి. సర్దుబాట్లు అవసరమవ్వగలవు. కొన్ని పనులను మధ్యలో విరమించుకొనే సూచనలు ఉన్నాయి. అన్ని వ్యవహారాలందు బాధ్యతాయుతంగా వ్యవహరించుకోవాలి. అధికారులు, పెద్దవారువంటి వారితో సంయమనములు అవసరం. శుక్ర, శని, ఆది, సోమ వారములు అనువైనవి.



## తుల

చిత్త 3, 4 పా, స్వాతి, విశాఖ 1,2,3పా. అప్రమత్తతలతో వ్యవహరించుకోండి. ఖర్చులు కొన్ని అంచనాల్ని మించగలవు. ఆలోచనలు ఊగిసలాటలకు గురికాకుండా జాగ్రత్తలు వహించుకోవాలి. ఆత్మీయంగా వ్యవహరించువారి కలయికలు ఏర్పడగలవు. పనులను ఒకదానివెంట ఒకటి చేపట్టుకోండి. అనారోగ్యభావనలందు ఉపేక్షించకండి. భాగస్వామి సలహాలకు ప్రాధాన్యతనీయండి. వృత్తి,ఉద్యోగ, వ్యాపారాలందు కర్తవ్యాలకు అంకితమవ్వండి. ఆది, సోమ, బుధ వారములు అనువైనవి.



## వృశ్చికం

విశాఖ 4వ పా, అనూరాధ, జ్యేష్ఠ. కొన్ని గత సమస్యలకు పరిష్కారాలుపొందుతారు. వాగ్భాషణలందు లౌక్యము అవసరం. అదనపు ఆదాయాలపై దృష్టిపెట్టగలరు. శ్రమచూపి పనులను పూర్తిచేసుకోగలరు. భాగస్వామిక వ్యవహారాలు అనుకూలింపచేసుకుంటారు.గృహనిర్మాణాలు, మరమ్మతులువంటివి చేపట్టుకోగలరు. శుభకార్యముల పట్ల విముఖత ప్రదర్శించు సూచనలున్నాయి. శుక్ర, శని వారాలందు అన్నిటా మెలకువలు అవసరం.



## ధనుస్సు

మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పా. ఈ వారంలో అనాలోచిత వ్యవహారాలకు దూరంగా ఉండండి. దూకుడుతనమునకు దూరంగా ఉండండి. రుణాలు, చేబదుళ్ళు వంటివి అవసరాలకు మించి తీసుకోకండి. సమాచార స్వీకరణలకు సరయిన వ్యక్తులను ఎన్నుకోండి. నూతన వస్తువులను కొనుగోలు చేసుకోగలరు. పనులు నెమ్మదిగా సాగుతాయి. వ్యక్తిగత విమర్శలకు దూరంగా ఉండండి. ఈ రాశివారికి ఆది, సోమ వారములందు అన్నిటా మెలకువలు అవసరం.



## మకరం

ఉత్తరాషాఢ 2, 3, 4పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2పా. స్వార్థపూరిత ఆలోచనలు మానసిక ఇబ్బందులకు గురిచేయగలవు. ధనలాభం వుంది. సంతానపు వ్యవహారాలు బాగా ఆలోచింపచేస్తాయి. బంధుమిత్రులతో సత్సంబంధాలు ఏర్పడతాయి. అనేకములైన పనులు ఉక్కిరిబిక్కిరి చేయగలవు. విలువయిన వస్తువులపట్ల మెలకువలు పాటించుకోండి. ప్రయాణాలందు స్వల్ప జాగ్రత్తలు అవసరం. స్థిరాస్తుల చేరికలు ఏర్పడతాయి. శుక్ర, శని, ఆది, సోమ వారములు అనువైనవి.



## కుంభం

ధనిష్ఠ 3, 4 పా, శతతార, పూర్వాభాద్ర 1, 2, 3 పా. ఈ వారంలో అనుకొన్నవి పూర్తిచేసుకొనేందుకు ముమ్మరంగా యత్నించుకోవాలి. చిన్న చిన్న ఆటంకాలు ఎదురయినా అధిగమిస్తారు. ఆడంబరాలకు దూరంగా ఉండండి. భాగస్వామి, కుటుంబ వ్యక్తుల సహాయాలు పొందగలరు. వివాహాది శుభకార్య నిశ్చయాలు ఉండగలవు. కొన్ని విమర్శలను ఎదుర్కోవలసిరావచ్చును. వీరికి ఆది, సోమ, బుధ వారములు అనువైనవి.



## మీనం

పూర్వాభాద్ర 4వపా, ఉత్తరాభాద్ర, రేవతి. మీ యత్నములకు పట్టుదలలు అవసరం. ఆదాయాలు అవసరాలకు సరిపడునట్లు ఉంటాయి. ఆధిపత్య ధోరణికి దూరంగా ఉండండి. పెట్టుబడుల విషయంలో పునరాలోచనలతో సాగాలి. బంధుమిత్రుల కలయికలు ఉన్నా ఆత్మీయ భావనలు గోచరించవు. కొన్ని ఒప్పందాలువంటివి చేసుకోగల్గుతారు. శ్రమాధిక్యతలు గోచరించగలవు. వీరికి గురు, బుధ వారములు అనువైనవి.

వినయంతో ప్రారంభించి
సహనంతో కొనసాగిస్తేనే
మహాకార్యాలు
సాధ్యమవుతాయి.

# శివతాండవం

ఎమ్వీ రామిరెడ్డి





ఫ్లడ్‌లైట్ల వెలుతురులో, వేదిక మీద సాంబ శివుడు మావయ్య శివుడిలా తాండవమాడు తున్నాడు. ఇద్దరు కుర్రాళ్ళు వేదికమీదికొచ్చి, చెరో కర్రతో మావయ్యతో పోటీపడ్డారు. ఆయన ఇద్దర్నీ తేలిగ్గా ఎదిరిస్తూ కర్రను కత్తిలా ఝుళిపించాడు.

మరో ఇద్దరు జత కలిశారు. ఆయనలో చేవతగ్గని కళాకౌశలం. మరో నలుగురు ప్రత్యక్షం. ఎనిమిది మంది మధ్యలో మావయ్య మార్తాండుడిలా కర్రతో నిప్పులు చెరుగుతున్నాడు.

నిజానికి మా కంపెనీ ఆస్ట్రేలియా తెలుగు సంఘంతో కలిసి సిడ్నీలో 'ప్రపంచ తెలుగు మహోత్సవం' ప్లాన్ చేసినప్పుడూ, దానికి నన్ను ఇన్‌ఛార్జిగా నియమించినప్పుడూ అసలు మావయ్య ప్రదర్శన గురించి గుర్తుకురాలేదు. ఆ మాటకొస్తే ఆయన ప్రదర్శనలు మానేసి చాలా కాలమవుతోంది.

నా చిన్నతనంలో మా ఊళ్ళో పండగల సందర్భాలలో బోల్డన్ని సాంస్కృతిక ప్రదర్శనలు ఏర్పాటు చేసే వాళ్ళు. చలిరాత్రుల్లో దుమ్ము నేలమీద పరదాపట్టా పరుచుకుని ఆయన కర్రసాము చూడటం అవిస్మృత జ్ఞాపకం. ఊరెళ్ళినప్పుడు ఆ విషయం ప్రస్తావిస్తే 'యాభై దాటినాయిరా, ఇంకేం కర్ర దిప్పుతాం' అనేవాడు నవ్వుతూ.

సిడ్నీకి తీసుకెళ్ళాల్సిన కళాకారుల లిస్టు ఫైనల్ అయింది. అయితే, కోలాటం టీమ్ లీడర్ భారీ పారితోషికంతోపాటు అనేక నిబంధనలు విధించటంతో విసిగిపోయి, మరో ప్రదర్శన కోసం అన్వేషించమని అల్టిమేటం ఇచ్చాడు మా బాస్. అప్పుడు గుర్తొచ్చాడు మావయ్య.

ఆయన కళ ఖండాంతరం చేరటంతోపాటు జీవితంలో ఒక్కసారన్నా విమానం ఎక్కాలన్న ఆయన కోరిక తీర్చినవాడినవుతానన్న ఆలోచన కలిగింది. ఆయన కళా ప్రతిభ గురించి బాస్‌కు చెప్పాను.

"దేరీజ్ నో టైమ్. ఏదో ఒకటి సెట్ చెయ్. వెంటనే వీసాల పని చూడు" అన్నాడాయన. హాలు ప్రతిధ్వనించేలా చప్పట్లు మోగటంతో, దృష్టికీ మెదడుకీ గల సంబంధం పునరుద్ధరించబడింది.

నేలవాలిన ఎనిమిదికర్రల నడుమ మావయ్య తన కర్రను జెండాలా ఎత్తిపట్టుకుని అభివాదం చేస్తున్నాడు. మోకాళ్ళదాకా ఎర్రటి పంచెకట్టి, తెల్లటి కట్ బనియన్ వేసుకుని, ధారలు కడుతున్న చెమట్ల గురించి పట్టించుకోకుండా నిలబడి నమస్కారం చేస్తున్నాడు. చప్పట్లు ఆగటం లేదు.

స్టాండింగ్ ఒవేషన్. ఆస్ట్రేలియాలోని తెలుగు

వారందరూ సగౌరవ పురస్సరంగా ఓ పల్లెటూరి కళాకారుడికి అంకితమిస్తున్న అభినందనల పరంపర. బృందంలోని ఎనిమిదిమంది కళాకారులూ తమ నాయకుణ్ణి భుజాల మీద ఎక్కించుకుని ఆ ఆనందాన్ని రెట్టింపు చేశారు.

సాఫ్ట్‌వేర్ ఉద్యోగులు, కాలేజీ యువకులు, ఆఖరికి నిర్వాహకులు కూడా ఆయన్నింకా ఉక్కిరిబిక్కిరి చేస్తూనే ఉన్నారు. గుంపుకు దూరంగా నిలబడి ఆ ఆనందక్షణాలను నేను ఆస్వాదిస్తుండగా, ఎటునుంచి వచ్చాడో మా బాస్ భుజం తట్టి 'ఎక్స్‌లెంట్ సెలెక్షన్' అన్నాడు, నవ్వాను.

ఓ టీవీ ఛానల్ విలేకరి కెమెరామేన్‌తో దూసుకొచ్చి, మావయ్య నోటిముందు మైకు పెట్టాడు. అరగంట తర్వాతగానీ, నాకు మావయ్యతో మాట్లాడే అవకాశం రాలేదు. ఆయన నన్ను కౌగిలించుకుని, ఆనందంతో ఏడ్చేశాడు. ఆ రోజుతో మూడురోజుల మహోత్సవం ముగిసింది. మాకు బస ఏర్పాటుచేసిన సర్వీస్ అపార్టుమెంటుకు చేరుకునేసరికి అర్ధరాత్రి దాటింది.

నాలుగో రోజు ఆస్ట్రేలియా తెలుగు సంఘం సభ్యులు ఓ బస్సు ఏర్పాటు చేసి భారత్ నుంచి వెళ్ళిన 36 మందికీ సిడ్నీ అందాలు చూపించారు. సమయాభావంవల్ల ఒపేరా హౌస్ చూడలేకపోయాం. మరుసటి రోజు... ఎవరిష్టం వారిది.

తెల్లవారితే తిరుగు ప్రయాణం కాబట్టి, నేను నా క్లాస్ మేట్‌ను కలిసేందుకు ప్లాన్ చేసుకున్నాను. మావయ్యను వెంటబెట్టుకుని ట్యాక్సీలో ఉదయం పదిగంటలకల్లా ఒపేరా హౌస్ చేరుకున్నాం.

దాంతోపాటు ఆ చుట్టుపక్కల ప్రదేశాలన్నీ తిరిగి, లంచ్ పేరిట విచిత్రమైన పదార్థాలేవో తిని, సాయంత్రం నాలుగు గంటలకు నా మిత్రుడు చెప్పిన రెస్టారెంటుకు వెళ్ళాం. వాడు అప్పటికే మా కోసం చూస్తున్నాడు.

నన్ను చూడగానే "హాయ్ రామీ... ఎలా ఉన్నావ్?" అంటూ హత్తుకున్నాడు.

"బావున్నానురా. నువ్వెలా ఉన్నావు? నీ శ్రీమతి బావుందా?" కుశలమడిగాను.

"హ్యాపీరా. ఈయన..."

"మా మావయ్య సాంబశివుడు. తెలుగు మహోత్సవంలో అదిరిపోయే ప్రదర్శన ఇచ్చాడు"

"నమస్తే అంకుల్" మావయ్యతో కరచాలనంచేసి, నావైపు తిరిగి "సారీ రా! ప్రాజెక్టు పనిమీద మెల్‌బోర్న్ వెళ్ళాను. అందుకే మహోత్సవానికి రాలేకపోయాను. చాలా బాగా జరిగిందని ఫ్రెండ్స్ చెప్పారు" అన్నాడు.

"మావయ్యా, రాజేష్ అని నా మిత్రుడు. కలిసి చదువుకున్నాం" మాట్లాడుకుంటూ రెస్టారెంటులోకి నడిచాం. రాజేష్ మూడు కోల్డ్ కాఫీ తెచ్చాడు.

"తాపీగా తాగుతూ మాట్లాడుకుందాం. కాసేపటి తర్వాత మీకు ఇక్కడి పిజ్జా టేస్ట్ చూపిస్తా" అంటూ ఓగ్లాసు నాకు,మరోటి మావయ్యకు అందించాడు.

"కాఫీ అంటే వేడివేడిగా తాగాల. ఇట్టా సల్లటి కాఫీ తాగటం ఏం సుకం రా నాయనా?" అన్నాడు మావయ్య. "ఇదో టేస్టు మావయ్యా. తాగి చూడు" అన్నాను నవ్వుతూ.

రాజేష్‌తో కబుర్లు మొదలయ్యాయి. మా మాటలకు పక్కనున్న యువకులు పెద్దగా నవ్వుతూ,వింతగా అరుస్తూ తీవ్ర అంత రాయం కలిగిస్తున్నారు.

నేను వారిని హెచ్చరించబోయేంతలో రాజేష్‌చటుక్కున నా చెయ్యిపట్టుకుని, "రేయ్, అసలు వాళ్ళవంక చూడకు. చాలా డేంజర్" అంటూ వారించాడు.



కాశ్మీర్ ధర్మభూమి. అది భారత్‌లో అంతర్భాగం. అలాగే కొనసాగుతుంది.
-సురేష్ రైనా, క్రికెటర్

నేనా ప్రయత్నం మానుకున్నాను. "ఏంట్రా, కామన్‌సెన్స్ లేకుండా...!" కోపంగా అన్నాను.

"ష్... మెల్లగా. మాట పైకి రానీయకు. వాళ్ళంతే. మనమంటే వాళ్ళకు హేళన. మన రంగంటే చులకన" అన్నాడు. మేమూ, పంచె కట్టుకున్న మావయ్యా వాళ్ళకో టాపిక్ అయ్యుంటామని అప్పటికర్థమైంది.

వాళ్ళను పట్టించుకోకుండా మా కబుర్లు కొనసాగించాం. మరికొంత సమయం గడిచింది.

పిజ్జా తెస్తానని వెళ్ళాడు రాజేష్."సెపంచకంలో ఎన్నెన్నిఇంతలూ ఎన్నెన్ని రకాల మడుసులూ..." ఆ వింత జుట్టు కుర్రాడివంక చిత్రంగా చూస్తూ అన్నాడు మావయ్య. నేను నవ్వి ఊరుకున్నాను.

రెండు చేతుల్లో పిజ్జాలతో రాజేష్ మావైపు వస్తుండగా, జుట్టుకుర్రాడు కావాలని కాలు ముందుకు చాపాడు. కిందపడబోయి, తమాయించుకునే ప్రయత్నంలో రాజేష్ చేతిలోని పిజ్జా అతగాడి జుట్టుమీద పడిపోయింది. జుట్టంతా రంగులమయమైపోయింది. ఆ యువకుడు ఆగ్రహంతో ఊగిపోతూ, పెద్దగా అరుస్తూ... రాజేష్‌ను ఒక్క తోపుతోశాడు.

రాజేష్ అల్లంత దూరాన పడ్డాడు.అతను అంతటితో ఆగకుండా గబగబా వెళ్ళి, పైకి లేవబోతున్న రాజేష్ తలమీద పిడిగుద్దు గుద్దాడు.

ఏం జరుగుతోందో నేనర్థం చేసుకునేలోపే... క్షణంలో నా పక్కనుంచి మెరుపులా కదిలి... అంతెత్తున ఎగిరి ఆ యువకుడి డొక్కల్లో ఒక్క తన్ను తన్నాడు మావయ్య! అతను బల్లిలా నేలకరిచాడు.

అతని స్నేహితులు మావయ్యను చుట్టుముట్టారు. నాకు తెలుసు, మావయ్య మిగతా ముగ్గురినీ కూడా ముగ్గులా నలిపెయ్యగలడని! కానీ, దేశం కాని దేశం. నేను గబగబా వెళ్ళి సర్దిచెప్పబోయాను.

పైకి లేచిన రాజేష్ కూడా సంధిమార్గంలో స్వరం విప్పాడు. "ఏందిరా ఈ కొడుకులకి దడుత్తారు? పక్కకి తప్పుకోండి, తాట తీత్తా ఒక్కోడికి" మావయ్య కోపంతో ఊగిపోతున్నాడు.

నేను మావయ్యను వారించాను. కౌంటర్‌లో ఉన్న ఉద్యోగులు కూడా కలుగజేసుకుని శాంతింపచేశారు. ఆ సామరస్యం కొనసాగింపులో భాగంగా మా ముగ్గురునీ కౌంటర్ పక్కనున్న అద్దాలగదిలోకి పంపారు. ఇంతలో హఠాత్తుగా పెద్ద శబ్దాలు!

తుపాకులు గర్జిస్తున్న చప్పుళ్ళు. అరుపులూ కేకలూ, అంతా గందరగోళం. చేతలుడిగి నిలబడి ఉన్న నన్నూ, రాజేష్‌నూ మావయ్య అమాంతం ఓ మూలకు తోశాడు. ఆ రెస్టారెంటు నిండా భయానక నిశ్శబ్ద మేఘాలు అలముకున్నాయి.

కొద్దిసేపటికి కౌంటర్‌వైపు నుంచి మేము ఉన్న గదులవైపు ఓ ఉగ్రవాది వచ్చాడు. నల్లటి దుస్తులు ధరించాడు.నడుముకి పెద్ద బెల్టు వేలాడుతోంది. ఆకుపచ్చరంగు బ్యాగును రెండు భుజాలకూ తగిలించుకున్నాడు. మంకీ క్యాప్ ధరించటంవల్ల కళ్ళు మాత్రమే కనిపిస్తున్నాయి. "అందరూ మెయిన్

ఛాంబర్ లోకి రండి..." పెద్దగా గర్జించాడు. ఇతర గదుల్లో ఉన్నవారందరూ ఒకచోటికి చేరారు.

అందరూ సగం ప్రాణంతోనే కనిపిస్తున్నారు.

"ఎవ్వరూ అతి తెలివి చూపొద్దు. పారిపోవడానికో పోలీసులకు ఉప్పందించడానికో ప్రయత్నించవద్దు. అందరూ ఫోన్లు కింద పడెయ్యండి.

మేం ఈ ప్రభుత్వానికి కొన్ని డిమాండ్లు పెట్టాం. తేలేదాకా మీరిక్కడే ఉండాలి.

మా డిమాండ్లకు ఒప్పుకోకపోతే, మిమ్మల్నందరినీ కాల్చిపారేస్తాం..." హిందీలో చెప్పాడతను. నిమిషాలు భారంగా గడుస్తున్నాయి. నెమ్మది మీద... అతను కాక, ఇంకో ఉగ్రవాది ఉన్నట్లు అర్థమైంది.

మరికొంతసేపటి తర్వాత అందరినీ కౌంటర్ వద్దకు పిలిచారు. ఆగంతకులు రెస్టారెంటు లోకి అడుగుపెడుతూనే జరిపిన కాల్పుల్లో మరణించిన నలుగురి మృతదేహాలు చెల్లాచెదురుగా పడున్నాయి. ఆ దృశ్యం చూసిన ఒకరిద్దరు వాంతి చేసుకున్నారు.సుమారు నలభైమందికి పైగా ఉంటారు, ఉద్యోగులతో కలిపి. అందరినీ అర్ధచంద్రాకారంలో నాలుగైదు వరసలుగా నిలబెట్టారు.

మేం చివరివరసలో ఉన్నాం. మావయ్య ఇద్దరు ఉగ్రవాదుల వైపు, మిగతా జనంవైపు మార్చిమార్చి చూస్తున్నాడు. "అరె! ఇంతమందిమి ఉన్నాం. మూకుమ్మడిగా మీదపడితే ఇద్దర్ని మట్టుబెట్టలేమా?

పోతే ఇంకో నలుగురం పోతాం. ఆ వార ఇద్దరు కిరాతకులు ఈ భూమ్మీంచి పోతారు..." నా చెవిలో అన్నాడు గుసగుసగా.

"ఇంకా నయం. వాళ్ళను ఎగిరితన్నే వ్యూహాలేమీ అమలుచెయ్యకు. వాళ్ళ బెల్టుల చుట్టూ బాంబులుంటాయి. అందరం నామరూపాల్లేకుండా పోతాం" చెప్పాను గొణుగుతున్నట్టు.

"మరి మనం బయటపడేదెలా?"

"ఎప్పటికైనా పోలీసులొస్తారు. నా అంచనా నిజమైతే, ఈపాటికి వాళ్ళు ఈ హోటల్ చుట్టూ దడి గట్టి..." నామాటలు పూర్తికాకముందే, భయంకరమైన శబ్దం వినిపించింది.

పోలీసులు మెయిన్ డోర్‌మీద గుళ్ళవర్షం కురిపిస్తున్నారన్న విషయం ఆగంతకులకు అర్థమైనట్లుంది. తదుపరి అంకం పోలీసుల మెరుపు దాడేనని తెలుసనుకుంటా.. ఇద్దరూ దగ్గరకు చేరి ఏదో చర్చించుకున్నారు. ఆ తర్వాత "అందరూ గదుల్లోకి వెళ్ళండి" అంటూ ఒకడు గర్జించాడు. మేమంతా లోపలికి వెళ్ళగానే ఆ ప్రదేశానికీ, అద్దాలగదులకీ మధ్య ఉన్న తలుపులు మూసేశారు.

రెస్టారెంటు వెనుకవైపుకు చేరుకున్నాం. ఓ ఉద్యోగి వెనకవైపుకుండే డోర్ తెరవబోయాడు. రాలేదు. అందరూ ఎప్పుడు బయటపడతామా అన్న ఒకే ఒక్క ఆలోచనతో సతమతమవుతుండగా, మావయ్య మాత్రం ఓ మూలన పడివున్న ఇనపకడ్డీ తీసుకుని, డోర్‌ను తెరిచే ప్రయత్నం చేశాడు. వీలుకాలేదు.

నిచ్చెనలాంటిది కనిపించింది. దాన్ని తీసుకొచ్చి గోడకు నిలబెట్టాడు. చకచకా దానిపైకెక్కి డోర్ పైభాగంలో ఉన్న అద్దాన్ని పగలగొట్టాడు. పెద్ద కంత ఏర్పడింది. అందులోంచి బయటకు చూసి, కిందికి దిగాడు."ఒక్కొక్కరే నిచ్చెనమీదగా ఎక్కి అవతలివైపు వీధిలోకి దూకమనిఇంగిలీసులో చెప్పండి"అన్నాడు. రాజేష్ పెద్ద గొంతుతో చెప్పాడు.

కౌంటర్‌వైపు నుంచి ఉండుండీ తుపాకుల మోత వినిపిస్తోంది. ఒక్కొక్కరే ఎక్కి అవతలివైపు దూకుతున్నారు. దాదాపు అందరూ బయటపడ్డారు. రాజేష్, నేను, మావయ్య మిగిలాం. మావయ్య పట్టుబట్టడంతో రాజేష్‌కూడా వెళ్ళిపోయాడు. ఇద్దరం వాదులాడుకుని, చివరికి నేనే బయటపడ్డాను. అప్పటికే అక్కడికి జనం చేరుకున్నారు. అటువైపు కిందికి దిగటానికి నిచ్చెనకూడా ఏర్పాటు చేశారు.

అంతా హడావుడిగా ఉంది. దూరంగా పోలీసు వాహనాల సైరన్లు అవిరామంగా మోగుతున్నాయి.

వందలమంది వాలంటీర్లు ఆ కాంప్లెక్సులోని మిగతా షాపులు,హోటళ్ళలో చిక్కుకుపోయినజనాన్ని వాహనాల్లో తరలిస్తున్నారు. మైకుల్లో ఏవేవో అనౌన్సుమెంట్లు వినిపిస్తున్నాయి. మావయ్యకోసం ఎదురు చూస్తూ నిలబడ్డాను. పది నిమిషాలు గడిచినా జాడ లేదు. నాలో కంగారు! మరో రెండు నిమిషాల భారమైన ఎదురుచూపు తర్వాత గోడ మీద అలికిడి వినిపించింది.

ఓ యువకుణ్ణి బయటికి లాగి, భుజం మీదికెత్తుకుని, మెల్లగా కిందికి దిగాడు. శరీరం నిండా గాయాలతో రక్తమోడుతున్న అతగాణ్ణి నేలమీద పడుకోబెట్టాడు. జుట్టును బట్టి గుర్తుపట్టాం. గంటన్నర క్రితం మాతో గొడవ పెట్టుకున్న కుర్రాడు! అతని మిత్రులు పత్తాలేరు.

"నేను నిచ్చెనెక్కబోతుండగా మూలుగు వినిపించింది. తేరిపారజూస్తే, దూరంగా గోడ మూలన సీకట్లో పడివున్నాడు. చావుబతుకుల్లో ఉన్నాడు..." అత్యంత మామూలు విషయంలా చెబుతున్న మావయ్యను రాజేష్‌సంభ్రమాశ్చర్యాలతోచూస్తున్నాడు. ఆయన చొక్కానిండా రక్తపుమరకలు.

మోచేతులకు గాయాలు.ఇద్దరు వాలంటీర్లు వచ్చి జుట్టు కుర్రాణ్ణి స్ట్రెచర్ మీద తీసుకెళ్ళి,అంబులెన్సులోకి ఎక్కించారు. పోలీసుల ప్రయత్నాలు ఫలించినట్లున్నాయి. టీవీ ఛానళ్ళు పోటీపడి సజీవ ప్రసారాలందిస్తున్నాయి. నన్ను, రాజేష్‌ను తోసుకుంటూ... ఆపద నుంచి బయటపడిన జనం, ప్రభుత్వాధికారులూ ధోతి ధరించిన పల్లెవాసి సాంబశివుడు మావయ్యను చుట్టుముట్టారు.

అభినందనలతో ముంచెత్తుతున్నారు. సిగ్గుపడుతూ, రెండు చేతులూ జోడించిన మావయ్యవంక నేను సంతోషంగా చూస్తూండిపోయాను.

ఫోను మోగింది. నా శ్రీమతి. "ఏవండీ, మొన్నటి నుంచీ ఫోనేలేదు!మొన్న రాత్రి మీమావయ్య కర్రసాము ప్రోగ్రాం బాగా జరిగిందట కదా!"అడిగింది. "మొన్న కాదు, అసలైన శివతాండవం ఇప్పుడు చూపించాడు. అడుగో, అభిమానుల మధ్య తడిసిముద్దవుతున్నాడు"

## ఎంతో సాధించాలి

ఇప్పటిదాకా దక్కిన గుర్తింపుకు ఆనందంగానే ఉన్నా ఇంకా సాధించాల్సింది మరెంతో ఉందంటున్నది హిమాచల్‌ప్రదేశ్ బ్యూటీ యామిగౌతమ్.

"ప్రస్తుతం నా కెరీర్ స్లో అండ్ స్టడీ అన్నట్లు వుంది. నటిగా నాకెన్నో కోరికలు ఉన్నాయి.అయినా సినీ వారసత్వం ఏదీ లేకుండా ఇంత దూరం రావడమే గొప్ప. నిజానికి అటువంటి వారసత్వం లేకుండా బాలీవుడ్‌లో కాలుపెట్టడమే కష్టం.నేనది సాధించగలిగాను.

మంచి సినిమాల్లో భాగం అయ్యాను. విజయాలు దక్కాయి. ఇవన్నీ సంతృప్తిని ఇచ్చాయి. అయినా నాకింకా చాలా ఆశలు ఉన్నాయి. వాటన్నింటినీ సాధించాలి.భవిష్యత్‌లో సాధించగలనన్న నమ్మకం ఉంది" అంటూ చెప్పుకొచ్చింది.





ఇచ్చిన హామీలు అమలుచేయక పోవటం అన్యాయం. కేంద్రంమీద పోరాటం చేయాల్సిందే.

-ఫరూక్ అబ్దుల్లా, నేషనల్ ఫ్రంట్ నేత






తొలిచిత్రంలో చిన్నపాత్రతోనే పెద్ద గుర్తింపు పొంది, పరిశ్రమలో నిలదొక్కుకున్నది అదితిరావ్‌హైదరీ. గత ఏడాది మణిరత్నం హీరోయిన్‌గా తమిళ, తెలుగు పరిశ్రమల్లో పేరొందిన అదితి మరోమారు మణిరత్నం వద్ద పనిచేస్తున్నది. ఆమెతో ఇంటర్వ్యూ విశేషాలు.

**మణిరత్నం హీరోయిన్‌గా బాగా పాపులర్ అయ్యారు మీరేమంటారు?**

(నవ్వేస్తూ) అవునా! నాకు మొదటినుంచీ ఆయనంటే అభిమానం. 1995లో చిన్నపిల్లగా వున్నప్పుడు 'బాంబె' సినిమాచూశాను. మనీషాకొయిరాలా మాదిరి నటించాలనిపించింది. ఫ్రేమ్‌లోకి దూకేయాలని మనస్సు ఆరాటపడింది.

**ఓ డ్యాన్సర్‌గా నటనకు నాట్యం ఉపకరించిందని మీరు భావిస్తున్నారా?**

టీనేజర్‌గా డ్యాన్స్ నేర్చుకుంటున్నప్పుడు ఎక్స్‌ప్రెషన్ల విషయంలో తప్పనిసరిగా ప్రభావం వుంటుంది కదా. మా టీచర్ నేరుగా తనవైపు చూస్తూ, దగ్గరగా పర్‌ఫార్మ్ చేయడాన్ని నేర్పించింది.

దాంతో నేను సహజంగానే కెమెరా ముందు కంఫర్ట్‌గా, సంతోషంగా ఫీలయ్యేదాన్ని.

**మణిరత్నంగారి దర్శకత్వంలో పని ఎలా ఉంది?**

చాలా బావుంది. నేను ఆయన ముందు ఓ స్టూడెంట్‌లాంటిదాన్ని.

ఒకవేళ మణిసర్ జంప్ చేయమంటే రెండో ఆలోచన లేకుండా చేసేయగలను. ఆయన ప్రతిచిన్న విషయంలోనూ జాగ్రత్త వహిస్తారు. పనిచేయడంలో ఉత్తమమార్గాన్ని చూపిస్తారు.

**నటి కావాలన్న కోరిక చిన్నప్పటినుంచీ ఉందా?**

కొందరు పిల్లలు డ్రామా క్వీన్స్‌గా పుడుతుంటారు. నేను అదే కోవకు చెందినదాన్ని. ఎప్పుడూ డ్యాన్సులు వేస్తూ పాటలు పాడుతూ, అనుకరిస్తూ, రకరకాల దుస్తులు ధరిస్తూవుండేదాన్ని.

సెంటర్ ఆఫ్ ఎట్రాక్షన్‌గా వుండడాన్ని ఇష్టపడేదాన్ని. అంటే అంత చిన్నవయస్సులోనే స్పష్టమైన సంకేతాలున్నాయన్నమాట.

**మీరు చేసిన పాత్రలలో మీ హృదయానికి సన్నిహితంగా వచ్చిన పాత్రలు ఏంటి?**

ఏదో ఒక ఫేవరేట్‌ను ఎంచుకొమ్మంటే చెప్పడం కష్టం. సాలి జిందగి, లండన్ ప్యారిస్ న్యూయార్క్ పేర్లు చెప్పాల్సి వుంటుంది. పరిశ్రమలో ఎవరి సాయం లేకుండా కొత్తదానిగా అడుగుపెట్టిన నేను ఎంతో కొంత సాధించగలిగాను. విమర్శకులు సైతం నాపట్ల అనుకూలంగా స్పందించడం నా అదృష్టం.

మంచి అవకాశాలు కూడా వచ్చాయి. అయితే నాకింకా బ్రేక్‌త్రో రోల్ దక్కలేదు. పరిశ్రమకు చెందని





వారికి, గాడ్ ఫాదర్ లేనివారికి మరింత ఎక్కువ అల్లిక కావాల్సివుంటుందనేది నా అభిప్రాయం.

**కొత్త పాత్రకు ఎలా సిద్ధం అవుతారు? కోచ్ ఉన్నారా?**

దర్శకుడుచెప్పింది వింటాను.పాత్ర తీరు బాగా అర్థంచేసుకుంటాను. నేను ఐదేళ్ళ వయస్సునుంచి డ్యాన్స్ చేస్తు న్నాను. అసంకల్పితంగా చేసేస్తుంటా. అలాగే కెమెరాముందుకువెళ్తే పూర్తిగా నిమగ్నమైపోతుంటా.

ఇక్కడ మెథడ్స్ ఏవీ వుండవు. ఫీలింగ్ ఉంటే చాలనుకుంటాను. ఫీల యితే అది కళ్ళలో కనపడుతుంది.

**ఫోటో షూట్లు చేశారు కదా? మోడ లింగ్ అంటే ఇష్టమా?**

నాకు కెమెరా అంటే ఇష్టం. అది స్టిల్ అయినా కావచ్చు. మువింగ్ అయినా కావచ్చు.

**సాధారణ పాత్రను పెద్ద హీరోతో, బ్యానర్ల కింద చేయడానికి ప్రాధాన్యం ఇస్తారా?**

అటువంటి హద్దులు నాకు లేవు. స్క్రిప్టు, కొత్త దర్శకుడు ఆసక్తిదాయకం అనిపిస్తే హీరోయిన్ ఓరియంటెడ్ సినిమాలు చేస్తాను.

మంచి స్క్రిప్టు, మంచి దర్శకుడు మంచి కథను చెప్తాయి. మంచి సినిమా అవుతుంది. సక్సెస్ గురించి అంచనాలు వేస్తూ, సినిమాలు చెయ్యలేం. మనపట్ల మనకు నమ్మకం వుండాలి.

**మీ గురించి తెలియని విషయం ఏమైనా చెప్తారా?**

నా భుజాలపై డింపుల్స్ వుంటాయి. ఫోటోగ్రాఫర్లకు వాటిని ఫోటోషాప్ చేయ వద్దని చెప్తుంటా.

**మంచిఅవకాశాలు, బలమైనపాత్రలు టాప్ పొజిషన్‌లోగల ఇద్దరు, ముగ్గురుతారలకే దక్కుతా యన్న అభిప్రాయం వుందా?**

దీనిలో పూర్తి నిజం లేదు.

అయితే సపోర్ట్, సాలిడ్ పొజిషన్ లేనప్పుడు పూర్తి ఉత్తమమైనదాన్ని ఎంచుకోవడం సాధ్యపడదు.

మరో మార్గం వెతుక్కోవాలి, రిస్కులు చేయాలి. రెండు, మూడేళ్ళకో నాకంటూ ఓ గూడును ఏర్పరచుకో గలనని చెప్పలేం.

**'ఢిల్లీ 6' చేసి ఆరేళ్ళయింది. ఈ కాలంలో బాలీవుడ్ గురించి ఈ సమయంలో నేర్చుకున్న మూడు విషయాలేంటి?**

మూడుకు మించి మరెన్నో నేర్చు కున్నాను. ఎప్పుడూ సంతోషంగా వుండాలన్నది మొదటిది.

మనమార్గంలో మనం పయనిస్తే దీర్ఘకాలం మనగలమన్నది రెండోది.

తేలికపాటి హృదయంతో ప్రశాం తంగా నిద్రించాలన్నది మూడోది. వృత్తి గతాన్ని వ్యక్తిగతంతో విడదీయాలన్నది అన్నింటికంటే ముఖ్యమైనది.

**మీ దృష్టిలో ఫ్యాషన్ అంటే?**

ఫ్యాషన్ అన్నది ప్రయత్నపూర్వ కంగా కాకుండా సహజంగావుండాలి.

**మహిళ జీవితం ఉన్నతంగా ఉండా లంటే ఏం కావాలంటారు?**

తనను తాను గౌరవించుకోవాలి అంటూ ముగించింది.

**అయినపూరి సుజాత**

# హృదయం ఎక్కడున్నదీ...?

## సీరియల్

ఎదురుగా ముఖానికి స్కార్ఫ్. తలమీద హెల్మెట్‌తో యశస్వి!

"ఓ గాడ్..." అంటూ ఒక్కక్షణం అయోమయంగా ఫోన్‌వైపు, ఆమెవైపు మార్చిమార్చి చూశాడు అతను.

"మే ఐ కమిన్?" అడిగింది. ఒకపక్కనుంచి అతడ్ని ఛాతీమీద తోస్తూ!

"ప్లీజ్! డు కమ్!" అతను దారికి అడ్డం తొలిగాడు. లోపలికి వచ్చిన ఆమె హెల్మెట్ తీసి, పక్కనే ఉన్న ఫ్రెంచ్ విండోలో పెట్టింది.

డాక్టర్ బొమ్మదేవర నాగకుమారి

పరిస్థితి అర్థమై తలుపువేసి బోల్ట్ పెడ్తోన్న అతడ్ని వెనకనుంచి కౌగిలించుకుంది.

అతని చేతుల క్రిందనుంచి తన చేతులను పోనిచ్చి, అతని భుజాలపై తన చేతులను ఉంచి తనకు దగ్గరగా అదుముకుంది.

పిడుగుపడ్డమేరా నేలమీద గుంతపడుతుంది.అలా వెనుకనుంచి ఆమె కౌగిలించుకున్నప్పుడు ఆమె వక్షోజాలు తన వీపుమీద ఒత్తుకుపోయినంతమేరా... అతనికి అచ్చంగా అలాంటి ఫీలింగ్ కలిగింది.

అతను కొద్దిగా తలతిప్పి చూశాడు.

అతని భుజమ్మీద తన తలానించి అతడ్నే చూస్తూ ఆమె! అతని శరీరంలో ఒక్కసారిగా వెయ్యి ఓల్టుల విద్యుత్తు ప్రసరించటం మొదలైంది.

ఆమె చేతులమీద తన రెండు చేతులూ వేసి, అలాగే నెమ్మదిగా వెనుతిరిగాడు.

ఆ తిరగటంలో అతని చేతిలోని మొబైల్ జారి పోయింది. ఒకరికొకరు అభిముఖంగా నిలబడ్డారు.

ఒకరి ఊపిరిలో మరొకరి ఊపిరి కలిసేంత చేరువగా ఉన్నారు.

ఆమె ముఖానికి స్కార్ఫ్ కట్టుకున్నట్టుగా లేదు. సుతారమైన మేలిముసుగు తలమీద నుంచి వేసు కున్న కొత్త పెళ్ళికూతురిలా తోచింది. 'యే సుహాగ్ రాత్ హై! గూంఘట్ ఉఠా రహా హు మై...'

'ఇది తొలిరేయి... నీ మేలి ముసుగుని నేను తొలగిస్తున్నాను!' 'నా సిగ్గుదొంతరలని నీ బాహువుల మధ్య దాచుకుంటాను....' ఎక్కడనుంచో పాత హిందీ పాట వినిపించింది.

ఆమె ముఖానికి కట్టుకున్న ఆకుపచ్చని రంగు స్కార్ఫ్‌లోంచి కేవలం ఆమె కళ్ళు ఆకుపచ్చని ఆకుల మధ్యలోని రెండు తెల్లతెల్లని నందివర్ధనం పూల లాంటి కళ్ళు! ప్రేమ ఊసులు చెప్తున్న ఆ కళ్ళు!

ఆ కళ్ళనిండా తనమీద ప్రేమ! ఆ కళ్ళల్లోకి చూస్తూ ఆమె ముఖమ్మీదికి వంగాడు.

ఆమె గుండె వేగంగా కొట్టుకోసాగింది. ఆమె కనురెప్పలు మూసుకుంది.

తన కోసం కలలు కన్న ఆ కళ్ళపై వింజామరల్లా కనురెప్పలు! ఆ కనురెప్పలపైన ముద్దులు పెట్టాడు. అక్కడ్నుంచి ముక్కుచివర ఓ ముద్దు!

అంత దగ్గరగా ఉండటంమూలాన స్కార్ఫ్ వెనక నున్న ఆమె పెదవులు చిన్నగా కంపించటం అత నికి తెలుస్తోంది. తన పెదవులతో ఆమె పెదవుల్ని చిన్నగా ఒత్తాడు.

స్కార్ఫ్‌మీదనుంచి కూడా అతని వెచ్చని ఊపిరి ఆమెకు తెలుస్తోంది.

ఆ తెలితేమ మీసాలకు అంటుకుంది. తన పైపెదవిపైన గిలిగింతలు పెడుతున్న మీసాలు! ఆమెలో నిలువెల్లా ప్రకంపనలు.

### బాలీవుడ్ బాట

దక్షిణాదిలో చాలా సినిమాలే చేసి, బావుంది. బాగా నటించిందన్న పొగడ్తలు అయితే అందు కున్నది కాని, రెజీనా కాసెండ్రాకు అనుకున్నంత బ్రేక్ మాత్రం రాలేదు.

'అ'లో మార్చేసిన రూపం, నటన అదుర్స్ అన్నా రంతా. ఈ దక్షిణాది కబుర్లను పక్కనపెడితే, ఉత్తరాదిలో షూటింగ్‌లో చేరిపోయింది రెజీనా.

'ఏక్ లడ్కీ కో దేఖాతో ఏసా లగా' సినిమాలో రెజీనా నటిస్తున్న సంగతి తెలిసిందే.

ఎక్కువమంది పెద్ద నటీనటులు వున్న ఈ చిత్రంలో రెజీనాకు ఎంతపాటి గుర్తింపు లభి స్తుందో, ఏమో కాని మొత్తానికి బాలీవుడ్‌లో పునాది రాయి వేసేసింది.



### జరిగిన కథ

11

మైత్రేయి మెయిల్ పంపిస్తుంది. తనూ, బిందు సహజీవనం చేయనున్నామని తెలియ జేస్తుంది. ఇద్దరు ఆడవాళ్ళు జంటగా బతకడ మేంటని అసహజంగా అన్పిస్తుంది యశస్వికి.

విష్ణు, యశస్వి ఇద్దరూ గాఢంగా ప్రేమలో పడతారు. తన తాతగారికి జరగబోయే సహస్రచంద్ర దర్శనానంతర శాంతి కార్యక్రమ ముగా తన ఇంట్లో జరిగే గెట్ టు గెదర్‌కు అందర్నీ ఆహ్వానిస్తాడు విష్ణు.

యశస్విని కూడా రమ్మని చెపుతాడు.

యశస్వి నీతూతోసహా సహస్రచంద్ర దర్శన కార్యక్రమానికి హాజరవుతుంది.

కుడిచేతిని తల వెనకకు పోనిచ్చి స్కార్ఫ్ ముడి విప్పేసింది. మేలిముసుగు జారిపోయింది. ఆగామి కాలానికి మనశ్శరీరాలు సంసిద్ధమవుతున్నాయ్!

అలాగే సూటిగా అతని కళ్ళల్లోకి చూస్తూ ఆమె! నిగ్రహించుకోవటం అతనికే చాలా కష్టంగా ఉంది. అయినా విచక్షణ హెచ్చరిస్తుంది.

"లెటజ్ ప్రిజర్వ్ ఇట్!" ఆగాడతను... అమాయకంగా ఊగుతోన్న ఆమె చెవిజూకాను చూస్తూ!

ఆమె వెళ్ళి దీవాన్‌మీద కూర్చుని చిన్న దిండుని తీసి గుండెలకు హత్తుకుంది. ఆమెని ఇంకా ఫేస్ చేయలేక కాఫీ కలిపే వంకతో కిచెన్‌లోకి వెళ్ళాడు.

ఇంకో రోజు వచ్చీరావటంతోనే "విష్ణూ! ఈ రోజు మనం లాంగ్ డ్రైవ్‌కి వెళదాం" అని అడిగిందామె.

"సరే పద" అన్నాడతను.

ఇద్దరూ కలిసి పార్కింగ్ ప్లేస్‌లోకి వచ్చారు.

అతను కారు తాళం తీయటానికి రిమోట్ నొక్కుతుంటే అతని చెయ్యి పట్టుకుని, ఆమె చెప్పింది "కారు వద్దు. నా బైక్‌మీద వెళదాం" అని.

"సరే" అన్నాడతను.

తన చేతిలో ఉన్న బైక్ తాళం చేతులు అతనికి ఇచ్చి "నువ్వు డ్రైవ్ చెయ్యి" చెప్పింది.

అతను తలవూపి హ్యాండిల్‌బార్‌మీద చెయ్యేసి చెప్పాడు- "నేను బుల్లెట్‌ని నడపటం ఇదే ఫస్ట్‌టైమ్"

"నో ప్రాబ్స్!" చెప్పింది.

అతను బైక్ స్టార్ట్ చేసినతరువాత ఆమె అతని వెనక అటూ ఇటూ కాళ్ళువేసి కూర్చుంది.

కొంచెం ముందుకు వెళ్ళినతర్వాత తల వెనకకు తిప్పి చెప్పాడతను.

"ఇది కొత్త ఎక్స్‌పీరియెన్స్ బాగుంది కదూ?"

ఆమె నవ్వుతూ అతడ్ని హగ్ చేసుకుని, అతని మెడమీదకి వంగి "అవును" అని చెప్పింది.

చెప్తూనే అతని మెడమీద ముద్దుపెట్టింది.

అతను కూడా ప్రక్కకు తిరిగి ఆమె చెక్కిలిమీద ముద్దుపెట్టాడు.

"డ్రైవింగ్ చేసేవాళ్ళు ముద్దులు పెట్టకూడదు"

తల్లి సురేఖను యశస్వికి పరిచయంచేస్తాడు విష్ణు. కాబోయే కోడలుగా భావించి సంతోషపడుతుంది సురేఖ. ఆ కార్యక్రమానికి వచ్చిన వారందరూ యశస్వి, విష్ణుల జంట బావుందనుకుంటారు. ఫ్లాట్‌కి వచ్చాక ఆ జంటకు ప్రైవసీ కల్పించి పక్కకు తప్పుకుంటుంది నీతూ.

విష్ణు ఇంట్లో అతని పేరెంట్స్ లేరు. అయినా ధైర్యంగా వెళుతుంది యశస్వి.

అలా తరచుగా వెళుతుండేసరికి అతనిమీద ప్రేమ ఎక్కువవుతుంది ఆమెకు. వాళ్ళిద్దరూ ఇంట్లో ఉన్నప్పుడు ఎవరో కాలింగ్‌బెల్ కొట్టేసరికి విసురుగా తలుపు తీస్తాడు విష్ణు.

ఇక జరగబోయేది చదవండి.

గడుసుగా చెప్పిందామె.

"హెల్మెట్ పెట్టుకోవాలన్న ఆర్టీయే రూల్ నాకు తెలుసు కానీ, ఈ రూల్ నాకు తెలీదే?" అల్లరిగా అన్నాడు అతను.

"అబ్బో విష్ణుకు కూడా మాటలు వస్తున్నాయే?" అని కవ్వించింది.

"సావాసదోషం!" చెప్పాడు.

అతనికి ఆ డ్రైవ్ అద్భుతంగా అనిపించసాగింది. అయితే సడన్‌గా వర్షం మొదలైంది.

"అయ్యయ్యో!" అన్నాడతను.

"ఏం పర్లేదు! వెళదాం!" ఉత్సాహంగా చెప్పింది ఆమె. వర్షం అలా కురుస్తూనే ఉంది.

చాలా ప్రత్యేకమైన వాతావరణం ఈ బెంగళూరు వాతావరణం! ఉదయం వేళల్లో లేత ఎండ, మధ్యాహ్నమయితే చాలు మబ్బులు, ఇక సాయంత్రమయితే చాలు ఎక్కడో ఒకచోట వర్షం!

ఏ సుదూర తీరాలనుంచో సర్వాంతర్యామి ప్రేమికులకు తన కానుకగా పంపుతున్న ముత్యాలదారాల్లా వానజల్లులు కురుస్తున్నాయ్!

వాళ్ళిద్దరూ తడిసి ముద్దవుతున్నారు. ఎంత తడిసినా చలి అనేదే తెలియకుండా వాన నీటికి వేడిని పుట్టించే శక్తి ఏదైనా ఉందా? ప్రకృతి ఆ శక్తిని ప్రేమికులకు మాత్రమే ఇస్తుందేమో? మెరుపు వేగంతో వచ్చే వాన చినుకులు! అతను కాదనలేక ముందుకు పోనిచ్చాడు. కొంత దూరం వెళ్ళాక ఒక పెద్ద చెట్టు కనిపించింది.

"ఇక్కడ కొంచెంసేపు ఆగుదాం!"అంటూ అతను బైక్‌ని ఆపాడు.

ఇద్దరూ చెట్టుక్రింద నిలబడ్డారు. చలివల్లకాబోలు ఆమె బాగా వణుకుతోంది.

అతడు ఆమెని దగ్గరకు తీసుకుని "చలి వేస్తుందా?" అని అడిగాడు.

"కాదు థ్రిల్లింగ్‌గా ఉంది" చిరునవ్వుతో చెప్పింది ఆమె. కానీ ఆమె పెదవులు వణుకుతున్నాయ్! వేసుకున్న దుస్తుల నుంచి నీళ్ళు కారుతున్నాయ్! వాన తగ్గే సూచనలే కన్పించట్లేదు.

"తిరిగి వెళదామా?" అడిగాడతను.

ఆమె తలూపింది.

తిరిగి తడుస్తూనే ఇంటికి వచ్చారు.

ఇద్దరూ పూర్తిగా తడిసి ముద్దయ్యారు.

తలలమీదినుంచి నీళ్ళు కారుతున్నాయ్. వాళ్ళు నడిచినంతమేర క్రింద నీళ్ళు పడ్డాయ్.

తాళం తీసి అతను ముందు నడుస్తుంటే అతని అడుగులో అడుగువేస్తూ, ఆమె వెనకే నడవసాగింది. అతడు తిరిగిచూసి, "కమాన్! కమాన్!" అంటూ ఆమెని మెట్లమీదనుంచి తన బెడ్రూమ్‌లోకి తీసుకువెళ్ళాడు.

లోపలికి వెళ్ళినతర్వాత గుర్తుకువచ్చిందతనికి



# చిలిపి

దార్లో మగాడు అకస్మాత్తుగా ఎదురైతే ఆడది పైట సరి చేసుకుంటుంది. మరి మగాడో?"
క్రాఫ్ సరిచేసుకుంటాడు.

ఏమే! నిన్న నేను చెప్పిన నిప్పు లాంటి విషయం పక్కింటావిడకు ఎందుకు చెప్పావ్?
మనసులో ఉంటే మండుతుందని, తీసి ఆవిడ చెవిలో వేశా.

భార్యాసమేత నిషిద్ధ స్థలాలేవి?
బట్టలకొట్టు, ఫ్యాన్సీషాపు.



మీరు 'ఎగిరే పళ్ళాలు' (Flying Saucers) చూశారా?
రోజూ ఇంట్లో చూస్తున్నాం గదా!

డైలీ పేపర్లెందుకు?
మధ్యాహ్నం నిద్రపోతున్నప్పుడు ఈగలు వాలకుండా కప్పుకోవడానికి.

గురూ! ఒక పచ్చి అబద్ధం చెప్పు?
పదిరూపాయిలిస్తా.
"ఆఁ ఆఁ ఇరవై ఇస్తానని పది అంటున్నావ్"

మర వేసిన ఇడ్లీపిండికి, మనిషి రుబ్బిన పిండికి తేడా?
మర వేసిన పిండికి ఉప్పు వేసుకోవాలి. కాని, మనిషి రుబ్బిన పిండికి అక్కర్లేదు!

వాకిళ్ళ దగ్గర వధూవరులచేత పేర్లు చెప్పిస్తారు దేనికి?
అంతమందిలో వాళ్ళేమన్నా మారుపడ్డారేమోనని!

ఆమెకి ఇంకో జత దుస్తులు లేవని!

'ఇప్పుడెలా?' లోపల్లోపల ఆలోచిస్తూనే ముందుగా కింగ్ సైజ్ టర్కీ టవల్ ఒకటి తెచ్చి ఆమె తలని మృదువుగా తుడిచాడు.

ఆమె ఒక చేతివ్రేళ్ళల్లో ఇంకో చేతివ్రేళ్ళు జొనుపుకుని రెండు చేతుల్నీ చుబుకం క్రింద పెట్టుకుంది. లోపల్నుంచి వస్తున్న వణుకు ఎంతకీ తగ్గదే!

ఆ చలిని ఎలా కంట్రోల్ చేసుకోవాలో తెలీటం లేదు. తనవల్ల కావటంలేదని అర్థమై రెండు చేతులూ అతనిచుట్టూ వేసి బిగియారా కౌగిలించుకుంది.

పరిస్థితి అర్థమై అతనుకూడా ఆమెని మరింత దగ్గరగా పొదువుకున్నాడు.

ఆ ఒత్తిడికి వారి శరీరాలమీదున్న తడిబట్టలమీద నుంచి ఇంకా ఎక్కువగా వాన నీళ్ళు కారుతున్నాయ్. వెంటనే అతనికి ఒక అయిడియా వచ్చింది.

"వన్ సెకన్! ముందు నువ్వు ఈ డ్రెస్ మార్చుకుందువుగానీ ఉండు!" అంటూ అలానే తన వార్డ్ రోబ్‌లోంచి ఓ నైట్ డ్రెస్ తీసి ఆమెకి ఇచ్చి వాష్‌రూమ్‌వైపు చూపించాడు.

ఆమె చిన్నగా వణుకుతూనే లోపలికి వెళ్ళింది.

మరో టవల్ తీసుకుని అదిమిపెట్టి తన తల గట్టిగా తుడిచేసుకుని గబగబా దుస్తులు మార్చేసుకుని ఆమెకోసం ఎదురుచూడసాగాడు.

కార్నర్ టేబిల్‌మీద బుద్ధుడు ధ్యానంలో ఉన్నాడు. ఆమె దుస్తులు మార్చుకుని, భుజాలమీదనుంచి టవల్‌ని షాల్‌లా చుట్టుకుంది. లో దుస్తులు ఏవీ లేకుండా అతని దుస్తులు వేసుకుని వచ్చి అతడ్ని ఎలా ఫేస్‌చేయాలో ఆమెకి అర్థంకాక తలొంచుకుని, చేతులను అలానే చుబుకంకింద పెట్టుకుని, నెమ్మదిగా అడుగులో అడుగు వేస్తూ బయటకు వచ్చింది.

"ఇటు రా! ఇక్కడ కూర్చో!!" అని మంచమ్మీద చోటు చూపించాడు.

ఆమె కూర్చుంది. ఆ టవల్ తీసేసి, బ్లాంకెట్ తీసి కూర్చున్న ఆమె చుట్టూరా కప్పాడు.

తరువాత ఆ విడిచిన దుస్తులను వాషింగ్‌మెషీన్‌లో వేసి డ్రయ్యర్ ఆన్ చేశాడు. అతను చేస్తున్న ప్రతి పనినీ ఆమె గమనిస్తూనే ఉంది.

ఏంచేస్తున్నా అతను తననెంతో జాగ్రత్తగా చూసుకుంటున్నాడని అర్థమవుతోంది. అంతలోనే కిందికి వెళ్ళి కాసేపట్లో వేడి పాలగ్లాసుతో తిరిగివచ్చాడు. "యశూ! అరగంటలో నీ డ్రస్సు రెడీ అవుతోంది. ఇదుగో ఈలోగా ఈ వేడివేడి పాలు తాగు!" చెప్పాడతను. గ్లాస్‌లోంచి సన్నని వెచ్చని ఆవిరివస్తోంది.

రెండు చేతుల్తో పాలగ్లాస్‌ని పట్టుకుని చేతుల్ని వెచ్చచేసుకుంటూ నెమ్మదిగా తాగసాగింది. అతను కుర్చీ లాక్కుని ఆమె ఎదురుగా కూర్చున్నాడు.

విష్ణు ఆమెనే ఆత్రుతగా చూస్తున్నాడు. ఆమెకి ఇప్పుడా చూపులు సీతాకోకచిలుకలై తన శరీరమ్మీద తారట్లాడుతూ గిలిగింతలు పెడుతున్నట్లనిపించింది.

ఖాళీ కప్పుని అందుకుని, కింద పెట్టాడు. ఆమెనే చూస్తూ బాగా చల్లబడ్డ ఆమె అరచేతిని తన చేతిలోకి తీసుకుని వేడి పుట్టించటాని కన్నట్టుగా నెమ్మదిగా తన చేత్తో రాస్తూ-

"యశూ! నీ డ్రస్సు రెడీ అయ్యేలోపు మనం వేడి వేడిగా ఆమ్లెట్ తిందామా...?" అడిగాడతను.

వద్దన్నట్టుగా తల అడ్డంగా ఊపింది.

ఎందుకు అన్నట్టుగా చూశాడు. ఆమె తన అరచేతివైపు చూసుకుంది. అతని స్పర్శ మునివేళ్ళలోంచి, అరచేతిలోంచి అక్కడ్నుంచి లోపల ఎక్కడికో విద్యుత్తుని ప్రసరింపచేస్తున్నట్టు అన్పిస్తోంది.

అంతరాంతరాల్లో గడ్డకట్టిన బిడియం కరుగుతూ శరీరానికి ఏదో హాయినిస్తోంది.

శరీరం తన మాట వినటంలేదు. అతని చేతుల్లోంచి తన చేతిని తీసుకుని లేచి నిలబడింది.

అతను కూడా లేచి నిలబడి రెప్పవేయకుండా ఆమెనే చూడసాగాడు.

ఆమెకు అర్థమైంది. ఈ చూపులు వేరు! తనని అభిషేకిస్తున్నాయ్! ప్రేమకు గుండెలో చోటుసరిపోక ఆ ప్రేమ కళ్ళల్లోకి జాలువారుతోంది.

"నన్ను హగ్ చేస్కో" చేతులెత్తింది.

ప్రేమలో పడటం చాలా ఈజీ! అలా పడ్డవాళ్ళని పదిలంగా పట్టుకుని అక్కున చేర్చుకునే ప్రేమికుడు దొరకటం అపురూపం! అతను చిరునవ్వుతో ఆమెని దగ్గరకు తీసుకున్నాడు... అచ్చంగా తన మరో శరీరాన్ని దగ్గరకు తీసుకున్నట్టే!

"ఇంకా గట్టిగా" అంటూ గుసగుసగా చెప్పింది యశస్వి.

బలమయిన బాహువులతో ఆమెని ఇంకా దగ్గరకు పొదువుకున్నాడతను.

అంబేద్కర్ పేరును రాజకీయాలలోకి లాగక ఆయన చూపిన మార్గంలో పయనించే యత్నం చేద్దాం.
-నరేంద్రమోడీ, ప్రధాని



సన్నజాజుల సముద్రం ముంచెత్తినట్టు, ఆ పరిమళం మనస్సంతా కమ్మేసినట్టు ఈ కౌగిలి ఇంత మత్తు గొలుపుతుందేమిటి?

ఈ క్షణాలు ఇంత మధురంగా ఉన్నాయేమిటి? ఇతను ఈమధ్యే కన్పించాడా?

ఇంకే జన్మలో అయినా పరిచయమా? తనువూ, మనస్సూ, వయస్సూ అతను కావాలంటున్నాయ్! ప్రాణానికి ప్రాణమైన అతనితో తన పంచప్రాణాల్నీ, తన సర్వస్వాన్నీ పంచుకోవాలనుంది.

ఆ కౌగిలింతలో సునామీ పొంగింది. క్రమంగా మైకం కమ్ముకువచ్చింది. తెలియని వేడి ఒళ్ళంతా జరజరా పాకుతోంది. ఊపిరి బరువయిపోతోంది. ఒక విద్యుత్ ప్రవాహం శరీరమంతా ప్రాకింది.

"వియ్ విల్ హ్యావిట్ టుడే!" చెప్పిందామె. ఏదో జరగబోతుందన్న భయంకన్నా ఏం జరుగుతుందో చూడాలన్న కుతూహలమే ఎక్కువ!

"ష్యూర్ డియర్...!" ఒప్పుకున్నాడతను.

ఏమవుతుందేమవుతుంది?

అతని స్పర్శకీ, చూపుకీ పెద్ద తేడా లేదని ఆమెకి అర్థమయింది. అంతే మార్దవం! తను ఎటు తిరిగితే అటు తిరిగే పొద్దుతిరుగుడు పువ్వులాంటి ఆ అమ్మాయ్ ముఖారవిందాన్ని తన రెండు చేతుల్లోకి తీసుకుని, ముందుగా ప్రేమగా ఇంద్రధనుస్సులాంటి ఆమె కనుబొమల్ని నిమిరాడు.

ఆమె కళ్ళల్లోకి తదేకంగా, తమకంగా రెండు క్షణాలు చూశాడు. జన్మజన్మల బాసలు!

అతని దృష్టి ఒత్తైన ఆమె క్రింది పెదవిపై పడింది. విల్లులా వంగిన ఆ పెదవి వంపు సౌఖ్యశిఖరాన్ని అధిరోహించటానికి వేసిన మొదటి మెట్టులా తోచింది.

ముందుకు వంగి ఆమె ముఖమ్మీద తన ముఖాన్ని ఆనించి, సున్నితంగా పెదవులను స్పృశించి, ఆ పెదవులపై తన పెదవుల్ని సుతిమెత్తగా ఒత్తి, కొద్దిగా తడిచేసి, రాపిడితో వేడి రగిలించి, మునిపంట నొక్కి, నాలుకతో రహస్యాలు శోధించసాగాడు.

ఆ ముద్దు సుదీర్ఘమై, నిశ్చలమై, మధురమై.... శ్వాస తీసుకోవటం మరచిపోయిందామె.

## ఎంతో నచ్చింది

'కృష్ణార్జున యుద్ధం'లో సుబ్బలక్ష్మి పాత్రలో మహాజోరుమీదున్నది అనుపమా పరమేశ్వరన్.

"నా పాత్రకు, నాని పాత్రకు నడుమ కెమిస్ట్రీ బాగా కుదిరింది. నాని చాలా క్యూట్. ఇంకా ఎలా వివరించాలో కూడా తెలియడంలేదు. తనతో కలసి పనిచేయడాన్ని నేను బాగా ఎంజాయ్ చేశాను. మిగతా లవ్ ట్రాక్స్‌కి ఇది భిన్నమైన సినిమా.

ఈ చిత్రంలో నాపాత్ర నాకు ఎంతగానో నచ్చింది" అంటూ సినిమా ప్రేక్షకుల ముందుకు వచ్చేసినా, పాత్ర గురించి పదేపదే స్వంతంగా చెప్పుకుంటూ ఉల్లాసపడిపోతున్నది. నిజమే కదా!

అంత మత్తులో కూడా ఆమెకర్థమయింది. ఓహ్‌గాడ్! అదీ ముద్దంటే! ఈ ముద్దంటే ఎవరికిమాత్రం చేదేం? ముద్దు సున్నితమయినది. మహత్తరమయినది, అద్భుతమైనది. అర్థవంతమయినది. అనిర్వచనీయమయినది.

'తెలుగుదేశం' ఎన్డీఏ నుండి తప్పుకున్నా ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి బి.జె.పి. కట్టుబడే వుంది.

-ప్రకాష్ జవదేకర్, కేంద్రమంత్రి



ముద్దు తియ్య తియ్యగా ఇంకా నాలుక చివర్లో మిగిలిపోయి ఇంకేదో కావాలంటోంది.

ముద్దు శృంగార జీవితానికి సౌందర్యవంతమయిన పీఠిక కదా మరి?! దాహాలు పెదవులు దాటక, మోహం తీరక... అదే విరహం!

అది మైకమూ కాదు మెలుకువా కాదు. శిశిరంలో చెట్లు ఆకుల్ని రాల్చటం ఎంత సున్నితంగా జరుగుతుందో అంత సున్నితంగా వారిరువురి శరీరాలమీద నుంచి దుస్తులు అలా దూరమయ్యాయ్!

ఆమె మెడమీద, కంఠమ్మీద, చెవిమీద, చెవితమ్మెమీద, చేతులమీద, ఎదమీద, పొత్తికడుపుమీద... శిరస్సునుంచి పాదాలదాకా ప్రతి అంగుళమ్మీద ఎడతెరిపి లేకుండా ముద్దుల వర్షం కురుస్తూనే ఉంది. ప్రవాహంలోని ఒంపుసొంపులను తలపింపచేస్తోన్న ఆమె శరీరాన్ని అపురూపంగా చూపులతోనే స్పర్శిస్తున్నట్టు చూశాడు.

వరదపొంగులాంటి యవ్వనం ఒంటినిండా నిండిపోయి తొణికిసలాడుతోంది.

రెండు కళ్ళూ పట్టని అందం.

ఆ మహాసౌందర్యానికి దాసుడైపోయాడు.



అది ఎదో? మల్లె పొదో...? నాజూకు తనాన్నంతా ప్రోదిచేసుకున్న ఆ నడుము. ఏ కవీ రాయలేని పద్యంలాగా ఉందామె. ఆపాదమస్తకం ఆమెను ఓ పుస్తకంలా చదివాడతను.

మన్మథుని చేతిలో చెరకుగడ విరిగిపోయింది. తీవ్రమయిన కోరికతో అల్లుకుపోయాడు. తనివితీరా, బిగియారా అతడ్ని దగ్గరకు పొదువుకుంది.

వ్యాయామంతో కండలు తీరిన అతని దేహం ఆమెకీ, మల్లెలూ మరువమూ కలిపి ఒత్తుగా మాల కట్టినట్టున్న తీరైన ఆమె శరీరం అతనికీ మత్తెక్కిస్తున్నాయ్! భోజనమే కాదు, రొమాన్స్ కూడా కనువిందుగా ఉండాలి కదా?

రక్తనాళాలన్నీ మధువు నింపుకున్నట్టు, శరీరం లోపల అమృతభాండాగారం ఏదో దొర్లినట్టు, ఆ అమృతం నిరంతరంగా ప్రవహిస్తున్నట్టు, ఏవేవో మధురలోకాల్లో విహరించినట్టు, శరీరం సూక్ష్మరూపంలోకి మారి విహంగమై ఎక్కడెక్కడికో ఎగిరినట్టు... ఆ క్షణాలే శాశ్వతమన్నట్టు తోస్తోంది.

తమమధ్య ఉన్న భౌతిక దూరాలు మాయమయి ఆత్మలు ఆలింగనం చేసుకున్నట్టన్పిస్తోంది.

రెండు దేహాలతో ఆత్మసమాగమానికి చేసే ప్రయత్నమది! రెండు ఆత్మలు ఏకమవుతున్న పులకింత! వారిద్దరూ ఇద్దరిలా కాక ఒకే ఆత్మలా, ఆ ఆత్మకోసమే ఈ రాత్రి సృష్టించబడింది అన్నట్టు... దేహం ఎవరిదో, ప్రాణం ఎవరిదో తెలీటంలేదు. ఒక దేవత అతడ్ని కరుణించింది... తరింపచేసింది.

మన్మథుని ప్రణయచేష్టకు రతీదేవి కంఠహారాన్నుంచి తెగిన ముత్యాలసరంలోంచి వేరుపడిన ముత్యాల్లా స్వేదబిందువులు.

కాలం కల్లై, కల ఇంద్రధనుస్సై.. 'కొంతకాలం కొంతకాలం కాలం ఆగిపోవాలి! నిన్న కాలం మొన్న కాలం రేపు కూడా రావాలి!!' రొమాన్స్ ఎప్పుడూ మనశ్శరీరాలకు సంబంధించింది.

రెండు శరీరాలు ఒక మనస్సు, మనఃశ్శరీరాల మహాద్వైత సమాగమంతో జన్మ పునీతమవుతుంది. 'నువ్వు', 'నేను'లే లేని ఒక రసైక జగతికి, ఒకానొక మహార్ద్ర స్థితికి చేరుకున్నారు.

ఇద్దరుగా ఉన్న ఆ ఒక్కరిని అలౌకిక దివ్యత్వం ఆవహించింది. ఆనంద వివశులైన భావం కలిగింది! ఆనందార్ణవపు ఆఖరి అంచుకి చేరుకున్న తమ కల యొక దివ్యపరిణామంలా తోస్తోంది.

# నవగ్రహాల కథల పోటీ ఫలితాలు

నవగ్రహానుగ్రహం లభించినవారే ప్రపంచ విజేతలవుతారు. గ్రహదోషం వున్నట్లయితే చిన్న చిన్న పరిహారాలతో సంతృప్తి చెంది సుదీర్ఘ శుభఫలితాలనిచ్చే మహానుభావులు గ్రహాధిదేవతలు.

నవగ్రహాల కథల పోటీలో పాల్గొని గ్రహప్రభావాలను వివరించి, ఆ యా రాశుల్లో గ్రహసంచారంవల్ల కలిగే దుష్ఫలితాలకు జ్యోతిష శాస్త్రవేత్తలతో సంప్రదించి, వారు చెప్పిన రెమిడీలను తమ కథల ద్వారా అందించిన రచయిత(త్రు)లందరికీ అభినందనలు. ఏ పోటీ పెట్టినా సక్సెస్ చేసే రచయిత(త్రు)లందరికీ కృతజ్ఞతలు.

## ₹10,000 చొప్పున బహుమతి పొందిన కథలు

1. **కిరణం** – పి.వి.ఆర్.శివకుమార్
(రవి - ఆరోగ్యాన్ని ప్రసాదించేవాడు)
2. **చంద్రోదయం** – లోగిశ లక్ష్మీతులసి
(చంద్రుడు-మానసిక బాధలను తొలగించేవాడు)
3. **గతకాల ప్రయాణం** – ప్రతాప రవిశంకర్
(కుజుడు - అప్పులు తొలగించేవాడు)
4. **గెలుపెవరిది** – సి.యమున
(బుధుడు - వ్యాపారాభివృద్ధికి)
5. **లేచిపోవాలనివుంది** – సూర్యప్రసాదరావు
(గురువు - శుభాలనిచ్చేవాడు)
6. **తాతయ్య** – టి.ఎస్.ఆర్.కె.గాంధీ
(శుక్రుడు-వివాహాలకు, దంపతుల అనుబంధాలకు)
7. **దుర్గమ్మ కూతురు** – డా॥ ఎమ్.సుగుణరావు
(శని - అహంకారాన్ని తొలగించేవాడు)
8. **దీపంకింద నీడ** – దాట్ల దేవదానం రాజు
(రాహువు - చంచల స్వభావాన్నిచ్చేవాడు)
9. **కుహూయోగం** – పోల్కంపల్లి శాంతాదేవి
(కేతువు - భక్తికి, ముక్తికి)

ఈ కథల పోటీలో విజేతలైనవారికి ప్రకటించిన ప్రకారం నగదు బహుమతులను అందించాం. సాధారణ ప్రచురణకు తీసుకున్న కథల గురించి ఆ యా రచయిత(త్రు)లకు వ్యక్తిగతంగా తెలియజేయడం జరిగింది. -ఎడిటర్



ఎవరు అన్నారూ మెరుపు మెరిసేది మబ్బులోనూ... కళ్ళల్లోనూ అని? కరెక్షన్ ప్లీజ్! గుండెలో కూడా మెరుపు మెరుస్తుంది. ఓ దివ్య రహస్యం ఏదో తళుక్కుమన్నట్టుగా అవగతమైంది.

'ఇదీ' అని చెప్పలేని పూర్ణభావనతో ఆమె మనస్సంతా నిండిపోయింది. ప్రేమించటంలో ఆనందం పరాకాష్ఠను చేరుకుంది.

అతనితో మొదటిసారిగా సెక్స్‌లో పాల్గొన్నతర్వాత 'ఇంత ఆనందానికి కారణమైన నా శరీరాన్ని నేను ఇంకా ఇంకా ప్రేమిస్తున్నాను' అనుకుంది.

అలా చేసినందుకే అతనొక అబ్బురంలా కనిపించసాగాడు. "ఐ లవ్ లవ్ లవ్ యు!" చెప్పింది.



పార్లమెంట్‌లో అవిశ్వాసం చర్చకు రానీయకుండా వెళ్ళటాన్నిబట్టి కేంద్రం ఉద్దేశం అర్థంచేసుకోవచ్చు.
-శరద్‌పవార్, ఎన్.సి.పి. నేత

ఆ రోజునుంచి అతనికామె మరింత అపురూపమయిపోయింది.

'ఇంతగా ప్రేమించేవాళ్ళు కూడా ఉంటారా...?' అని ఆమెకే ఆశ్చర్యం వేసేలా ఉంది అతని ప్రవర్తన!

ఆ రాత్రి వేసుకున్న అతని నైట్‌డ్రెస్‌ని ఇష్టంగా తనతో తెచ్చుకుంది.

రాత్రిపూట ఆ డ్రెస్‌ని వేసుకుని పడుకుంటుంది. మొబైల్‌లో విష్ణుతో మాట్లాడీ మాట్లాడీ, ఎప్పుడో అర్ధరాత్రి దాటినతర్వాత పడుకుంది. వెంటనే నిద్రపట్టింది.కానీ సడెన్‌గా ఎవరో తట్టి లేపినట్టు అంతలోనే మెలుకువొచ్చింది. ఎందుకో క్షణంసేపు అర్థంకాలేదు.తరువాత అర్థమై విష్ణుకి మెసేజ్‌పెట్టింది.

'నిద్రలో నీకోసం నా చేతులు పక్క తడిమాయ్! ఇదుగో నన్ను నిద్రలోంచి లేపి ఏడీ...?' అని అడుగుతున్నాయ్...! ఏం చెప్పను ప్రియతమా'

"ఇదొక్క రాత్రికీ పడుకో! రేపు ఇక్కడికే వచ్చేద్దువుగానీ!"బదులు వచ్చింది. లేచి కర్టెన్ జరిపి కిటికీరెక్కలు తీసింది. బయట వెన్నెల కిటికీలోంచి లోపల పడుతోంది. ఎంతకీ నిద్రపట్టదే? లేచి దుప్పటీ, దిండూ తీసుకునిహాల్లోకి వచ్చి సోఫాలో పడుకుంది.

అక్కడే కూర్చుని టి.వి. చూస్తోన్న నీతూ అడిగింది- "ఏమయ్యిందీ?"

"అక్కడ నిద్ర రావట్లేదు"

"టీవీ కట్టేయనా?"

"ఇట్సోకే! ఉండనీ!" అంటూ ఒక ప్రక్కకు తిరిగి రెండు చేతులనీ చెవి కింద పెట్టుకుని, మోకాళ్ళు ముడుచుకుని, కళ్ళు మూసుకుంది. ఎప్పుడు నిద్రపట్టిందో... నీతు నిద్రలేపి, "ఊరికూరికే నిద్రలో నవ్వుతావేమిటీ? ఎవ్రీథింగ్ ఆల్‌రైట్?" అడిగింది.

ఆమెకేమీ అర్థంకాలేదు.

'అక్కడ నీకు నిద్రపట్టక ముద్దు పెట్టావ్ కదా? మరి నాకు సంతోషం వేయదా? ఈ పిచ్చి నీతూ చూడు!' ఇంకో మెసేజ్‌పెట్టింది.మరుసటి రాత్రి అతనింట్లోనే ఉండిపోయింది.

ఇద్దరూ కలిసి భోంచేశారు.

"విష్ణూ! ఆ రోజు రాత్రి తాతగారి ఫంక్షన్‌కి మీ ఇంటికి వచ్చినప్పుడు నాకు మీ డాబా ఎంత నచ్చిందో? ఈ రాత్రికి మీ డాబామీదపడుకుందామా? వెన్నెల్లో పడుకోవటమంటే నాకు చాలా ఇష్టం!" అని అడిగింది.

"ష్యూర్! చందమామలాంటి అమ్మాయి పక్కన వుంటే నాక్కూడా వెన్నెల్లో పడుకోవటం ఇష్టమే!" వెంటనే ఒప్పుకున్నాడతను.

ముందు పరుపూ, దుప్పటీ తీసుకు వెళ్ళి పరిచివచ్చాడు.తర్వాత వాళ్ళిద్దరూ వెళ్ళి డాబామీద పడుకున్నారు.

నవమినాడే పున్నమి అనిపించేలా ఓ పాలపుంత వెండివాగై రాత్రిలోకి ప్రవహిస్తోంది.

చుట్టూ నిశ్శబ్దంగా ఉంది. ఆ నిశ్శబ్దాన్ని చెదరకొట్టకూడదన్నట్టు పాగమంచుతెరలు కూడా నెమ్మదిగా నిశ్శబ్దంగా కమ్ముకుంటున్నాయ్!

డాబా మొత్తం వెన్నెల వెలుగులో స్నానం చేస్తున్నట్టుంది.

ఇంకా ఉంది

# హెల్త్ బిట్స్

## టీనేజ్ సెక్స్‌టర్స్



ఇది సందేశాల యుగం. ప్రతిఒక్కరూ ప్రతిక్షణం ఏదో ఒక సందేశం అందుకోవటమో, పంపటమో జరుగుతున్నది. వీడియో సందేశాలు వెళుతున్నాయి. ఈ సందేశాలు క్రమంగా సెక్సీ సందేశాలవుతున్నాయి. ఏడుగురిలో ఒకరు సెక్స్ సందేశాలు పంపుతుండగా నలుగురిలో ఒకరు సెక్స్ సందేశాలు అందుకుంటున్నారు.

39 అంతర్జాతీయ అధ్యయనాలలో లక్షమందికి పైగా టీనేజ్ పిల్లల సంక్షిప్త సందేశాల తీరుమీద అధ్యయనం చేయగా 15 శాతం మంది టీనేజర్స్ సెక్స్‌సందేశాలను ఇచ్చిపుచ్చుకుంటున్నట్టు తేలింది.

పైగా తమ వ్యక్తిగత ఫోటోలను, ఇతరుల వ్యక్తిగత క్షణాలను ఫోన్‌లో చిత్రీకరించి ఇతరులతో పంచుకుంటున్నారు.

సెక్సీ ఫోటోలు, వీడియోలు విరివిగా పంపిస్తున్నారు. ఇలా సెక్స్ సందేశాలు పంపే వారిని సెక్స్‌టర్స్ అంటున్నారు. సెక్స్ సందేహాలు పంపనివారిని వెనకబడిన వారిగా చూస్తున్నారు.

ఈ ఒత్తిడి అమ్మాయిలమీద తీవ్రంగా వుంది. ఒకదశ తర్వాత ఏం పంపుతున్నాము, వాటివల్ల వచ్చేటువంటి ఇబ్బందులు ఏమిటి! అనే విషయం మరచిపోయి సెక్సీ సందేశాల వలలో కూరుకుపోతున్నారు. ఈ సెక్స్ సందేశాలు వారి లైంగిక ప్రవర్తనను మార్చివేస్తున్నాయి. ◆

## అమ్మలకు ఆకుకూరలు



మహిళలు అందునా వయసు మళ్ళిన మహిళలకు ఆకుకూరలు అధికంగా ఇవ్వాలంటున్నారు ఆస్ట్రేలియన్ పరిశోధకులు.

క్యాబేజీ, కాలీఫ్లవర్ వంటివి, ఆకుకూరలు ప్రతిరోజూ ఆహారంలో భాగం చేసుకుంటే వయసు మళ్ళినతర్వాత వచ్చేటువంటిఇబ్బందుల్లో ఒకటైన పక్షవాతం సమస్య బారినపడరంటున్నారు.

పక్షవాతానికి కారణం మెదడుకు రక్తం సరఫరాలో లోపం. ఆ రక్తాన్ని తీసుకువెళ్ళే రక్తనాళం లోపలి పరిమాణం తగ్గకుండా చూస్తాయి ఆకుకూరలలోని పదార్థాలు.

ఆ రక్తనాళంలో లోపలి పరిమాణం తగ్గితే రక్తసరఫరా తగ్గి పక్షవాతమొస్తుంది. అదేవిధంగా రక్తనాళం మందం తగ్గుతుంది ఆకుకూరలవలన. దీనివలన రక్తనాళం మెరుగ్గా కొట్టుకుంటూ మెదడుకు రక్తసరఫరాని మెరుగుపరుస్తుంది.అందుకే ఆరునెలలపాటు ఆకుకూరలను ఏదో ఒక రూపంలో విడవకుండా తినమంటున్నారు. ◆

## తల్లినుండే ఆరోగ్యం



గర్భిణీ స్త్రీల విషయంలోచాలా జాగ్రత్తలు తీసుకున్న సమాజం మనది. నాలుగైదు నెలల నుండి పుట్టింటికి తీసుకువెళ్ళేవారు పెద్దలు. గర్భిణీ స్త్రీల మానసిక ఆందోళనల ప్రభావం పిల్లలమీదపడుతుందనే విషయంవారికి ఆ రోజుల్లోనే తెలుసు. ఎటువంటి మానసిక ఆందోళనకు, గురికాని ప్రశాంత పుట్టింటి వాతావరణంలో ఆమె ప్రసవం జరగాలన్నది పెద్దలమాట.

అదే సరైనపద్ధతి అంటున్నది తాజాపరిశోధన.కడుపుతో వున్నప్పుడు మానసికఒత్తిడికి గురైన తల్లుల పిల్లల ప్రవర్తన భిన్నంగా వుంటుందని, వారికి మూడున్నర సంవత్సరాల వయసులోనే ఆ విషయం అర్థమౌతుందని చెపుతున్నారు. చదువులో వెనకపడతారు. ప్రవర్తనతో విసిగిస్తారు.

దీనివలన తల్లి డిప్రెషన్‌లోకి మళ్ళీ వెళుతుంది. పిల్లలకు 11వ ఏడు వచ్చేవరకు తల్లిలో డిప్రెషన్ కొనసాగుతుంది. గర్భిణీ విషయంలో జాగ్రత్తలు కరువైతే పిల్లల భవిష్యత్తు దెబ్బతింటుంది. ◆

## తండ్రి పోలికతో ఆరోగ్యం



పిల్లలు పుట్టగానే ఎవరి పోలికలున్నాయనేది గమనించటం సహజం. అలా పుట్టిన పిల్లలలో తండ్రిపోలికలు ఎవరిలో అయితే కనిపిస్తాయో వారికి ఆరోగ్యం మెరుగ్గా వుంటుంది.

అది కూడా తొలి సంవత్సరకాలంలో వారు చాలా చురుకుగా,ఉత్సాహంగా వుంటారు. ఏడవటం తక్కువగా వుంటుంది.

దీనికి కారణం తండ్రి పోలిక వల్ల ఆరోగ్యం రావటం కాదు.

తన పోలికలు వున్న పిల్లలతో తండ్రులు ఎక్కువ సమయం గడపటానికి ఇష్టపడటం.

తన పోలికలున్న బిడ్డను చూసుకుని తండ్రి మురిసిపోతాడు. ఆ పిల్లలను తన చేతిలోకి తీసుకుంటారు. వారితో ఆడతారు,

వారిని ఆడిస్తారు. దీనివలన పిల్లల ఆలనాపాలనా తల్లితో పాటుగా తండ్రి తీసుకుని, పిల్లలకు ఎటువంటి అనారోగ్యాలు రాకుండా కాపాడగలుగుతారు.

ప్రతిరోజూ పిల్లలను తండ్రికూడా గమనించటంవల్ల ఏవైనా లోపాలు కనిపిస్తే వెంటనే పసిగట్టి చక్కదిద్దే యత్నం చేస్తాడు. అందువల్ల బిడ్డలు ఆరోగ్యంగా ఎదుగుతారు. ◆

## బాధా నివారిణి స్పర్శ



దంపతులలో ఒకరు ఏదైనా ఒక విషయంలో బాధపడుతున్నప్పుడు ఆ బాధ అలాగే కొంతసేపటిలో తగ్గిపోతుందిలే అని ఊరుకోకండి, వెళ్ళి వెంటనే వారి చేతిని మీ చేతిలోకి తీసుకుని వారి బాధను తగ్గించండి అంటున్నాయి తాజా పరిశోధనలు.

నవీన మానవులు సమాచారం ఇచ్చిపుచ్చుకునేందుకు ఎన్నో రకాల సాధనాలు వాడుతుండవచ్చు.

కాని వాటన్నింటికికన్నా ఉత్తమమైన కమ్యూనికేషన్ పద్ధతి స్పర్శ. అటువంటి స్పర్శకు దూరమై, స్మార్ట్‌ఫోన్‌లకు దగ్గరై బాధను పెంచుకుంటున్నారు.తన మనసులోని భావాన్ని సరిగ్గా అవతలివారికి పంచగలిగేది స్పర్శద్వారా మాత్రమే.

ప్రయోగాత్మకంగా దీనిని నిరూపించారు. తనకోసం మరొకరు ఉన్నారన్న భావం వారిలో బాధను దూరం చేస్తుంది. ఆ భావాన్ని అందించగలిగినది స్పర్శ. 




Review

## ఉపయోగం, ఉపదేశం రెండూ లేని యుద్ధం

టైటిల్ పట్టుకుని క్యారెక్టర్‌లు సెట్‌చేసుకోరాదు. క్యారెక్టర్లను పట్టుకుని కథ రాసుకోరాదు. విషయంలేని కథతో విజయంసాధించడం అసాధ్యం.

అనివార్యమగు ఈ పరాజయంగురించి శోకింప తగదు. ఈ వారం విడుదలైన 'కృష్ణార్జున యుద్ధం' సినిమాచూస్తే ఇలాంటి ఉపదేశ వాక్యాలు గుర్తుకు రావడం సహజం.

వరుసహిట్‌లతో జోరుమీదున్న హీరో నాని. రెండు సినిమాలు హిట్‌కొట్టి మూడో సినిమాకు రెడీ అయిన డైరెక్టర్ మేర్లపాక గాంధీ. ఇలాంటి కాంబినేషన్ అంటే అంచనాలు ఎలా వుంటాయి? అందునా డైరెక్టర్‌ది ఫన్ లైన్. హీరోది పక్కా లోకల్ ఫన్.

అలాంటప్పుడు సినిమా సూపర్ డూపర్‌గా వుంటుందని అనుకోవడం గ్యారంటీ. ఇలా ఇన్ని అంచనాల నడుమ విడుదలయింది 'కృష్ణార్జున యుద్ధం'. 'కృష్ణార్జున యుద్ధం' అంటే, కృష్ణుడు అర్జునుడు ఢీకొన్న వైనం కాదు, కృష్ణుడు, అర్జునుడు కలిసి వేరేవాళ్ళని ఢీకొన్న వైనం.

ఈ సినిమా చూడగానే వచ్చే డౌట్ ఏమిటంటే, అసలు టైటిల్ పట్టుకుని, క్యారెక్టర్లు ప్లాన్ చేసుకుని, వాటి చుట్టూ కథ అల్లుకున్నాడా? అన్నదే.

పోనీ అలాగే చేశారు అనుకున్నా, క్యారెక్టర్ల విషయంలోనే కొత్తదనం లేదు. 'హలో బ్రదర్'లో మాదిరిగానే ఓ ఫారిన్ నుంచి వచ్చిన కుర్రాడు, ప్లస్ పాప్ సింగర్. ఓ పల్లెటూరి మోటా కుర్రాడు. ఈ రెండు పాత్రల చుట్టూ అల్లుకున్న కథేంటంటే...

కృష్ణ(నాని) చిత్తూరు జిల్లాలో పల్లెటూరి కుర్రాడు. కనిపించిన అమ్మాయిలను సరదాగా గిల్లి, తిట్లుతినే టైపు. పొలాల్లో పిట్టలు పడి పాడుచేయకుండా డబ్బా కొట్టే, అతిచిన్న పనివాడు. అలాంటివాడు పోయి పోయి, ఊరి పెద్దమనిషి మనవరాలిని (రుక్సన్ ఢిల్లాన్) ప్రేమించేస్తాడు. ఈ సంగతి ఆ పెద్దమనిషికి

## 'బాఘీ 2' బ్రేక్

'లోఫర్' తర్వాత తెలుగునాట లోయర్ దశలోనే ఉండిపోయిన దిశాపటానీ ఉత్తరాదికి చెక్కేసి అక్కడ ఊపు అందుకున్నది. తనకు బాలీవుడ్‌లో ఏదో ఒక చిత్రంతో బ్రేక్ రాకపోతుందా! అన్న దిశ ఆశలు 'బాఘీ 2' చిత్రంతో నెరవేరాయి.

'బాఘీ 2' బాక్సాఫీస్ విజయాన్ని అందుకోవడంతో అటు పరిశ్రమలో, ఇటు ప్రేక్షకుల్లో చూపు దిశవైపు మరలింది. అందచందాలు ఒలికిస్తూ ఎప్పటికప్పుడు ఫోటోషూట్‌లు, సామాజిక మాధ్యమాల్లో హాట్‌హాట్‌గా టచ్‌లో వుంటున్న దిశకు ప్రస్తుతానికి మహర్దశ పట్టినట్లే ఉంది. ఈ ఊపుతో పారితోషికాన్ని భారీగా పెంచిందనేది వినికిడి. ◆

తెలిసి, ఆమెను మళ్ళీ పట్నానికి పంపేస్తాడు. అయితే ఆమె ఓ రోజు ఉన్నట్లుండి మాయం అవుతుంది.

ఇక అర్జున్ (నాని) యూరప్‌లో ఓ పెద్ద పాప్ సింగర్. కాస్త కాసనోవా టైపు. కనిపించిన అమ్మాయి నల్లా గోకేయడమే. అలాంటివాడు ఓ అమ్మాయి (అనుపమ)ను చూసి ప్రేమలో పడతాడు. కానీ ఆమె ఇతగాడిని కాదని ఇండియా వచ్చేస్తుంది.

కానీ ఆమెకూడా ఉన్నట్లుండి మాయంఅవుతుంది. ఈ ఇద్దరికోసం ఆ కృష్ణుడు, ఈ అర్జునుడు హైదరాబాద్ వస్తారు. ఒకేలా వున్న ఇద్దరు కలిసి ఏం చేశారు? చివరకు ఏం జరిగింది అన్నది మిగిలిన సినిమా.

కథకుడు, దర్శకుడు మేర్లపాక గాంధీ స్క్రిప్ట్‌లో లెక్కలు బాగా సరిచూసుకున్నాడు. ఈ హీరో సాదా సీదా పనిచేసే పల్లెటూరి ఆవారా.ఆ హీరో యూరప్‌లో వుండే మాంచి పాపులర్ సింగర్. ఈ అమ్మాయి, తనకన్నా చాలా తక్కువవాడైనా సరే ప్రేమిస్తుంది. ఆ అమ్మాయి తనకన్నా ఎక్కువవాడైనా సరే ప్రేమించదు. ఇద్దరు హీరో కామన్ పాయింట్, తము ప్రేమించినవారికోసం ప్రాణం ఇచ్చేయగలగడం.

ఇలా తూకం సరిగ్గా చూసుకోవడమే కాదు. రెండు పాత్రల నడకకు లింక్ పెడుతూ చక్కగా స్క్రిప్ట్ రాసుకున్నాడు. కానీ ఆ స్క్రిప్ట్‌ను తెరకెక్కించడంలో లెక్కలేనన్ని తప్పులు చేశాడు.

అవేంటంటే... హీరో నాని ది యూత్‌ఫుల్ ఫ్యామిలీ ఎంటర్‌టైన్‌మెంట్ జోనర్. అతగాడిని ఓ యాక్షన్ ఓరియెంటెడ్ ఉమెన్ ట్రాఫికింగ్ సబ్జెక్ట్‌లో చూపించాలనుకోవడం పెద్ద తప్పు. ఎంత సాఫ్ట్‌గా తీసినా, ఈ అమ్మాయిల అమ్మకం, బ్రోతల్ హౌస్‌లు అంటే ఫ్యామిలీలు దూరంగా వుంటాయి.

దర్శకుడు గాంధీ చేసిన రెండోతప్పు, చిత్తూరు మాండలీకం మాత్రమే కాకుండా, అక్కడి చిత్తూరు ప్రాంత పదజాలంకూడా వాడాలనుకోవడం. సప్తగిరి, సుదర్శన్ లాంటి కమెడియన్‌ల ద్వారా చిత్తూరు యాస పరిచయమేకానీ, అక్కడ పదకోశంకాదు. కానీ దర్శకుడు కృష్ణ క్యారెక్టర్‌కు అదే పదకోశం వాడాడు.

దాంతో కామెడీ పుట్టే సీన్లుకూడా అంతగా పండలేకపోయాయి. మూడో తప్పు ఏమిటంటే, ఈ థిన్ లైన్ సబ్జెక్ట్‌ను డబుల్ రోల్ అనే ఇంట్రెస్టింగ్ ఫ్యాక్టర్‌ను జోడించి, కాస్త పెద్ద సబ్జెక్ట్‌గా చేయాలనుకోవడం. దీనివల్ల ఏమయింది? ఒక పాత్రపండింది... మరోపాత్ర డీలాపడింది. పోనీదానివల్ల ఏంనష్టం అనుకుంటే, నష్టం జరిగింది. ఎలా? ఈ సినిమాకు దర్శకుడు రాసుకున్న టిపికల్ స్క్రీన్‌ప్లే వల్ల.

ఇక్కడ సీన్‌కు అక్కడి సీన్‌కు ముడి పెడుతూ స్క్రీన్‌ప్లే రాసుకునే టెక్నిక్ క్లిష్టమైనదైనా బాగుంది. కానీ ఇక్కడ సమస్య ఏమిటంటే ఇక్కడ సీన్ పండిన స్థాయిలో అక్కడి సీన్‌పండలేదు. కృష్ణ, అర్జునరెండూ పూర్తి కాంట్రాస్ట్ క్యారెక్టర్లు. అలాంటప్పుడు దర్శకుడు ఏది జనంలైక్‌చేయరో, దాన్ని పైకి లేపనన్నా లేపాలి లేదా చూపించడం తగ్గించడం చేయాలి.

'హలో బ్రదర్'లో ఈవీవీవాడిన టెక్నిక్అది. కానీ గాంధీ ఆ చమక్కు, గమ్మత్తు చేయలేకపోయాడు. దీంతో సినిమా రోలర్‌కోస్టర్‌రైడ్‌లా తయారైంది. కాస్సేపు బాగుండి, కాస్సేపు బాగోలేకుండా ప్రేక్షకులను కాస్త ఇబ్బందిపెట్టింది.

అయితే కృష్ణ క్యారెక్టర్‌ను ప్రెజెంట్ చేయడంలో, దాంతోనే ఫన్, దానితోనే ఎమోషన్, దాంతోనే మాస్ యాక్షన్ అన్నీ పండించగలిగాడు దర్శకుడు.

అందువల్లనే సినిమా కాస్తయినా ఓకె అనిపించుకుంది. వాస్తవానికి దర్శకుడు గాంధీ తన సినిమాల్లో వైవిధ్యమైన క్యారెక్టర్లు ప్రవేశపెట్టి, మాంచి కామెడి పండించే ప్రయత్నం చేస్తాడు. ఈ సినిమాలో కూడా




ప్రారంభంలో అలా ఒకటి, రెండు క్యారెక్టర్లు పడ్డాయి. కానీ వాటిని కొనసాగించడంలో విఫలమయ్యాడు. దీనికి కారణంకూడా సినిమాలో డబుల్‌ఫోజ్ వ్యవహారమే. ఇద్దరు హీరోలు,ఇద్దరు హీరోయిన్లు, ఇద్దరికీ పాటలు, ఇలా అన్నీ కలిసి సినిమాను లెంగ్త్ చేయడంతో, ఈ పాత్రలకు స్పేస్ లేకుండాపోయింది.

ద్వితీయార్థంలో పూర్తిగా పరిశోధనతో నడిపించడంతో కామెడికి పెద్దగా స్పేస్ కుదరలేదు. ప్రభాస్ శ్రీనుతో ఏదో ట్రయ్‌చేద్దాం అనుకున్నారుకానీ కుదరలేదు. ఇలాంటిసినిమాలో నాని కృష్ణగా చకచకా చేసుకుంటూ వెళ్ళిపోయాడు. అర్జున్‌గా ఏ విధమైన మార్కులుసంపాదించలేకపోయాడు.ఇద్దరు హీరోయిన్లకు పెద్దగాపాత్రలూలేవు, నటనకు చాన్సూలేదు.

టెక్నికల్‌గా సినిమా గ్రాండ్‌గానే వుంది. ఖర్చు కనిపిస్తోంది. కార్తీక్ ఘట్టమనేని సినిమాటోగ్రఫీ బాగుంది. హిపప్ సంగీతం మాత్రం వృథా.

ఒక్కపాటమినహా మరోపాట బాగుంటే ఒట్టు. నేపథ్య సంగీతంకూడా కాన్సెప్ట్‌తో వెళ్ళడంతో స్క్రీన్‌ప్లేలోవచ్చిన సమస్యే అక్కడావచ్చింది.దీంతో మొత్తం మీద బాగుంది... బాలేదు అనే మధ్యస్థంలో మిగిలిపోయింది 'కృష్ణార్జునయుద్ధం'. అంటే అటు గెలుపు కాదు, ఓటమీ కాదు. అలుపు అనుకోవాలి.

**ప్లస్‌పాయింట్స్...**
ఫస్ట్ హాఫ్, కృష్ణ పాత్ర ఫన్

**మైనస్‌పాయింట్స్...**
అర్జున్ పాత్ర, సెకండాఫ్

**పంచ్‌లైన్**
యుద్ధానికి సత్తా చాలలేదు ◆



## మై ఫేవరెట్స్

ప్రయాణాల్లో తనకు నచ్చే, తాను మెచ్చే హోటళ్ళు, ఆహారం గురించి వివరించింది పరిణీతిచోప్రా. "దుబాయ్‌లో పాలజ్జో వర్సాక్ హోటల్ అంటే అమిత ఇష్టం. సముద్రతీరాన, కల్చర్ విలేజ్ నడుమ వుంటుంది. దుబాయ్ ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్ట్‌కు పావుగంట దూరంలో వుంటుంది.

ఇటాలియన్ రెస్టారెంట్‌లోని ఆహారం మాట ఎత్తితేనే నోరూరిపోతుంది. మారినేటెడ్ సల్మాన్, క్రీమ్ ఛీజీ కాంబినేషన్ నాకు ఇష్టం. అవకాడో పూరి నచ్చుతుంది. వర్సాక్ హోటల్‌లోని ఎనిమిది డైనింగ్ ప్రదేశాల్లో విభిన్న పదార్థాల రుచి చూస్తుంటా. ఇక్కడి స్పా అద్భుతం" అని చెప్పింది పరిణీతి. ◆



## సైలెన్సే సమాధానం

అందాల అదాశర్మను ఏవైనా సీరియస్ విషయాల గురించి కదిలిస్తే, తనలోని సెన్సాఫ్ హ్యూమర్‌కు పనిపెట్టి నవ్వులతో దాటవేస్తుంది కాని, సీరియస్‌గా సమాధానాలు ఇవ్వదు.

ఉదాహరణకు కాస్టింగ్ కౌచ్ గురించి పరిశ్రమలో ఎవరిని ప్రశ్నించినా ఏదో ఒక సమాధానం ఇస్తున్నారు. కాని అదా మాత్రం పెదవుల్ని బిగించే ఉంచుతున్నది. విషయాన్ని చెప్పమని గుచ్చిగుచ్చి అడిగితే, మౌనాన్ని వీడక, "ఇది కాలం సమాధానం చెప్పాల్సిన విషయం" అంటూ ముచ్చటగా, ముక్తసరిగా దాటేసింది. ఔరా! ఏమా విషయం? ◆



## ఏమిటీ అన్యాయాలు

దేశంలో ఎక్కడే సామాజిక అన్యాయం జరిగినా ధైర్యంగా స్పందించడంలో తళుకులాడి తమన్నా ముందుబెంచీలోనే వుంటుంది. దేశంలో జరుగుతున్న అత్యాచారాలు, మహిళల భద్రతపై తన ఆవేదనను ట్విట్టర్ ద్వారా పంచుకున్నది తమ్ము.

"కాశ్మీర్‌లో ఎనిమిదేళ్ళ బాలికపై అత్యాచారం జరిగింది. ఇంకోచోట పదహారేళ్ళ యువతి అత్యాచారానికి గురయింది. తండ్రిని కోల్పోయి న్యాయ పోరాటం చేస్తున్నది. సంస్కరణలు జరగడానికి ముందు ఇంకెంతమంది బలికావాలి?

ఈ దేశం ఎటువెళ్తుంది?" అంటూ ఆవేదన, ఆక్రోశాలను వ్యక్తం చేసింది తమన్నా. ◆



## ఎలా ఆడుతున్నాయి?

- 'ఛల్ మోహన్ రంగా' ఫ్లాప్‌గా మిగిలిపోయింది. నిర్మాతకు నేరుగా కాకపోయినా, బయ్యర్ల ద్వారా నష్టాల భారం తప్పదు. త్రివిక్రమ్ శ్రీనివాస్- పవన్ కళ్యాణ్ లాంటి పెద్ద పేర్లు ఏవీ సినిమాను కాపాడలేదు.
- 'ఎమ్ఎల్ఏ' సినిమా బయ్యర్లకు నష్టాలుమిగల్చలేదు. అలా అని లాభాలు తేలేదు. నిర్మాతలకు మాత్రం కాస్త లాభాలు తెచ్చింది.
- 'రంగస్థలం' సినిమా విడుదల పదిరోజులకు బ్రేక్ ఈవెన్ సాధించింది. బయ్యర్లంతా సేఫ్‌జోన్‌కు చేరిపోయారు. ఇక లాభాలు కళ్ళ చూస్తారు. ఎందు కంటే ఇంకా మంచి షేర్ వస్తోంది కనుక. పైగా మార్కెట్‌లో పెద్దగా పోటీ సినిమా అంటూ ఏదీ లేదు. ◆

## ఆ రెండూ వుండాలి

నాన్నది ఇరాక్, అమ్మ ఆఫ్ఘన్- కాబుల్‌లో పుట్టి, పెరిగింది- ఇదీ వరీనా హుస్సేన్ నేపథ్యం. ఐదేళ్ళ నాడు ఢిల్లీ చేరి, అప్పటినుంచి మోడల్‌గా పేరొందింది. క్యాడ్‌బరి, డెయిరీ మిల్క్ టీ.వీ. కమర్షియల్స్‌తోపాపులర్. తొలి బాలీవుడ్‌ప్రాజెక్టు లవ్ రాత్రి. ఏకంగా సల్మాన్‌ఖాన్ బావమరిది ఆయుష్ శర్మ సరసన అవకాశాన్ని పొందింది.

"ఆఫ్ఘన్లు హిందీ సినిమాలంటే ఇష్టపడతారు. వారం అంతా ఏక్తాకపూర్ షోలు, వారాంతంలో హిందీ సినిమా తప్పనిసరి" అంటున్న వరీనా దృష్టిలో విద్యాబాలన్, కంగనా రనౌత్‌లు పవర్‌ఫుల్ తారలు. ఆమెకు అభిమానులు. తన కలల్ని తరుముకుంటూ బాలీవుడ్ చేరిన ఈ ఆఫ్ఘన్ పోరి ఎంతలా పాతుకుపోతుందో చూద్దాం.



## జిల్ జిల్ జిగేల్

'రంగస్థలం'లో జిల్‌జిల్ జిగేల్ అంటూ ప్రత్యేక పాట చేసిన పూజాహెగ్డే భలేగా వుందన్న ప్రశంసలు అందుకుంటున్నది.

అందం విషయాన్ని ఆమెను కదిలిస్తే 'చాలా జాగ్రత్తలు తీసుకుంటా' అంటూ ఫ్రాంక్‌గా, ఠక్కున సమాధానం చెప్పేసింది.

"నేను అందంగా కనిపించడానికి అనేక జాగ్రత్తలు తీసుకుంటా. రసాయనాలున్న సౌందర్య ఉత్పత్తులు అస్సలు వాడను. నాణ్యమైనవాటినే ఎంచుకుంటుంటా. మేకప్ తొలగించుకోనిదే అస్సలు నిద్రపోను.

మా బామ్మలదగ్గర అందాల చిట్కాల్లు తెలుసుకుని పాటిస్తుంటా. క్రమంతప్పకుండా స్విమ్మింగ్ చేస్తాను" అంటూ వివరించింది. ◆

# చివరి రోజుల్లో...

సైన్స్‌ని మలుపుతిప్పినవారి జాబితాలో గెలీలియో, ఐన్‌స్టీన్‌ల సరసన చేరే పేరు స్టీఫెన్ హాకింగ్. భౌతికశాస్త్ర పరిశోధనలోనే కాక అంతరిక్ష అంశాలను అర్థంచేసుకునే యత్నంచేసినవారు వారంతా. ఇరవైయవ శతాబ్దపు సంచలనం ఐన్‌స్టీన్ అయితే 21వ శతాబ్దపు సంచలనం హాకింగ్.

వీరి ముగ్గురిమధ్య ఏదయినా సంబంధముందా! ముగ్గురి జీవితాలు చూసినప్పుడు ఒక తమాషా కనిపిస్తుంది. గెలీలియో మరణించిన తేదీనాడు హాకింగ్ పుట్టాడు. ఐన్‌స్టీన్ పుట్టిన తేదీన హాకింగ్ మరణించాడు. ఇదంతా కాకతాళీయమే.

ఐన్‌స్టీన్‌కి చిన్నప్పుడు లెక్కలు సరిగ్గా రావని, సైన్స్‌కి పనికిరావని అన్నారంటారు.

స్టీఫెన్‌హాకింగ్ కూడా స్కూల్‌లో చురుకైన విద్యార్థే కాని ఏదో లోపించింది అనేవారట. హాకింగ్ ఎప్పుడూ స్కూల్‌లో ఫస్ట్ ర్యాంక్‌లో నిలవలేదు.

అసలు ఫిజిక్స్ చదవటం దండగ, ఏ ఉద్యోగం దొరకదు. నిరుద్యోగిగా బతకలేవు అని తండ్రి స్టీఫెన్‌ని మెడిసిన్‌వైపు మళ్ళమన్నాడు. వైద్యరంగంలో శిక్షణ పూర్తిచేసుకుంటే కనీసం ఇంజక్షన్‌లు చేసి కాంపౌండరుగా అయినా ఏదో కొంత ఆదాయం పొందగలవన్నది తండ్రి సలహా. తండ్రి డాక్టర్.

మనుషులమీద ఆధారపడి బతికే పరాన్నజీవులను అధ్యయనంచేసే విభాగానికి అధిపతి. తండ్రి అలా చెప్పినా హాకింగ్ ఫిజిక్స్‌మీదున్న మక్కువను వదులుకోలేదు. అందులోనే అత్యున్నత స్థానానికి చేరాడు.ఫిజిక్స్‌లో నోబెల్ బహుమతి ఒక్కటి తప్పించి మిగిలిన అన్నిరకాల బహుమతులనూ అందుకున్న పరిశోధకుడు, శాస్త్రవేత్త స్టీఫెన్ హాకింగ్.

స్టీఫెన్ హాకింగ్ జీవితం గొప్ప స్ఫూర్తిదాయకం. ఒక చిన్న అనారోగ్యం సోకగానే జీవితంలో ఇక ఏమీ చేయలేమని తమ లక్ష్యాలను పక్కనపెట్టి ఆ రోగం గురించే ఆలోచిస్తూ కుంగుబాటుకు గురవుతారు చాలామంది. కాని శరీరం మొత్తం చచ్చుబడిపోయినా, జీవితమంతా చక్రాల కుర్చీకి పరిమితమైనా జీవితంలో కుంగుబాటు అనేది తెలియకుండా చివరి క్షణంవరకు ఉత్సాహంగా గడిపాడు స్టీఫెన్.

21 ఏళ్ళ వయసున్నప్పుడు ఆయనకు అత్యంత అరుదైన నాడీ సంబంధిత వ్యాధి వచ్చిందని నిర్ధారించారు. ఆ వ్యాధి మనిషి శరీరాన్ని క్రమంగా చచ్చుపడేలా చేస్తుంది. ఒక భాగం తర్వాత మరొకటి పని చేయటం మానేస్తాయి.

చివరికి ఊపిరి పీల్చేందుకు కూడా కండరాలు సహకరించక ప్రాణం పోతుంది. ఇదంతా జరగటానికి రెండు, మూడేళ్ళు పడుతుంది.

అంటే స్టీఫెన్ హాకింగ్‌కి పాతికేళ్ళ వయసును దాటే అదృష్టం లేదు. అదీనాడు వైద్యులు చెప్పిన విషయం. వైద్యశాస్త్రాన్ని ధిక్కరించి 1968తో జీవితం ముగుస్తుందన్నదాన్ని మరో 50 ఏళ్ళపాటు పొడిగించిన ధీశాలి స్టీఫెన్ హాకింగ్.

శరీరం పనిచేయకపోతేనేం మెదడు పనిచేస్తోందిగా అనుకున్నాడు. ఒక దశలో న్యుమోనియాకి గురయి గొంతు పూర్తిగా పోయింది.ముఖంలోని ఒక కండరం, ఒక వేలు మాత్రమే పనిచేస్తున్నాయి. వాటి సహాయంతోనే తాను చెప్పాలనుకున్న విషయాన్ని కంప్యూటర్ తెరమీదికి ఎక్కించాడు.

'నిమిషానికి 15 పదాలు వస్తే గొప్ప. అయినా ఆ పరిమిత పదాలే మహాభాగ్యం. అవి వినటానికి వేచివుంటాం' అంటూ ప్రపంచంలోని మేధావులు, సామాన్యులు చప్పట్లుకొట్టి స్వాగతించారు.

తనకు తానుగా ఏమీ చేసుకోలేని స్థితిలో కూడా మెదడు శక్తి ఎంత గొప్పదో నిరూపించాడు.

**సైన్స్ లేకుంటే జీవితం లేదు. రాజకీయాలు సైన్స్‌ని శాసిస్తున్నాయి. కాబట్టి సరైన రాజకీయవేత్తలను ఎన్నుకోవాలన్నది హాకింగ్ పిలుపు. భూగోళ తాపం పెరుగుతున్న దశలో, పర్యావరణం పట్టనివారు పాలకులవుతున్నారని ఆవేదన వెలిబుచ్చాడు. మానవాళి మరో గోళంమీదికి వలస వెళితే తప్పించి బతికి బట్టకట్టలేదన్నాడు స్టీఫెన్ హాకింగ్.**

జీవితం నిస్తేజంగా గడవటం అనేదాన్ని స్టీఫెన్ హాకింగ్ అంగీకరించలేదు.ఎప్పుడూ ఏదో కొత్త ఆలోచనే. 64 ఏళ్ళ వయసులో అంతరిక్షంలోకి వెళ్ళాలన్నది నా చిరకాల కోరిక అన్నాడు.

భారరహిత స్థితిని తన శరీరం తట్టుకోలేదేమోనని మిగిలినవారనుకున్నా ఒక ప్రత్యేక విమానంలో ఆకాశంలోకి వెళ్ళి భారరహిత స్థితిలో గాలిలో తేలి కిందికి రావటం ఆయన 2007లో సృష్టించిన సంచలనం.

గ్రహాంతరవాసుల గురించి తన వ్యాఖ్యలతో సంచలనం సృష్టించాడు 2010లో. గ్రహాంతరవాసులు ఉండేవుంటారు. కాని వారిని కలవకూడదు. అవి మన భూగోళ సంపదను దోచుకునేందుకు వస్తాయి అని స్టీఫెన్ హాకింగ్ చెప్పినప్పుడు-

'ఏమిటి ఇలా చెపుతున్నాడు... మెదడు గతి తప్పిందా' అనుకున్నవారు లేకపోలేదు.

దానికి తగినట్టుగానే ఇక కోలుకోలేని రోగానికి గురయినవారిని మర్యాదగా ఈ లోకంనుండి పంపించేందుకు ఆత్మహత్యలో సహకరించడం మంచిదంటూ చేసిన ప్రకటన సంచలనమే.

2013లో ఆయన చేసిన ప్రకటన తన జీవితం అంతంచేసుకునే ఆలోచనలోకి వెళ్ళాడా! అనిపించింది. కాని నాలుగేళ్ళక్రితం తాను ఐస్ బకెట్ సవాల్‌ని స్వీకరించానని ప్రకటించి తాను జీవితంలో దేనికీ భయపడనని నిరూపించారు.

ఏదయినా ఒక విషయంమీదికి ప్రపంచ దృష్టిని మరల్చేందుకు బహిరంగ ప్రదేశంలో నిలబడి శరీరం మీద ఐస్‌గడ్డలు కుమ్మరించుకోవటం అనేది ఐస్ బకెట్ సవాల్. సైన్స్ లేకుంటే జీవితం లేదు.

రాజకీయాలు సైన్స్‌ని శాసిస్తున్నాయి. కాబట్టి సరైన రాజకీయవేత్తలను ఎన్నుకోవాలన్నది హాకింగ్ పిలుపు. అమెరికాకి డొనాల్డ్ ట్రంప్ అధ్యక్షుడు అనే ఆలోచనే తాను అంగీకరించలేకపోయాడు.

భూగోళ తాపం పెరుగుతున్న దశలో, పర్యావరణం పట్టనివారు పాలకులవుతున్నారని ఆవేదన వెలిబుచ్చాడు. మానవాళి మరో గోళంమీదికి వలస వెళితే తప్పించి బతికి బట్టకట్టలేదన్నాడు స్టీఫెన్.

వయసుతో వచ్చే అనారోగ్యాలకు ఆసుపత్రికి వెళ్ళి రావటం తప్పకపోయినా ఏ రోజూ తన ఇబ్బందుల గురించి బయటకు చెప్పనిచ్చేవాడు కాదు.

ఆయనను వేధించిన అనారోగ్యంకన్నా వయస్సుతో వచ్చిన ఇబ్బందులు గొప్పవి కాదు అన్నది స్టీఫెన్ హాకింగ్ అభిప్రాయం. ఆయన ఆలోచనలకు తగినట్టుగానే మార్చి 18, 2018 రాత్రి ప్రశాంతంగా తనువు చాలించారు.



స్టీఫెన్ హాకింగ్
(1942 - 2018)

# ఈ శీర్షిక మీదే

ఉత్తమ ప్రశ్నకు ₹ 500, ప్రతి ప్రశ్నకు ₹ 300 బహుమతి

## ఉత్తమ ప్రశ్న-సమాధానం

➤ డి.శ్రీలక్ష్మి, హైదరాబాద్
**'ఫేస్‌బుక్' ఇచ్చే సందేశం?**
ఫేసు 'బుక్కు' కాకుండా చూసుకోమని.

➤ ఎ.అశోక్‌కుమార్, హైదరాబాద్
**క్రమశిక్షణ నేర్పే అక్షరం?**
'Q'.

➤ పి.ఎస్.ఆంజనేయులు, కనిగిరి
**నోరు, గుండె, కాలు, చేయి కామెంట్ ప్లీజ్?**
అప్పుడప్పుడు జారుతుంటాయి.

➤ డి.వి.చంద్రశేఖర్, కర్నూలు
**ఉత్తమ నటులు?**
టీ.వీలో న్యూస్‌రీడర్లు వార్తల్ని చూసి చదువుతూ చూడకుండా చదువుతున్నట్లు నటించడం.

➤ ఆర్.ప్రశాంతి, విజయనగరం
**'ఏడు'పు తెప్పించేవి?**
'ఆరో'పణలు.

➤ కె.వి.ఎస్.ఎస్.ఎల్.ఎన్.నగేష్, విశాఖపట్నం
**ఒప్పుకోవాల్సిన నిజం?**
ఫోన్‌లకు 'ఖైదీలం' అయిపోయాం కాబట్టే వాటిని 'సెల్'ఫోన్లని పిలవడం.

➤ పి.వి.రమణకుమార్, చిలకలూరిపేట
**కాలం చెల్లిన మాట?**
లక్షాధికారి.

➤ చప్ప నాగేశ్వరరావు,పాములవలస
**తెలివైన నిర్మాత?**
"గత రెండు సంవత్సరాలుగా సినిమాలు తీయడం మానేసి నాలుగు డబ్బులు వెనకేసుకున్నాను" అని చెప్పేవాడు.

➤ బి.మాన్‌సింగ్ నాయక్, కారంపూడి
**సెంట్రీకి రాకూడని ప్రాబ్లమ్?**
డీసెంట్రీ.

➤ బొబ్బా సత్యనారాయణ, హైదరాబాద్
**హోమ్ డెలివరీ అంటే?**
ఆసుపత్రిలో కాకుండా ఇంట్లోనే 'పురుడు'పోసుకోవడం.

# B హ్యాపీ

"ఏమిత్రా మీ ఇంట్లో ఫ్యాన్ గిర్రున తిరుగుతున్నా దోమలు తెగ కుడుతున్నాయి"

"అవా... మా ఇంటి ఫ్యాన్‌గాలికి బాగా అలవాటు పడ్డాయిరా.. ఫ్యాన్ వేసినపుడే వస్తున్నాయి కుట్టడానికి" అన్నాడు పరంధామయ్య.

లంచ్ అవర్లో కొలీగ్స్ అంతా క్యారియర్ విప్పుతుంటే శంకరం ఒక్కడే కూర్చున్నాడు.

"ఏమైందిరా" అంటే, "మా ఆవిడ మీద కోపం వచ్చిందిరా!" అన్నాడు. "కోపానికి, క్యారియర్ తెచ్చుకోకపోవటానికి సంబంధం ఏమిత్రా..."

"మరి మా ఇంట్లో వంటచేసేది నేనే కదా"

"కొత్త ఇంటిలో సగం అప్పుడే అమ్మేస్తున్నావా... ఎందుకు?" అడిగాడు రాజేష్.

"గృహప్రవేశ భోజనాల ఖర్చు తడిసి మోపెడయ్యి..." అన్నాడు కుమార్.

బాగా చదివించాలని చిన్నప్పటినుండే పట్నంలో హాస్టల్‌లో పెట్టి చదివించిన కొడుకును చదువు అయిపోయిందని సొంతూరికి తీసుకువచ్చాడు వెంకయ్య. ఇంట్లో ఎద్దు జొన్నకర్రలు మేస్తుంటే అలా వింతగా చూస్తున్న కొడుకును "ఏరా అది చూస్తుంటే ఏదైనా పాఠం గుర్తుకువస్తున్నదా..." అడిగాడు వెంకయ్య.

"లేదు నాన్నా... ఆరడుగుల జొన్నకర్ర అతి చిన్న ఎద్దు పొట్టలోకి ఎలా పడుతుందా! అని ఆలోచిస్తున్నా నాన్నా..." అన్నాడు కొడుకు.

"మీ ఆయన తలచుకుంటే నిమిషంలో వంద మందిని చంపుతాడా! ఎలాగే!!"

"ఆయన లారీ డ్రైవర్"

"ఓస్ అంతేనా... మా అమ్మాయి గొంతు విప్పి వందమందిని చంపేస్తుంది తెలుసా!" "అదెలాగే"

"మా అమ్మాయి టీవీలో యాంకర్ మరి"

"మీ ఆవిడ అన్నం తినటం మానేస్తే ఆనందించాలిగాని ఏడుపుముఖం ఏమిత్రా"అన్నాడు రాజా.

"ఏం చెయ్యనురా... నన్ను మాత్రం తింటూనే వుంది మరి" అన్నాడు గోపి.

ఖంగు ఖంగుమని దగ్గుతూ వచ్చాడు చంద్రం. డాక్టర్ మందు ఇచ్చాడు.

"అయితే దగ్గు తగ్గుతుందా డాక్టర్"

"కాదు మందు చెవులు పనిచేయకుండావుండటానికి ఇచ్చా... హాయిగా నిద్రపో" అంటూ పంపించాడు డాక్టర్.

న్యూటన్ బ్రిటీష్ పార్లమెంట్ సభ్యుడిగా వున్నప్పుడు భూమ్యాకర్షణశక్తి కనుగొన్న ఆయన ఏం మాట్లాడతాడా అని మిగిలిన సభ్యులు ఆశగా ఎదురు చూసేవారు. ఒక్కసారే ఆయన ఎందుకో లేచి నిలుచునేసరికి ఏదో ఒక గొప్ప విషయం మీద మాట్లాడతాడని మిగిలిన సభ్యులంతా సైలెంట్ అయిపోయి న్యూటన్‌వైపు ఆసక్తిగా చూడసాగారు.

"కొంచెం ఆ కిటికీ తలుపులు మూయిస్తారా!మరీ చల్లగాలి ముఖానికి తాకుతోంది"అంటూ చెప్పి తన సీటులో కూర్చుండిపోయాడు న్యూటన్.

## ఈ కార్టూన్ మీదే





